శ్రీరస్తు

# రాఘవపాండవీయము.

పింగళి సూరనామాత్యప్రణీతము.





వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

శ్రీ ర స్తు.

# రాఘవపాండవీయము.

పింగళి సూరనామాత్యప్రణీతము.





చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1940.

# విజ్ఞప్తి.

ద్వ్యర్థిప్రబంధములలోఁ బ్రాముఖ్యతను గన్న యీప్రబంధమును ముద్రింపింపవలయు నని మేము చాలాదినములనుండి కృతప్రయత్నులమయ్యును నితరగ్రంథములఁ గొన్నిఁటిని ముద్రింపించి పిమ్మట దీని ముద్రింపింత మనుకొనుచుండఁగా నింతట శ్రీమత్పిఠాపురసంస్థాన ప్రభువులును విద్యాభిమానులును నగు శ్రీరాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావుబహదరువారి గ్రంథముద్రణకుఁ దగినధనసహాయ మొనరించి మా కెంతయుఁ బ్రోత్సాహము గలిగించినందున నిప్పటికి దీనిని మాతండ్రిగారిచేఁ బింగళ (1857-వ సంవత్సరమున ముద్రింపింపఁబడిన చక్కనిప్రతి నాధారముగాఁ జేసికొనియే మరల ముద్రింపించితిమి. ముద్రణావస్థలోఁ దటస్థించినలోపము లెవ్వియైన నున్నచో "గచ్ఛతః స్ఖలనం క్వాపి" యనున్యాయము తా మెఱిఁగినదియే కనుక మన్నింపవలయు నని చదువరులఁ బ్రార్థించుచు మ మ్మింకను నుద్గ్రంథముల ముద్రింపించుచుండుటకై ప్రోత్సాహము గలిగించుచుందురుగాక యని శ్రీవారికిఁ గృతజ్ఞతాసూచకముగా ననేక ధన్యవాదములఁ జేయుచున్నారము.

ఈ రాఘవపాండవీయమునకు మిక్కిలి ప్రశస్తమైన పీఠికను వ్రాసియిచ్చిన బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రులవారికి నమస్కారశతంబులొనరుచున్నాము.

ఇట్లు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# ఉపోద్ఘాతము.



ఇమ్మహాకావ్యమును నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వచాతుర్యధుర్యుం డైనపింగలి సూరనార్యుఁడు రచియించెను. ఈమహాకవి నియోగిబ్రాహ్మణుఁడు. యాజుషశాఖాధ్యయనపరుఁడు. గౌతమగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. అమరనార్యునకును అబ్బమ్మకును బుత్త్రుఁడు. సూరనార్యునకుఁ బౌత్త్రుఁడు. భావనామాత్యునకు దౌహిత్రుఁడు. ఇతనికిఁ దమ్ము లమలన యెఱ్ఱన యనువార లిరువురు గలరు. ఈయర్థము రాఘవపాండవీయకళాపూర్ణోదయములలోని

సీ. "శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు సుచరిత్రుఁ బింగలి సూరసుకవి
పౌత్త్రు నన్నపపతిభావనదౌహిత్రు నమరధీమణికి నబ్బమకుఁ బుత్త్రు
ననుజన్ము లైనట్టియమలన యెఱనార్యు లతిభక్తి సేయంగ నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని సూరననామవిశ్రుతుని నన్ను."

* * * * ఆ - ౧. ప - 9.

అనుపద్యపుసీసపాదములను బ్రభావతీప్రద్యుమ్నములోని

క. "గౌతమగోత్రునకును బ్ర,ఖ్యాతాపస్తంబసూత్రయాజుషశాఖా
ధీతిపవిత్రునకును లో,కాతిగవశితాజితాంతరామిత్త్రునకున్."

అనుపద్యమునను స్పష్టమయ్యెడు.

ఈవంశమువారికిఁ బింగలి యనుగ్రామమున నివసించినకారణమునఁ బింగలివా రనిపేరు వచ్చినట్లు ప్రభావతీప్రద్యుమ్నములోని

మ. "తరముల్ నాల్గయి రెండురెండు నగుఁ దత్తద్గ్రామనామంబులం
బరఁగున్ వంశము లెల్లఁ బూర్వపునిజప్రఖ్యాతి మాయంగ నే
మరుదో పింగలినామ మందుఁ జిరకాలావాసు లై యున్నసు
స్థిరతం గోకనమంత్రివంశజులకుం జెన్నొందు మి న్నందుచున్."

అనుపద్యమువలనం దెలియవచ్చెడు. పింగలి యనుగ్రామము కృష్ణా

మండలములో నున్నదని కవిచరిత్రమందుఁ జెప్పఁబడియుండెడు. ఈకవి తండ్రి యగునమరనార్యుఁడు రాజేంద్రగురువంశమునం బుట్టిన సోమారాధ్యునకు శిష్యుఁ డైనశైవాచారపరుఁడని ప్రభావతీప్రద్యుమ్నములోని

క. “శ్రీమద్రాజేంద్రగురు,స్వామిస్థిరవంశకలశజలనిధిసోమ
త్సోమారాధ్యకృపాల,బ్ధామలశివభక్తిశోభితాచారునకున్.”

అనుపద్యమువలన నేర్పడియెడు.

ఈకవి జీవించియుండినకాలముం గూర్చి శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు కవిచరిత్రమందు సయుక్తికంబుగఁ జర్చించి క్రీస్తుశకము 1566 సంవత్సరముల ప్రాంతమున నుండినవాఁడని నిర్ధారణము చేసిరి. శ్రీకృష్ణదేవరాయలు 1530-వ సంవత్సరముననే కీర్తిశేషుఁడగుటచే నీకవి తదాస్థానమం దష్టదిగ్గజము లని పరిగణింపఁబడినవారిలో నొక్కఁ డని తలఁప నవకాశము లేదనియుఁ గవిచరిత్రమునందే సిద్ధాంతము చేయఁబడి యుండెడు. దీనికి వలసినయంశముల నెల్ల సాకల్యముగఁ జర్చింపకయే యీతఁడు శ్రీకృష్ణరాయలకాలమువాఁడు గాఁడని సామాన్యముగను నూహింపవచ్చును. పింగలి సూరనార్యుని కవితాచమత్కృతి యత్యంతాదరణీయ మని వేనోళ్లఁ బొగడఁదగియుండుటయు, సుకవులయెడ శ్రీకృష్ణదేవరాయల కత్యంతాదరము కలిమియు విద్వాంసులకెల్లఁ దెల్లంబ కదా. శ్రీకృష్ణదేవరాయలకాలమునం దీకవి వాస్తవముగ నుండియుండునేని యాకువీటి పెదవేంకటరాయలకును నంద్యాలకృష్ణరాయలకును దనకావ్యముల నంకితము చేసినయీకవి తాను గవియై కవితాదరణబద్ధదీక్షుం డైన శ్రీకృష్ణదేవరాయలనాశ్రయింపక యుపేక్షించుట యీకవికిని, సరసనిరుపమకవన కౌశలమున కలరుచు నిమ్మహాకవిని నిజాస్థానంబునఁ జేర్చుకొన కొప్పరికించుట యావిద్వత్ప్రభుమణికిం బొసఁగునే? కావున నారాజాధిరాజకవియు నీకవిరాజాధిరాజును సమకాలికులుగా నుండియుండ రని నిరాక్షేపముగ నిశ్చయింపఁ దగియుండెడు.

ఈకవిశ్రేష్ఠుండు చిన్నచిన్నకృతు లెన్ని యోగాక గరుడపురాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయ మను గ్రంథముల రచియించి

పిదపఁ బ్రభావతీప్రద్యుమ్నమునకుఁ దొడఁగినట్లు ప్రభావతీప్రద్యుమ్నములోని యీక్రిందిపద్యమునఁ దెలియవచ్చెడు.

మ. "జనముల్ మెచ్చఁగ మున్ రచించితి నుదంచద్వైఖరిన్ గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుంగబ్బము లెన్నియేనియును మత్పిత్రాదివంశాభివ
ర్ణనలేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల వత్యంతమున్."

ఈకవి గిరిజాకళ్యాణ మనుమఱియొక్క కావ్యముం గూడ రచియించినట్లు రంగరాట్ఛందములో నుదాహరింపఁబడిన పద్యమునం దెలియవచ్చెడు నని కవిచరిత్రమునందు వ్రాయఁబడియుండెడు. పైపద్యమునం బేర్కొన్న నాలుగు గ్రంథములలో గరుడపురాణం బొక్కటి దక్కఁ దక్కినవి యెల్లెడలం బ్రచారంబుఁ గాంచియుండెడు. ఆంధ్రగ్రంథరచనఁ దొలుదొలుత సంస్కృతపురాణేతిహాసముల భాషాంతరీకరణరూపముగా నన్నయభట్టారకాదు లారంభించియుండుటం గాఁబోలు నీకవియుఁ దొలుతఁ దద్విధమున బాల్యవయస్సునం గరుడపురాణ మాంధ్రీకరించి యట నాంధ్రకవితాపితామహుం డైనయల్లసానిపెద్దనామాత్యుండు మార్గదర్శిగా వెలయు ప్రబంధరచనకుం గ్రేళ్లువాఱుడెందముతోఁ దక్కినవానిని రచియించెను. అందు రాఘవపాండవీయరచనాకౌశలం బనన్యసాధారణంబు. ఇట్టికథాద్వితయ ఘటనావైచిత్రి కిమ్మహాకవియే తొలుదొలుతఁ ద్రోవ త్రొక్కినవాఁడు ఇతనితెరువుగొని రామరాజభూషణకవియు హరిశ్చంద్రనలోపాఖ్యానంబు రచియించెఁగాని మఱెవ్వరు నిట్టి కథాద్వయసంఘటనచమత్కారమున నొప్పారురసవత్కావ్య మింతకుం జేయరైరి. ఇంతియగాక కళాపూర్ణోదయమును రచియించి నూతనకథాకల్పనాచమత్కృతిం గవివతంసుల కాహ్లాదంబు నాపాదించె. మొట్టమొదటం బ్రబంధరచనఁ గావించినకారణమున నల్లసానిపెద్దనామాత్యున కాంధ్రకవితాపితామహుఁ డనుబిరుదుగలిగిన ట్లీమహాకవికి ననన్యసామాన్యం బగుశ్లేషమూలక కథాద్వయఘటనావైచిత్రికిని నూతనకల్పనాచమత్కృతికిం దెరువు చూపిననేర్పునకుఁ దగిన బిరుదు లెన్నియేఁ గలుగవలసియుండిన నాకాలమున శ్రీకృష్ణరాయలుగాని యంతటివిద్వన్మహాప్రభువుగాని లేమిం జేసి కాఁబోలు నట్టివి దుర్లభంబు లయ్యె.

రాఘవపాండవీయమందు

శా. "రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్య మెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుకబ్బం బద్భుతం బంద్రు ద
క్షుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్." ఆ-౧. ప-10.

అనిచెప్పినరీతి నొక్కకావ్యమే వినువారికి రామాయణభారతకథార్థంబుల రెంటిని వివరించినట్లు శ్లేషసంయోజనం బొనర్పు టెంతయు దుష్కరం బని కవుల కందఱకు ననుభవగోచరంబకదా. అలంకారములలో నెల్ల నుపమోత్ప్రేక్షోల్లేఖాదులు రసపుష్టి నించి శ్రోతృచిత్తముల కానంద మొడఁగూర్చుఁగాని శ్లేషాలంకార మట్టిది గాదని కొందఱు తలంతురు. అయ్యర్థము ప్రకృతవర్ణనాప్రసంగమున నప్రకృతార్థమున ననేకార్థక శబ్దప్రయోగమునం బరిస్ఫూర్తిఁ గలిగించు శ్లేషవిషయమునఁ దోఁచినం దోఁపవచ్చునేమొ కాని సభంగశబ్దశ్లేషబహుళం బైన రాఘవపాండవీయమునం దట్టియభిప్రాయ మెవ్వారికిం గలుగఁ జాల దని తలఁచెదను. అతి విస్తృతంబు లైన రామాయణభారతకథార్థంబులు వివరించు నెడ ననేకార్థకశబ్దప్రయోగము శ్లేషప్రధానము గాని కావ్యములందుఁబోలె నత్యంతవిరళంబుగాఁగఁ గేవలపదవిభాగమాత్రమున శబ్దభేదం బేర్పడఁ దనంతన వివక్షితార్థప్రతిపాదకంబుగాఁ గావ్యమెల్ల రచియించుటం జూడ నిమ్మహాకవికిఁ గలయుభయభాషాపాండిత్యసామర్థ్యంబు లవాఙ్మనసగోచరంబు లని యెవ్వారికేనియు నొప్పుకొనక తప్పదు.

ఈకవి తాను గథాద్వయసంఘటనంబు సేయునెడ నేర్పఱుచు కొన్ననియమముల వివరించుచు గ్రంథాదియందు

సీ. "ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష యొకొక్కచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట నర్థశ్లేష యొక్కొకతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేషఘటన యొక్కొకతఱి నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక్కతఱి నివి యొక్కొక్కతఱిని రెండు

తే. మూఁడుగూడుటయుఁననసముజ్జ్వలముగ, నాఁకుదోఁచినగతిఁ బెక్కుపోకలమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ, జూచుసుమతుల కేర్పడ నాచరింతు."
ఆ-౧. ప-17.

అని కొన్నికల్పన లేర్పఱచికొనియు నందు ముఖ్యముగాఁ బ్రథమతృతీయ

ములనే యుపయోగించుచువచ్చెఁ గావున గ్రంథరచన వచనాతీత్వాద్భుతావేశభాసురంబై సహృదయహృదయంగమతరంబై కన్పట్టెడు. ప్రాయికముగా గ్రంథమెల్ల సభంగసంస్కృతశబ్దశ్లేష, సభంగాంధ్రశబ్దశ్లేష, సభంగోభయభాషాశబ్దశ్లేషనిబిడంబై యుండుటంజేసి యర్థవిదు లగు చదువరు లాయాచోటు లరసి నిలిపి చదివినం దత్తద్వివక్షితార్థంబునుఁ దత్తత్ప్రధానకావ్యమట్లపోలె నీకావ్యము బోధించుచుండెడు. కావుననే కవి గ్రంథాదియం దీక్రిందిరీతిం జెప్పెను.

క. "ఒకకథ వినియెడుతఱి వే, ఱొకకథపై దృష్టి యిడిన నొకయర్థముఁ దోఁ
పకపోవుఁ గాన నేకా,ర్థకావ్య మె ట్లట్లు వినఁగఁ దగు నొకటొకటిన్."

ఆ-౧. ప-18.

అర్థసమన్వయమరసి యుచితరీతిం బదవిభాగంబునేయుచుఁ జదివిన నాయాయర్థము సుబోధమై యుండుఁ, గాని కొన్ని శ్లేషగ్రంథములఁ జదువునపు డెట్టు లట్టుల నానార్థకనిఘంటువుల నన్వేషింప నవసరము తఱచుగా నుండదు. ఒక్కమాఱు చదివిన రామాయణార్థంబును వేఱొక్కమాఱు చదివిన భారతార్థంబును గ్రహించునెడఁ జదువరుల కావృత్తికల్పనంబున వ్యాపారగౌరవంబుగలిగిన నొక్కకావ్యమే యుభయార్థప్రతిపాదకం బగుటంజేసి ప్రయోక్తకు వైయాకరణసమ్మతం బయిన యుచ్చారణలాఘవంబును దీనం జమత్కృతివిశేషంబును సహృదయవేద్యంబై యుండెడు. "శ్వేతోధావతి" ఇత్యాదికావ్యములయెడ శ్రోతలకర్థపరిజ్ఞానంబున నావృత్తికల్పనాగౌరవ ముండినను ప్రయోక్తలకు సకృదుచ్చారణలాఘవంబు గల దనువైయాకరణ సిద్ధాంతము విస్పష్టంబ కదా.

ఇందుఁ గల్పించినశ్లేషభేదములకుఁ గొన్ని యుదాహరణముల దిక్ప్రదర్శనముగ నీక్రిందఁ బొందుపఱిచెదను.

క. "వినియతనిందనపై నిడు,కొని యేఁగినియమికిఁ దగనిఘోరార్తి యొన
ర్చినవాఁడ మీకు పండ్యుఁడ, నని తనుఁ దెలుపుచును వారి కప్పనసేసెన్."

ఆ-౧. ప-28.

ఇందు రామాయణార్థమున, 'విని + అతనిన్ + తనపైన్ + ఇడుకొని+ఏఁగి + నియమికిన్ + తగని' యనియు, భారతార్థమున 'వినియతనిందన + పైన్ + ఇడుకొని + ఏన్ + కినియమికిన్ + తగని' యనియు నన్వ

యించుచో సంస్కృతాంధ్రపదములకు విభాగమాత్రగ్రాహ్యముగా మేళనము గలుగునట్లు పదసంయోజనము చతురముగాఁ గూర్చుటం జేసి యిచ్చట సంస్కృతాంధ్రభాషాద్వయసభంగశబ్దశ్లేష చెప్పఁబడియె.

క. "ఏనుం గనికర మరయక, పూనితిఁగా కిట్టియెడలఁ బోసఁగునె యేయన్
గానమె కాలనియమగతి, తో నావేఁట మునియుగముఁ ద్రుంగించెఁ దుదన్."
ఆ-౧. ప-24.

ఇందుఁ బూర్వార్థమున రామాయణార్థమున 'ఏనుంగు+అని+కరము + అరయక' యనియు, భారతార్థమున 'ఏనున్ + కనికరము + అరయక' యనియు నాంధ్రశబ్దములకు సభంగశబ్దశ్లేషకల్పన చేయఁబడియె. ఉత్తరార్థమున భాషాద్వయసభంగశబ్దశ్లేష యూహ్యంబు.

శా. "అక్షుద్రప్రథమానదివ్యశరసంప్రాప్తిం బ్రకాశించునా
పక్షిధ్వంశవతంసుఁ గన్గొని మహాగోదావరీతీరస
ద్రక్షోపాయపథంబు నేఁడు దొరకెన్ రం డంచు సంరక్షణా
పేక్షం దద్వనభూమిదేవతలు సంప్రీతిం గదున్ మూఁకలై." ఆ-3. ప-65.

ఇందు రామాయణార్థమున 'మహా+గోదావరీ+తీర + సత్ + రక్షః + ఉపాయపథం' బనియు, భారతార్థమున 'మహాత్ = ఆగః + దావ + రీతి+రసత్ + రక్షః+అపాయపథంబు.' (అనఁగా గొప్పయపరాధముగలవారును దావానలమురీతిని మ్రోయుచున్న వారు నగురాక్షసులనాశమార్గము) అనియుఁ బదచ్ఛేదభేదమున నర్థభేదము గలుగునట్లు సంస్కృతసభంగశబ్దశ్లేషకల్పన చేయఁబడియె.

క. "అకళంకిత నిట్టనుఁ గొం,చక యేమీమనము సమరసముదారక్రీ
డకు నొండొరు మార్కొనుట దొ, రకు ననిపచ్చితి నెఱుంగరావాకినుకల్."
ఆ-౨. ప-81.

ఇందు రామాయణార్థమున ఏమీమనము=మన మిద్దఱమనియు, భారతార్థమున మీమనము=మీమనస్సనియు నన్వయించుచో మనము అనుద్వ్యర్థ మగు నాంధ్రశబ్దముఁ బ్రయోగించుటంజేసి యాంధ్రభాషార్థశ్లేష కల్పింపఁబడియె.

క. "ఘనవిగ్రహజృంభణమున, ననయము దనకట్లు దెగఁగ నవ్వాహినిఁ గ్రీ
డన గెలిచి వచ్చునబ్బాలునిఁ గని వెఱఁ గంది రాత్మలో నచటిజనుల్."
ఆ-౨. ప-25.

ఇందు రామాయణార్థమున విగ్రహజృంభణము యుద్ధాతిశయ మనియు, వాహిని సేన యనియు, భారతార్థమున విగ్రహజృంభణము ఒడలు విఱుచుకొనుట యనియు, వాహిని నది యనియు ననేకార్థక సంస్కృతశబ్దములఁ బ్రయోగించుటంజేసి సంస్కృతభాషార్థశ్లేష నిరూపింపఁబడియె.

క. "విను పెక్కు లేల విడువుము, జనసమ్మతమతివిదేహజననామయముం
దనయుదితకీర్తిఁ గులవర్తనఁ బ్రజలను లక్ష్మిఁ బ్రోచుప్రభున కిది తగున్."

ఆ-౪. ప-106.

ఇందు రామాయణార్థమున 'జనసమ్మతమతిచే, విదేహజను=సీతాదేవిని, విడువుము. అనామయమును, తనయుదితకీర్తిని, కులవర్తనను, బ్రజలను, లక్ష్మిని బ్రోచుప్రభునకు, ఇది పరదారనిరోధనిరాసము తగున్' అని యన్వయించి, భారతార్థమందు ఓధృతరాష్ట్రా! నీవు 'జనసమ్మతమతివి, దేహజననామయమున్=దేహమందుఁ బుట్టినరోగమైన, తనయున్ = కుమారుని, దితకీర్తిన్=ఖండితమైన నష్టమైనకీర్తిగలవానిని, విడువుము=త్యజింపుము. కులవర్తనను, ప్రజలను, లక్ష్మిని బ్రోచుప్రభునకు, ఇది కులదేశరాజ్యరక్షణార్థ మొక్కనిం ద్యజించుట తగు నని యన్వయించునెడ 'దేహజననామయమున్' అనువిశేషణము దుర్యోధనున కన్వయించుచో నామయముగాని వాని నామయం బనిచెప్పుట పొసఁగదు గావున నాశ్రయదూషణశ్రమాపాదనాదిగుణనిమిత్తమున దుర్యోధనునం దామయసదృశత్వ మారోపితం బై దేహజననామయసదృశుఁ డగువాని నని యర్థముఁ గల్పించుటచే గౌణవృత్తియు రామాయణార్థమున రోగపరముగాఁ గల్పించుటచే ముఖ్యవృత్తియు నొప్పియుండుటంజేసి యిక్కడ ముఖ్యగౌణవృత్తిశ్లేష ప్రతిపాదితం బయ్యె.

సాదృశ్యనిబంధనంబున శౌర్యాదిగుణనిమిత్తముగనే "సింహో మాణవక"ఇత్యాదిస్థలములయందు గౌణవృత్తిచేఁ దత్సదృశత్వ మారోపింపఁబడు నని సర్వశాస్త్రసమ్మతంబు గదా.

సీ. "దివి మోచియున్నయద్రిని ధర్మకార్యార్థ, మానతంబుగఁ జేసినట్టిఘనుని
మించి లోకము నావరించినవిషరాశి, నాపోశనముఁ గొన్నయద్భుతాత్ము
జీవనదోషవిద్రావణజ్యోతిర్మ,యస్వమూర్త్యాలోకుఁ డగుమహాత్ము
నఖిల వేదాంతవేద్యాత్ముఁడై భువనవం,ద్యతఁ బెంపుమీఱుమహానుభావు

తే. సమర నిమ్నగానిత్యసేకముల సెలయు, జడలఁ గెంపు విమలతఁ గడు మెఱయఁగ
మెకముతోలు విభూతిసమిద్ధతనువు, నొండొకటి కందమై యొప్ప నొప్పువాని."

ఆ-3. ప-34.

ఇందు రామాయణార్థమున నగ స్త్వపరముగా నన్వయించునపుడు దివిమోచియున్న యద్రిని=అభ్రంకషమయినవింధ్యపర్వతము ననియు, భారతార్థమున శివపరముగా నన్వయించునపుడు స్వర్గలోకమునువహించినమేరుపర్వతముననియు శబ్దశ్లేషగాని యర్థశ్లేషగాని పదాన్వయభేదముగాని లేకయే యర్థాన్వయము భిన్నభిన్నముగాఁ గలుగునట్లు కల్పించుటం జేసి యిచ్చట నర్థాన్వయభేదకల్పనంబు సూచింపఁబడియె. ఇదియు ముఖ్యగౌణవృత్తిశ్లేష కుదాహరణ మగునని తలఁచునెడఁ దద్విభేదమునే కవిచమత్కారార్థముగాఁ బ్రకారాంతరముగా గణించె ననియుఁ దలఁపఁదగియుండెడు. కవి కల్పించినయితరభేదకల్పనలతో దేనిలోనైనం గలియనియర్థాన్వయభేదకల్పన కుదాహరణము మృగ్యమని యూహించుచున్నాఁడను. విద్వాంసులు విమర్శించి గుణదోషముల నరసి తత్త్వము నిర్ణయింతురని సవినయముగ వేఁడుచున్నాఁడను.

సీ. "వ్యథలెల్లఁ దీఱ దేవరమహామహిమ వి,లోకింపఁ గంటి నస్తోకగుణత
బరఁగుభూమిజనాధిపతనయాయకలంక,నున్నది శాంతద్విషన్నికాయ
వెసమన మొదవులాలసమానకురుబల,యత్నావరుద్ధంబు లగుచుఁ జనని
తాంతాకులీభవత్ప్రాణవాయువులతో, వనరెడు నేను నివ్వార్తఁ జెప్పఁ
ఆ. బాఱుతెంచితి నని ప్రత్యభిజ్ఞానస,మర్పణమున నతనిమది యొడఁబడఁ
దా నెఱిఁగినకొలఁది నానారివృత్తాభి,ధానకథ లొకింత తడవు నడిపె."

ఆ-౪. ప-38.

ఇందు రామాయణార్థమున 'దేవరమహామహిమన్, వ్యథలెల్లఁ దీఱన్, అస్తోకగుణతఁ బరఁగుభూమిజన్, విలోకింపఁ గంటి'ననియు, భారతార్థమున 'వ్యథలెల్లఁదీఱన్, దేవరమహామహిమన్, విలోకింపఁ గంటిన్, అస్తోకగుణతఁ బరఁగుభూమిజనాధిపతనయా' యనియుఁ బదముల కర్థభేదము లేకున్నను శబ్దాన్వయభేదపూర్వకముగాఁ గర్మకరణహేత్వాదిభేదకల్పనచే నర్థద్వయముఁ బొసఁగించుటం జేసి యిచ్చట శబ్దాన్వయభేద సంగతి చెప్పఁబడియె. ఈపద్యమందే చతుర్థపాదమున నిట్టిరచన యింకనుం గలదు.

కవి తాను గల్పించిననియమములలో నొక్కటొక్కటిగాక రెండు (viii) మూఁడు భేదకల్పనలనుం జేర్చియుఁ బలుచోట్లఁ గథాసంఘటనంబుఁ గావించియున్నాఁడు: వానికిం గొన్ని యుదాహరణములఁ జూపుచున్నాఁడను.

ఆ. "వెలయు నఖిలభువనములలో నవారణ, నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నా, రాజవినుతిఁ గనినరాజధాని."

ఆ-౧. ప-1.

ఇందుఁ బూర్వార్ధమందు రామాయణార్థమున 'అవారణ+నగరిపు+రమ+తల్లి నాన్' అనియు, భారతార్థమున 'వారణనగరి+పురముతల్లి నాన్' అనియు నన్వయించుచో సంస్కృతాంధ్రభాషాశబ్దశ్లేషయు, నుత్తరార్థమునందు రామాయణార్థమున 'రాజ్యలక్ష్మి+మిగులన్ ప్రబలన్+అయోధ్య నాన్' అనియు, భారతార్థమున 'రాజ్యలక్ష్మి+అయోధ్య నాన్+మిగులన్+ప్రబలన్' అనియు నన్వయించుచో శబ్దాన్వయభేదసంగతియుఁ గూర్పుటం జేసి రెంటికిఁ గూడిక చెప్పఁబడియె.

సీ. "పుడమిఱేఁ డీరీతిఁ గడఁగి డెందము మృగ,వ్యాపారఖేలన మభిలషింపఁ
గానలోఁ దారుమృగంబులకై వడిఁ, గైకొని యసమాస్త్రకర్మకలనఁ
దనరుచొక్కపురాణమునిదంపతులు దమ,కంబులు దేర నెయ్యంబు మీఱ
ననిచినతత్ప్రియతనయుం డవారిత, కారుణ్యుఁడై పూని కలశమంబు
తే. మగ్నముగఁ జేయుచప్పుడు భగ్నహృదయుఁ,డగుచు వినిశితశరవిశేషాభిహతిని
ద్రెళ్ళ నేసె నాఘనులసద్దృష్టినియతి, బ్రుంగఁ గేవలసారంగబుద్ధిఁ జేసి."

ఆ-౧. ప-20.

ఇందు మృగవ్యాపారఖేలన మనునెడ రామాయణార్థమున 'మృగవ్య+అపారఖేలన' మనియు, భారతార్థమున 'మృగ+వ్యాపార+ఖేలన' మనియు, సంస్కృతసభంగశబ్దశ్లేషయుఁ, దనరుచొక్కపురాణమునిదంపతు లనునెడ రామాయణార్థమున 'తనరుచు+ఒక్క+పురాణమునిదంపతు' లనియు, భారతార్థమున 'తనరు+చొక్కపు+రాణన్+మునిదంపతు' లనియుఁ, దమకంబులు దేర ననునెడ రామాయణార్థమున 'తమకు+అంబులు+తేర' ననియు, భారతార్థమున 'తమకంబులు+తేర' ననియుఁ, బూనికలశమంబుమగ్నముగఁ జేయుచప్పు డనునెడ రామాయణార్థమున 'పూని+కలశము+అంబుమగ్నముగన్+చేయు+చప్పు' డనియు, భారతార్థ

మున 'పూని+కల+శమంబు+మగ్నముగన్+చేయుచు+అప్పు' డనియు నన్వయించుచో సంస్కృతాంధ్రభాషాద్వయశబ్దశ్లేషయు, సారంగబుద్ధిఁ జేసి యనునెడ రామాయణార్థమున గజపరత్వము భారతార్థమున మృగపరత్వముం గల్పించుటంజేసి సంస్కృతభాషార్థశ్లేషయుఁ గూర్చుటం జేసి మూటికిఁ గూడిక యిక్కడఁ జెప్పఁబడియె. ఇట్టివానికి గ్రంథ మంతయు నుదాహరణమే కావున విశేషించి వివరింపఁ బని లేదని తలఁచు చున్నాఁడను

ఇమ్మహాకావ్యమున శ్లేషనిబంధనము సేయునెడఁ గొన్ని వ్యాకరణ విషయములు విచారణీయములై నట్లు చూపట్టుటం జేసి వానిం గూర్చి కొంత చర్చించెద.

క. "వినియతనిందనపై నిడు,కొని యేఁగినియమికిఁ దగనిఘోరా ర్త్రి యొన
ర్చినవాఁడ మీకు దండ్యుఁడ, నని తనుఁ దెలుపుచును వారి కప్పనచేసెన్."

ఆ-౧. ప-28.

ఇందు ద్వితీయపాదమందు రామాయణార్థమున 'ఏగి+నియమికిన్' అని యన్వయించుచో నసమాపకగమనక్రియావాచకం బయిన "ఏగి"యను పదమున కర్ధానుస్వారము లేనిరూపమును, భారతార్థమున 'ఏన్+కినియ మికిన్' అని యన్వయించుచో సంధిని "ఏన్" అనుపదమందలి ద్రుతమున కర్ధానుస్వారాదేశంబును దత్పర మగుపరుషవర్ణమునకు సరళాదేశంబును రాఁగా సార్ధానుస్వారరూపంబును గలుగుటవలన నీరెండర్థము లిక్కడఁ గల్పించుట వ్యాకరణవిరుద్ధ మనియుఁ, గల్పింపకున్న నర్థ మన్వయింపఁ దనియుఁ దలఁపవచ్చుఁగాని "శ్లేషే సఖండనిర్బిందోర్వ్యాశ్లేశనం కుత్రచిన్మత" మ్మను నథర్వణకారికావచనమున శ్లేషయం దిట్టివానికి మేళనము వృద్ధసమ్మ తంబని నిర్ణీతమైయుండుటంజేసి, వ్యాకరణవిరోధంబు గలుగదు. దానఁ బైఁ జెప్పినరీతి నర్థాన్వయమున కసందర్భముం గలుగదు. ఇశ్లే—

మ. "స్వనిదేశోన్నతి నంతట న్నెఱయుచున్ శక్తిం జతుర్దిజ్నరేం
ద్రనికాయంబును గెల్చి తమ్ములసమానప్రాప్తవిత్తార్పణం
బునఁ దన్ప న్వశు లైన బ్రాహ్మణులతోఁ బూర్ణాధ్వరారంభుఁ డై
యనఘశ్రీఁ బృథివీశుఁ డొప్పెసగురూఢాపూర్వసత్కీర్తితోన్." ఆ-3. ప-15.

అనుపద్యమున "ఒప్పెసగురూఢాపూర్వసత్కీర్తితోన్" అనునెడ రామా యణార్థమున "ఒప్పెసఁగున్" అనుచోసకారోత్తరార్ధానుస్వారవిశిష్టరూ

పంబును, భారతార్థమున "ఒప్పెఁ+సగురూధాపూర్వసత్కీర్తితోఁ" అనుచో నర్ధానుస్వారరహితరూపమునుం గూర్చునెడను సమాధానము కల్పనీయంబు.

సీ. "ధృతిఁ గుంతిమద్రభూపతుల నెయ్యంపుగన్య,కలననవాలుఁదూపుల జయించి
యలరారుసతనుజయశ్రీల వరియించె, యవనసౌరాష్ట్రభూధవుల గెలిచె
ద్రవిడకళింగసాల్వవిదర్భవసుధాధి,పతుల నోడించి కప్పములు గొనియెఁ
జోళనేపాళపాంచాలకేరళమత్స్య,వత్సభూపతులగర్వం బడంచె

తే. శకయుగంధరఘూర్జరాశ్మంతసింధు, లాటభూపాలముఖ్యుల నోటుపఱిచె
జగతిఁ గోసలకేకయమగధులతన, యలవరించినయాజ్ఞలోఁ మెలఁగఁ జేసె."

ఆ-౧. ప-7.

ఇందుఁ దేటగీతి మూఁడవపాదమునందు రామాయణార్థమున 'కోసలకేకయమగధులతనయలఁ + వరించి + నయాజ్ఞలోఁ + మెలఁగఁ + చేసె'ననియు, భారతార్థమున 'కోసలకేకయమగధులఁ+తన+యలవరించిన +యాజ్ఞలోఁ+మెలఁగఁ+చేసె' ననియు నన్వయించునెడ భారతార్థమందు "మగధులఁ" అనుపదమందలి ద్రుతమున కర్ధానుస్వారమును మీఁదిపరుషమునకు సరళాదేశమును రాగా "మగధులఁదన" యనియు రామాయణార్థమందు సమాసమునందు వాని కవకాశము లేదు గావున "మగధులతనయల" ననియు రూపభేదము గన్పట్టెడు. ఒక్కయర్థమున కుఁగా నొక్కరూపముగ్రహింతుమేని యర్థాంతరకల్పనమున వ్యాకరణ విరోధము తప్పక కలుగు నని యూహింప నవకాశము చూపట్టెడుఁ గాని యిక్కడ ఖండబిందుసరళాదేశములు లేని "మగధులతనయలవరించిన యాజ్ఞలో మెలఁగఁ జేసె" ననుపాఠమే సిద్ధాంతీకరించి యర్థాన్వయము మార్పఁబడునేని వ్యాకరణవిరోధము గలుగదు. అయ్యర్థాన్వయకల్పనం బెట్టిదనిన; భారతార్థమందు 'కోసలకేకయమగధులు+అ' అని యితర ప్రయత్నవ్యవచ్ఛేదార్థక మగునకారావ్యయమును విభజించి కోసలకేకయ మగధులు తమంతట తామే 'తన+అలవరించిన+యాజ్ఞలోఁ+మెలఁగఁ+ చేసెఁ+వర్యా' టనుకర్మవాచకపద మధ్యాహార్యము. ఇట్లు లన్వయించినచో ద్రుతమునకును ద్రుతస్థానమున ఖండబిందువునకును మీఁదిపరుషమునకు సరళాదేశమునకుం బ్రసక్తియే గలుగదు. కావున వ్యాకరణవిరోధ మేమిటం బొసఁగదు. ఇతరప్రయత్నవ్యవచ్ఛేదార్థకమయిన యకారా

వ్యయము సుప్రసిద్ధము. ఆంధ్రశబ్దరత్నాకరమునందకారమున కీయర్థము నిరూపించి కళాపూర్ణోదయములోని "ఉ. ఇమ్ముగ సర్వధర్మములు నీవ యెఱుంగుదు" అని యుదాహరింపఁబడి యుండెడు.

శా. "వేయుం జెప్ప డిదేమి మౌనివర సద్వృత్తంబుచే నేమిటం
జేయన్ రాదు పితౄణమోక్షము సుతశ్రీఁ దక్కఁ దత్ప్రాప్తికిన్
ధీయుక్తిం గదు నొందుత్రోవ గలదేనిన్ వేఁడెదన్ దేవర
న్న్యాయం బొప్పఘటింపు నాకురుబలం బవ్యాహతిన్ వర్తిలన్."

ఆ-౨. ప-47.

ఇందుఁ జతుర్థపాదాదియందు రామాయణార్థమున 'వేఁడెదన్+దేవరన్+న్యాయంబు' అని యన్వయించుచో "దేవరన్న్యాయం" బని ద్వినకారకరూపంబును, భారతార్థమున "దేవరన్యాయం"బని యేకనకారకరూపంబును గలుగుటంజేసి తంత్రసమాహృతరూపమును రెండర్థములకుఁగాఁ బ్రయోగించునెడ నన్యతరార్థము నవ్యాకరణవిరోధంబగునని యూహింపవచ్చుఁగాని, ద్వినకారకరూపమునే సాధుపాఠముగా నంగీకరించి భారతార్థమును బోధించు నేకనకారకరూపమునందు "అనచిచ" యనుపాణినీయసూత్రముచే నకారద్విత్వముఁ గల్పింపఁబడు నేని వ్యాకరణవిరోధంబు గలుగదు. ఇట్లే—

తే. "వఱలునచ్యుతసఖ్యాతివర్ణితాతు, లప్ప్రదీప్తి నిట్లలరు నీవిప్ప్రభావ
మెందుఁ బెట్టనికోటగా నెసఁగుచుఁ గడ, చేర్తువసన్నపాశరాజితనిరూఢి."

ఆ-౨. ప-104.

ఇందు ద్వితీయపాదమందు రామాయణార్థమున విప్రభావము విప్రత్వమనుచో నేకపకారకరూపంబును భారతార్థమున ఈ+ప్రభావమని యన్వయించుచో సంధివశమున "ఇప్ప్రభావ"మని ద్విపకారకరూపమునుం గూర్చునెడను దాని ననుసరించి పాదాదియందుఁ బ్రాసయతినిమిత్తమై "అతులప్ప్రదీప్తి"యనుచోటను ముందుఁ జెప్పినరీతిని "అనచిచ" యను సూత్రముచేఁ బకారద్విత్వముఁ గల్పించి ద్విపకారకరూపమునే యుభయార్థములందును సాధుపాఠముగా గ్రహింపఁదగును. ఇట్టిచోట్లనెల్ల నిట్లే సమాధానము కల్పనీయమై యుండెడు.

చ. "చనియెఁ బ్రశాంతమై యనలసత్వరహేతివిహారవృత్తిచే
తన యనివింటి మిట్టియతిధర్మ్ము యమోదయము రాజమానశా

సనుఁ గొనివచ్చెఁ దానవరజస్ఫురణాధ్వ్యనిఁ జేసి క్రమ్మఱన్
మనపృథగూఢభాగ్యమహిమస్థితి యిట్టిదివో విచిత్రముల్." ఆ-౨. ప-72.

ఇందుఁ దృతీయపాదమందు రామాయణార్థమున "నవ + రజః+ స్ఫురణాధ్వ్యనిన్" అనుచో ద్విసకారకరూపంబును, భారతార్థమున "అవ రజ+స్ఫురణాధ్వ్యనిన్" అనుచో నేకసకారకరూపంబునుం గలుగుటం జేసి యుభయార్థబోధకతంత్రపాఠమున వ్యాకరణవిరోధంబు గలుగునని యూహింపవచ్చుఁగాని, రామాయణార్థమందుఁ గన్పట్టఁ గలరజశ్శబ్దాంత సకారమునకు "ఖర్పరే శరివా విసర్గలోపో వక్తవ్య" యను కాత్యాయన వార్తికవిహితం బైనవైకల్పికవిసర్గలోపముఁ గల్పించి యేకసకారకరూపమే యుభయార్థములందు సాధుపాఠముగా గ్రహింపఁబడునేని వ్యాకరణ విరోధంబు గలుగదు. ఇశ్లే-

క. "అనిలజుఁ డధికతమస్థితి, నొనరెడుతమి రామదుఃఖ ముడుపుటకు నయం
బునఁ దత్సతీశిరోమణిఁ, గొని చనఁగనియమితదర్పగురుసంభ్రముఁడై."
ఆ-౪. ప-21.

ఇం "దధికతమస్థితి" యనుచోట భారతార్థమునం బైఁజెప్పినరీతిని వైకల్పికసకారలోపముఁ గల్పించి యర్థద్వయమున నేకసకారకపాఠమే గ్రహింపఁదగును. ఇట్టిచోట్లనెల్ల నిశ్లే సమాధానము కర్తవ్యము.

ఈకవివరేణ్యుఁ డుభయకవిమిత్త్రునిరీతిం గవిత్వమర్మమెల్ల లెస్స యెఱింగినవాఁడు గావునఁ గథాద్వయంబుఁ గూర్చునెడ సందర్భానుసార మునఁ దగినపదములఁ గూర్చుచు నాయాపదములు విభజింపఁ గొన్ని చోట్ల యతిస్థానమున వర్ణముల కర్థభేదమున మార్పు గలుగునేనియు యతిభంగము పొసంగనితెఱంగున రెండువిధములఁ జెల్లఁదగినయతులఁ గల్పించి చమత్కరించియున్నాఁడు. చూడుఁడు.

వనమయూరము. "సారనిజచాపగుణ•శబ్దసమనుప్ర
జ్యారసికఘోరతర•సాత్యకిరణాగ్ర
క్రూరతరశాత్కృతిని•రూప్యగమనుండై
చేరి యవికారధృతి•సింధునృపుఁ జూచెన్." ఆ-౪. ప-157.

ఇందు రెండవపాదమున "ఘోరతరసాత్యకిరణాగ్ర" యనుచో రామాయణార్థమున "ఘోర + తరస + అతి + అకిరణ + అగ్ర" యను పదవిభాగంబున "తరసాత్యకిరణాగ్ర" యనునెడ సకారోత్తరాకారము

నకు స్వరయతియు, భారతార్థమున 'శూరతర+సాత్యకి+రణాగ్ర' యను పదచ్ఛేదంబున సాత్యకిశబ్దమందలి సకారమునకు వ్యంజనయతియు జెల్లవలసియుండుటంజేసి తదనుగుణముగాఁ బాదాదియందు "జ్యాసిక" యను సమాసమందలి జ్యాశబ్దముఁ గూర్చుటవలన స్వరయతి యకారమును వ్యంజనయతికి జకారమును సరిపడునట్లు కూర్చెను.

మ. "రవిపుత్త్రుం డని కిట్లు పూని ప్రతిగర్జద్వీరసంహారక్ష
త్త్రవిరాజచ్ఛరభీష్మకుంభజయశోభివ్యాప్తి మీఱన్ మను
ష్యవిభుం డుబ్బఁగ నంత నాప్రబలదోషాచారితోఁబుట్టుగు
న్భవిఁ గూల్చెం బవనాత్మజుండు బలిమి న్దుశ్శాసనాభిఖ్యునిన్."

ఆ-౪. ప-214.

ఇందు మూఁడవపాదమున రామాయణార్థమందు 'దోషా+చారి నక్తంచరుఁ' డని యన్వయించునెడ దోషాశబ్ద మాకారాంతావ్యయమై వ్యంజనయతికిఁ దగియుండుటయు, భారతార్థమందు 'ప్రబలదోష+ఆచారి=ప్రబలదోషములుగలయాచారముగలవాఁ' డనునర్థమును "ఆ" యను నుపసర్గము విఱుఁగుటవలన స్వరయతికిఁ దగియుండుటయుం జూచి తదనుగుణముగాఁ బాదాదియందు "మనుష్యవిభుం" డని ప్రయోగించి యందలి "ష్య" యనుదాని స్వరవ్యంజనయతులకు రెంటికిం జెల్లునట్లు గూర్చెను.

క. "చేవ చెదరి భీమాశుగ, దావహతికృతోరుభంగతాపజ్జ్వలితుం
డై విమతుఁ డడఁగ జయమున, వైవస్వతసంతతినృపపర్యేఁడు మించెన్."

ఆ-౪. ప-247.

ఇందు రెండవపాదమందు "భీమాశుగదావహతికృతోరుభంగ+తాపజ్జ్వలితుండై" యనునెడ రామాయణార్థమందు "భీమ+ఆశుగ+దావ+హతి+కృత+ఉరు+భంగ+తాప+జ్వలితుండై" యని విభజించునెడఁ బాదాదియందలి దావశబ్దమందలి దకారమునకు వ్యంజనయతి చెల్లునట్లుగా యతిస్థానమునందు "తాప" యని విఱుఁగునట్లును, భారతార్థమందు "భీమ+ఆశు+గదా+అవహతి+కృత+ఊరుభంగతా+ఆపత్+జ్వలితుండై" యని విభజించునెడఁ బాదాదియందు "అవహతి" యని విఱుఁగుటచేఁ దదనుగుణముగా స్వరయతి చెల్లునట్లు

యతిస్థానమందును "భంగతా + ఆపత్" అని విఱుఁగునట్లునుం గూర్చి చమత్కారముఁ గావించెను

చ. "విను పలుమాట లేల యల • వేలుపుమూఁకలలోన నేనియుఁ
వెనుకకు వీఁగఁ బాఱ • కొక • వీరుఁడు సైఁపఁగలాఁడె యల్కచూ
పినకులుఁ డించుకంత సమ • పేక్షితసంగరకేళియై నిగు
డ్చినఁ బటుఘోరసాయకవి • జృంభణ మస్త్రుల కోర్వ నెట్లగున్." ఆ-౪. ప-89.

ఇందు మూఁడవపాదమున రామాయణార్థమందు 'అల్కచూపు+ఇనకులుఁడు' అనియు, భారతార్థమందు 'అల్క+చూపి + నకులుఁడు' అనియును విభజించుచోఁ బాదాదియందలి "చూ, పినకులుఁ" డను నెడ నినకులుఁ డని విఱుచునపుడు స్వరయతియు, 'చూపి+నకులుఁ' డనుచో వ్యంజనయతియుఁ జెల్లవలయుఁ గావున వానికిఁ దగినట్లు విశ్రమస్థానంబున "సమ+పేక్షితసంగరకేళియై" యనుసమాసమందలి సమపేక్షితశబ్ద గతమైన "పే" యనుదానిం బ్రాదియతిగా స్వరవ్యంజనయతులకు రెంటికి ననుకూలించునట్లు గూర్చెను. ఇట్టిచిత్రంబు లెన్నియేనియు నీకవి కవితాధోరణిం గన్పట్టుచుండెడు.

ఈ కవివర్యుం డధికనియమముతోఁ గథాద్వయముఁ గూర్చు నెడను జదువువారికిఁ జిత్తానందము గూరునట్లు భాషాజాతీయము లగు వాడుకపదములంగూడ నక్కడక్కడ సందర్భానుగుణముగాఁ బ్రయోగించెను.

తే. "అపుడు మనుజేంద్రముఖ్యు లాహరి నుతించి
రనఘ నీదుమహత్త్వ మేమని పొగడఁగ
వచ్చు నారాయణమహాస్త్రవైభవ మిటు
లఫలముగఁ జేసి రిపులక్రొవ్వడఁచి తనుచు." ఆ-౪. ప.-212

ఇందు రామాయణార్థమున నింద్రజిత్తుప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే నందఱు మూర్ఛిల్లఁగా హనుమంతుఁడు సంజీవనిం దెచ్చి యెల్ల వారిం బ్రదికించి యస్త్రమును వ్యర్థపఱిచె నని యాహనుమంతునిఁ బ్రశంసించు నపు డాశ్చర్యసూచకముగా లోకమున సాధారణ మగువాడుక మెయి "నారాయణ" యనుసంబోధన మిందుఁ గూర్చుట చమత్కారకారియై యుండెడు.

తే. "అరయ నేరి కి ట్టి ట్టని యాడుకొనఁగ
రానియట్టిది శ్రీరామరామ నీకు

మారు దుశ్చేష్టితంబు నివారితముగఁ
జేయకునికి యొప్పుదు దానఁ జేటు వొందు." ఆ-

ఇందు భారతార్థమున శ్రీకృష్ణుఁడు రాయబారము చేఁ
ధృతరాష్ట్రునకు దుర్యోధనుదుశ్చారిత్ర ముగ్గడించి చెప్పునప్పు
శ్చర్యసూచకముగా లోకసాధారణ మగువాడుక మెయి
రామ" యనుసంబోధనద్వయముఁ బ్రయోగించుట యత్యంత
రంబుఁ గావించెడు.

రామాయణభారతకథాసంఘటనంబునఁ బ్రసంగవశమున
వాదిమహాకావ్యలక్షణంబులకుఁ బ్రస్తావ మింం దచ్చుటచ్చుఁ
యరయు విద్వాంసులకు గోచరంబులై యుండెడు.

ఈకవిచంద్రుం డింత నియమముతోఁ గథాద్వయముఁ
గ్రంథమును రచియించుచుం గావ్యకన్య కలంకారమొడఁగఁ
ర్థాలంకారములం గూడ నచ్చుటచ్చుటఁ బొందుపఱిచియ
ఒక్కొక్కచో నొక్కొక్కయలంకారము మాత్రమేగాక
మూఁడుం బ్రసంగవశమునఁ గూడినపుడు సంసృష్టిసంకర ప్ర
నచ్చుటచ్చుట నూహ్యంబులై యుండెడు. వీనికిం గొన్ని య
ములు దిక్ప్రదర్శనముగఁ జూపుచున్నాఁడను.

మ. "తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు తదుద్యజ్జైత్రయాత్రాసము
త్కలికారింఖదసంఖ్యసంఖ్యజయవత్కంఖాణరింఖావిశృం
ఖలసంఘాతధరాపరాగపటలాక్రాంతంబు మిన్నే రన
ర్గళభేరీరవనిర్దళద్గగనరేఖాలేపసంకాకృతిన్."

ఇందొక్కటిరెండువర్ణములకుఁ బలుమా ఱావృత్తి
చుటంజేసి వృత్త్యనుప్రాసాలంకారము.

రగడ. "పొలిచె మధులక్ష్మి సురపొన్నలను బొన్నలను
దెలివిపడి పుష్పాదుల తిన్నెలను జిన్నెలను
...............పాలికల బాలికల."

ఇందు ఛేకానుప్రాసాలంకారము.

శబ్దాలంకారములచే రసపుష్టి గలుగ దని వానియె
కింతగ సాధర ముదయింపదుగావున శబ్దాలంకారవిచార మిఁ

యర్థాలంకారముల విచారించెద. సుకవులు శబ్దాలంకారముల నంతగ నాదరింపరని చిత్రమీమాంసలో శ్రీమదప్పయదీక్షితులవారు "శబ్ద చిత్రస్య ప్రాయో నీరసత్వాన్నాత్యంతం త దాద్రియంతే కవయో నవా తత్ర విచారణీయ మతీవోపలభ్యత ఇతి శబ్దచిత్రాంశమపహాయార్థ చిత్రమీమాంసా ప్రసన్నవిస్తీర్ణా ప్రస్తూయతే" అని చెప్పియున్నారు గదా.

క. "వెండియుఁ బలికోర్కి వొదల, రెండవసతి యనవరగుణ రేఖఁ దనరుచుఁ
గండెసఁగెడు సుతరత్నముఁ, బాండురమణి శుక్తివోలెఁ బడసె హరికృపన్."
ఆ-౧. ప-72.

ఇం దుపమాలంకారము స్పష్టము. భారతార్థమున రూపకసంకీర్ణ మగుట విశేషము.

మ. "తలపం జొప్పడి యొప్పెనప్పుడు......" ఆ-౧. ప-9.

అని ముందు వృత్త్యనుప్రాసోదాహరణముగాఁ జూపఁబడినపద్యమందు సంబంధాతిశయోక్తివస్తూత్ప్రేక్షలు రెండు గోచరించుటంజేసి వానికిఁ గ్రమమున నంగాంగిభావలక్షణం బైనసంకరమును దీనికిని శబ్దాలంకార మగువృత్త్యనుప్రాసమునకును సంసృష్టియు విపశ్చిద్వివేచనీయంబులై తోఁచెడు.

చ. "తురగఖురాహతక్షితిజధూళిచయస్థగితాంబరంబుతో
నొరయుచుఁ దచ్ఛమూగజసముత్కర మప్పుడు చూడ నొప్పె ది
క్కరివరయూథమత్సరవిగాఢతఁ జేసి సమస్త మైనయి
ద్ధరఁ దనపైకి నెత్తుకొని తాల్చెడినో యనుచుండఁ జూపరుల్." ఆ-౧. ప-10.

ఇందు సంబంధాతిశయోక్త్యనుప్రాణితహేతూత్ప్రేక్ష—

సీ. "అచ్చంపులేఁజిగురాకుజొంపము కెంపు, మేలిచెందిరపుఁ గెంధూళి గాఁగ
గ్రుచ్చినట్టుగ జాదుకొన్న మొగ్గలగుంపు, ప్రకటపాటలబిందుపాళి గాఁగ
విచ్చినపరువంపువిరులతండము పెంపు, శోభితభూతిరింఛోళి గాఁగ
నిచ్చలం బైన తేనియవానజడిసొంపు, లాలితదానధారాళి గాఁగ

తే. సుమపరాగముల్ కేళిపాంసువులు గాఁగ
భ్రమరపఙ్క్తులు పైసరఫణులు గాఁగఁ
బుడమి నెల్లెడ వాహ్యాళి వెడలుమదను
మదపుటేనుఁగువోలె నామని దనర్చె." ఆ-౧. ప-5.



ఇందు సావయవరూపకానుప్రాణితవస్తూత్ప్రేక్ష సహృదయహృదయంగమంబై తనర్చెడు. మఱియు నీపద్యమున సీసపాదములు నాల్గింటిలో సంయుక్తచకారప్రాసంబును, బాదార్ధావసానంబున నేకరీతిగాఁ బూర్ణానుస్వారపూర్వకముగాఁ బకారోత్తర ముకారము నిలుపుటయుఁ, బాదావసానంబున నన్నింటిలో నొక్కరీతిగాఁ "గాఁగ" ననుపదమే కూర్చుటయు, దానికి ముందు దీర్ఘముమీఁద "ళి" యను దానిని నిలుపుటయు నియతము గావించి శబ్దాలంకారమును గూర్చుటం జేసి వినువారికి వీనులవిందు గొల్పెడు.

సీ. "నానాఁటి కుప్పొంగునవకంపుఁగళల పెంపునఁ జిన్నిక్రొన్నెలబోద లనఁగ
నుత్తరోత్తరవృద్ధి నొప్పు తేజోరేఖ,పసఁ గోమలార్కబింబంబు లనఁగఁ
గ్రొత్తక్రొత్తగఁ బొదలొక్కమరునెమ్మేనుల, బలుపుష్టిఁ గరికలభంబు లనఁగ
నంతకంతకు మించువింతమగంటిమి, యెదుటున సింగంపుఁగోదమ లనఁగ

తే. "వెలసి రిలను ధర్మజభీమవిజయుఁ లనఁగఁ
గ్రాలునృపసుతుల్ దమలోనఁ గవలు గూడి
మనసుమైత్రిచే రామలక్ష్మణచరితము
సనయభరతశత్రుఘ్న ఖేలనము మెఱయ." ఆ-౨. ప-3.

ఇం దుల్లేఖాలంకారము చమత్కారంబుఁ గూర్చెడు.

మ. "ఇటుము న్నుర్వరఁ బర్వుచున్న విజయోదీర్ణప్రతాపాద్భుతో
త్కటవార్తల్ రిపుకోటికిం బిడుగులై గర్జిల్లెడుఁ నీకు నెం
తటివాఁడైన నెదిర్చి ప్రాణములతో దాఁ గ్రమ్మఱఁ లేమి ప్ర
స్ఫుట మోభూప యరాతిచేష్టలు భవద్భ్రూభంగపర్యంతముల్." ఆ-8. ప-109.

ఇందుఁ జతుర్థపాదమునం గారణప్రసక్తిమాత్రమునం గార్యోత్పత్తిలక్షణంబుగా నొదవు చపలాతిశయోక్త్యలంకారము ప్రతిపాదింపఁబడియె.

శా. "శ్రీతోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ జెన్నొందుపుష్పంబు శో
భాతారుణ్య మెలర్పఁగా ముదుచుపంపా హేమకూటాశ్రయ
ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁగావుత విరూపాక్షాహ్వయం బాకువీ
టీతిమ్మప్రభువేంకటాద్రిహృదయాటీకంబు లోకంబులన్." ఆ-౧. ప-1.

ఇందు భంగ్యంతరాశ్రయవచఃప్రతిపాదనలక్షణం బైన పర్యాయోక్తాలంకారము నిరూపింపఁబడియె.

శా. "శ్రీచన్ద్రాండలు రెండు నండగొని వాసిం బేర్చుచుఁ భక్తిసా
మీచీన్యామలపెద్దవేంకటనృపోన్మీలన్మనశ్చాతక
వ్యాచిక్రింసకుఁ గైవసంబయి సదోదంచత్కృపావృష్టిస
ధ్రీచీనం బగుకృష్ణమేఘము జగత్ప్రీతిం గడుం జేయుతన్." ఆ-౧. ప-2.

ఇందు రూపకాలంకారము విస్పష్టము.

మ. "యతి యెంతేఁ దనయార్తిఁ జేద్వడినవాఁడై యాత్మజాయాసమా
గత మైనప్పుడ మేనుఁ బాయు మని యల్కన్నన్ను శాపించె సం
తతి లేకుండినచోఁ దదాశ మిగులం దాఁ బోవు టెట్లేనియుఁ
ధృతిమై నోర్వఁగ వచ్చునామదికిఁ జింతింపంగ నం చెన్నెదన్." ఆ-౧. ప-34.

ఇందు రామాయణార్థమున ననుజ్ఞాలంకారము.

చ. "క్షమయు నమోఘవిక్రమము సద్వినయంబు ప్రతాపముఁ సురూ
పము నవికారభావమును బ్రాభవశక్తియు నిత్యదానశీ
లముఁ దగ నొక్కటొక్కటి కలంకృతిఁ జేయఁగఁ దాల్చి శోభిలుఁ
విమలత నాఁకువీటిపురవేంకటరాయఁ డతిప్రసిద్ధుఁడై." పీ-౧. ప-34.

ఇం దన్యోన్యాలంకారము.

సీ. "కులవర్ధనుం డైన కొడుకుఁ గాననియట్టి, లాఘవాస్పదునియాలయము లయము
సిరులకుఁ దోడ వైనవరసుతుఁ బడయని, ఘనకలుషాత్ముజీవనము వనము
పితరులఋణముఁ దీర్చెడుసూనుఁ జెందని, దౌర్భాగ్యశీలుగోత్రమ్ము త్రమ్ము
రహి నిహపరసుఖప్రదుఁ బుత్త్రు నెత్తని, వరపుణ్యహీనుభవమ్ము వమ్ము
తే. "పలుఁబలుకు లేల నిఖిలము ఖిలముసూవె
యాత్మజులు లేనివారి కోయతివరమణి
తరమె యనపత్యువైవర్ణ్య మరయ నతని
యఖిలమును నిట్లు ముఖవర్ణహానిఁ జెంద." ఆ-౧. ప-46.

ఇందు వినోక్త్యలంకారము, మఱియు నాలయము, జీవనము, గోత్రమ్ము, భవమ్ము, నిఖిలమనుపదముల మొదటియక్షరముఁ ద్యజించి "లయము, వనము, త్రమ్ము, వమ్ము, ఖిల" మ్మనియుం గ్రహించుట శబ్దచిత్రము, వైవర్ణ్యము ముఖవర్ణహాని యనుచో శ్లేషయుఁ జమత్కారముఁ గలిగించెడు.

మ. "జవవద్ఘోటకపాటితక్షితిరజస్సంక్రాంతిచే నింకుసిం
ధువులం గ్రమ్మఱ నుర్వికిఁ దివికిఁ దోడ్తో నించెఁ దన్నాగముల్

నవనిర్యన్మదనిర్ఝరౌఘమున శుండాశీకరోర్ధ్వప్రవ
ర్షవిధిం దానను జేసి సింధురము లప్రఖ్యాతిఁ గాంచెన్ గరుల్." ఆ-౧. ప-11.

ఇందు శ్లేషోత్థాపితసంబంధాతిశయోక్త్యనుప్రాణితనిరుక్త్యలంకారము.

క. "ఉడుటున నట్లరిగి యతం, డడవి ప్రాయశ్చిత్తతీర్థయాత్రాలీలన్
వదలక పూతము సేయన్, సదమలగతి పూనె వృథయె సత్సంగరముల్."
ఆ-౨. ప-91.

ఇం దర్థాంతరన్యాసాలంకారము.

మత్తకోకిల. "భూధరాధిపకన్యకామణిపుణ్యపాదపయోజలా
క్షైధితారుణగైరికద్యుతి హేమకూటవిహారలీ
లాధికాదర సాధుసాధితహైమవత్యనురంజనా
రాధితస్మరమోచితాత్మపురాతనాపకృతిస్మృతీ." ఆ-3. ప-144.

ఇందుఁ బ్రథమసమాసమున ననుగుణాలంకారము.

ఇమ్మహాకవి కావ్యగుణములుం బెక్కులు పొసఁగునట్లు రచనగావించెను. అన్నియు నిరూపించినం గ్రంథవిస్తరమగునని వానికిని రెండుమూఁడుదాహరణములమాత్ర మిచ్చుట నుదాహరించెదను.

క. "అది సకలసదాచారం, బది సర్వజ్ఞాన మది సమస్తజనిఫలం
బొదవినకోలఁది నొకప్పుడు, హృదయము నీయందుఁ జేర్తురేని మహేశా."
ఆ-3. ప-60.

ఇందు శ్లేషాఖ్యగుణము.

ఉ. "అంత వసంతమొప్పెఁ జరమాగ్రిమభాగచరాఖిలర్తుసా
మంత మనంతజాలకసమంజసరంజితకుంజకుంజరో
ద్వాంతనితాంతసాంద్రమధుదానవిజృంభితబంభరస్వనా
త్యంతనిరంతరీకృతదిగంత మతాంతలతాంతకుంతమై." ఆ-౨. ప-4.

ఇం దౌదార్య, ముదాత్తత, యోజస్సు, సౌకుమార్యంబు నూహ్యంబులు.

సీ. "అచ్చంపులేఁజిగురాకుజొంపము కెంపు, మేలిచెందిరపుఁ గెంధూళి గాఁగ..."
ఆ-౨. ప-5.

అనుసావయవరూపకానుప్రాణితవస్తూత్ప్రేక్షకు ముం దుదాహరింపఁబడిన పద్యమునందు సమత, యర్థవ్యక్తి, సమాధియు నూహ్యంబులు.

ఇమ్మహాకవి కావ్యమునకు జీవితస్థానీయ మైనవ్యంగ్యవైభవము నిందుఁ బొందుపఱిచియున్నాఁడు.

మ. "జవపద్ఘోటక పాటితక్షితిరజస్సంక్రాంతి చే...." ఆ-౧. ప-18.

అను శ్లేషోత్థాపిత సంబంధాతిశయోక్త్యనుప్రాణిత నిరుక్త్యలంకార మునకు లక్ష్యముగా ముం దుదాహరింపఁబడినపద్యమందుఁ దురగఖురోద్ధూతం బైనపరాగముచే సముద్రములును మందాకినియు నింకెననియు, నేనుఁగులమదధారలచేతను దొండములతుంపురులచేతను మగుడ నవి నిండెననియుఁ గల్పించినయతిశయోక్త్యలంకారముచే, సముద్రములను మందాకిని నింకింపఁ జాలినంతపరాగము రేపఁ దగినన్ని గుఱ్ఱములును వాని మరల నిండింపఁజాలినంత మదోదకమును దొండపునీరునుం గురియఁ జాలినన్ని యేనుఁగులు నాపురమునఁ గల వనువస్తుధ్వని వ్యంగ్యమై విద్వాంసులకు మనోరంజనముఁ గావించెడు.

గ్రంథాదిని రచియింపఁబడిన——

శా. "శ్రీతోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ జెన్నొందుపుష్పంబు శో
భాతారుణ్య మెలర్పఁగా ముడుచుపంపాహేమకూటాశ్రయ
ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁగావుత విరూపాక్షాహ్వయం బాకవీ
టీలిమ్మప్రభువేంకటాద్రిహృదయాటీకంబు లోకంబులన్." పీ-౧. ప-1.

అనుపద్యమందు 'శ్రీతోఁబుట్టి'యనుటచే "రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" యను విష్ణుపురాణవచనము చొప్పున లక్ష్మీస్వరూపురాలగు సీతాదేవితో ననఁగా సీతాదేవిచరిత్రముతోననియు 'సుధామధుద్రవ ముతోఁ జెన్నొందుపుష్పంబుఁ' జంద్రుని ననఁగాఁ జంద్రవంశరాజచరిత్ర ననియుఁ గల్పించి యట 'శో, భాతారుణ్య మెలర్పఁగా ముడుచు పంపా హేమకూటాశ్రయ, ఖ్యాత బ్రహ్మము' పంపాహేమకూటాశ్రయుఁ డైన విరూపాక్షదేవునిచేత, ఖ్యాతకృతి సమర్పణచేతఁ బ్రసిద్ధమైన బ్రహ్మము, వేదతుల్యమైన రామాయణభారతద్వయార్థప్రతిపాదక గ్రంథ మనియు నన్వయించుచో మనాకావ్యార్థసూచనము వ్యంగ్యమహిమచే నొనర్పఁబడియె నని రసికు లూహింపఁ దగును.

క. "చను నెడ శ్రీరాముఁడు పా,వని నవనిజరూపవైభవశ్రీ నుల్లం
బున నిడి దానవిచిత్రా, తనురాగప్రౌఢి వచ్చి తనుఁ బైకొనఁగన్."

ఆ-౨. ప-41.

ఇందు రామాయణార్థమున రామునకు సీతాదేవియెడ రాగము రతి యుదయించె నని చెప్పఁబడియె. అయ్యది ప్రసంగసంగతానుభావాది సామగ్రీసముల్లసితంబై రసమయ్యెడు కైశిక్యాదివృత్తులును ద్రాక్షాది పాకములును ప్రకరణోచితముగను రసోదయానుకూలముగను రచనా విశేషమున నచ్చటచ్చటఁ గూర్పఁబడి సహృదయవేద్యంబులై యుల్లసిల్లెడు.

క. "కొలఁది యిడరానిపాండితి, గలపింగళిసూరనార్యుకవనంబునకో
శల మున్నదెల్ల నెఱుఁగఁగ, నలవియె మాదృశున కర్థు లందుఁ గవీంద్రుల్.

విద్వాంసులు విమర్శించి విశిష్టకృపామతింజేసి యిందలిదోషముల మన్నించి గుణ మేదేనుండినం గ్రహింపఁ బ్రార్థితులు.

శ్రీకాళహస్తి.
10-7-1910.

ఇట్లు,
సమస్తవిద్వద్విధేయుఁడు,
శతఘంటము. వేంకటరంగశాస్త్రి.

శ్రీరస్తు.

శ్రీ రామచంద్రపరబ్రహ్మణే నమః.

# రాఘవపాండవీయము.

## సవ్యాఖ్యానము.

---

## పీఠిక.



తోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ
జెన్నొందుపుష్పంబు శో
భాతారుణ్య మెలర్పఁగా ముడుచుపం
పాహేమకూటాశ్రయ
ఖ్యాత బ్రహ్మము ప్రోచుఁ గావుత విరూ
పాక్షాహ్వయం బాకుపీ
టీతిమ్మప్రభు వేంకటాద్రిహృదయా
టీకంబు లోకంబులన్. 1

## వ్యాఖ్యానకర్తృకృతమంగళాచరణము.

శా. శ్రీలీలాజలజంబుఁ జేకొని దరస్మేరాస్యుఁడై గోపికా
జాలం బద్భుతవార్ధిఁ దేలఁగ నిజేచ్ఛన్ నైజసౌందర్యధు
ర్యాలోకద్యుతిధారతన్ ముకుళనవ్యాకోచముల్ సేయుగో
పాలస్వామి మనోహరాకృతి మదిన్ భావించి సేవించెదన్.

చ. అమరయసూరయార్యరచితాంచితరాఘవపాండవీయకా
వ్యమహితమాధురీమదుభయార్థవిబోధిక టీకఁ జేసెదన్
గమలనివాసినీచరణకాంచననూపురశింజితార్భటిన్
సమమతి సంస్కృతాంధ్రకృతిసాధనలక్షణలక్షితంబుగన్.

టీక. శ్రీతోన్ = లక్ష్మితోడ, పుట్టి = జనించి, సుధామధుద్రవముతోన్ - సుధా = అమృతమనెడి, మధు = పూఁదేనెయొక్క, ద్రవముతోన్ = తడితోడ, చెన్నొందు పుష్పంబు - చెన్నొందు = ప్రకాశించునట్టి, పుష్పంబు = పువ్వును, శోభాతారుణ్యము = తరుణకాంతి, ఎలర్పఁగాన్ = ఒప్పఁగా, ముడుచు పంపాహేమకూటాశ్రయఖ్యాత బ్రహ్మము - ముడుచే = జడలయందుఁ దాల్చుకొన్నట్టి, పంపా = పంపాసరస్తీరమందున్న, హేమకూట = హేమకూటపర్వతమనెడు, ఆశ్రయ = ఉనికియందు, ఖ్యాత = పేరొందిన, బ్రహ్మము = కర్త - అనఁగా బాలచంద్రుని శిరమునందుఁదాల్చినదని భావము. విరూపాక్షాహ్వయంబు = విరూపాక్షనామము గలది, ఆకువీటీతిమ్మప్రభు వేంకటాద్రిహృదయాటీకంబు - ఆకువీటీ = ఆకువీడనుపత్తనమునకు ఱేఁడైన, తిమ్మప్రభు = తిమ్మరాజుకొడుకు డయిన, వేంకటాద్రి = పెదవేంకటాద్రిప్రభువుయొక్క, హృదయ = ఉల్లమునందు, ఆటీకంబు = వర్తించునది - బ్రహ్మశబ్దమునకు విశేషణములు. లోకంబులన్ = జనకోటులను, ప్రోచుఁగావుతన్ = రక్షించుఁగాత.

శా. శ్రీచన్గొండలు రెండు నండగొని వాసిం బేర్చుచున్ భక్తిసా
మీచీన్యామల పెద్దవేంకటనృపోన్మీలన్మనశ్చాతక
వ్యాచిక్రంసకుఁ గైవసం బయి సదోదంచత్కృపావృష్టిస
ధ్రీచీనం బగుకృష్ణమేఘము జగత్ప్రీతిం గడుం జేయుతన్. 2

శ్రీ = లక్ష్మీదేవియొక్క, చన్గొండలు = స్తనములనెడు పర్వతములను, రెండున్ = రెంటిని, అండగొని = ఆశ్రయించి, వాసిన్ = ఆధిక్యముచేత, పేర్చుచున్ = ప్రసిద్ధికెక్కుచును, భక్తి = భక్తియొక్క, సామీచీన్య = కొమరుచేత - అనఁగా నిష్కలంక భక్తిచే ననుట. అమల = పవిత్రుఁడయిన, పెద్దవేంకటనృప = పెదవేంకటాద్రి ప్రభువుయొక్క, ఉన్మీలత్ = వికాసము పొందుచున్న, మనః = డెందమనెడి, చాతక = వానకోయిలయొక్క, వ్యాచిక్రంసకున్ = గమనేచ్ఛకు - అనఁగా నుదకమును గోరి సంచరించుట. కైవసం బయి = అధీనమై, సదా = ఎల్లప్పుడు, ఉదంచత్ = అడరుచున్న, కృపా = దయారసమనెడి, వృష్టి = వర్షముతోడ, సధ్రీచీనం బగు = కూడి వర్తించునట్టి, కృష్ణమేఘము = కృష్ణుఁడను కారుమొయిలు - శ్లిష్టరూపకము. జగత్ = లోకముయొక్క, ప్రీతిన్ = ఇష్టమును, కడున్ = మిక్కిలి, చేయుతన్ = ఒనర్చుఁగాక.

శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
షాక్లృప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబులన్ మించువా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్. 3

లోకత్రాణరతిన్-లోక = జనులయొక్క, త్రాణ = ప్రోపునందుఁ గల, రతిన్ = ఆశచేత-ఇది వాల్మీకివ్యాసులయం దన్వయము. తత్ = అట్టి, ఆదిమ = తొలుతటి దైన-ఇది ప్రవేశమునకు విశేషణము. మహీలోక = భూలోకముఁగూర్చి, ప్రవేశ=చొచ్చుట యందు, ఉత్క=ఉత్సాహము గల, భాషా=సరస్వతీదేవిచేత, క్లృప్త=తొడుగఁబడినవియై, ప్రథమద్వితీయ = కుడియెడమ లయిన, పద = పాదములయందు, గుంజత్ = అవ్యక్తముగ మ్రోయుచున్న, మంజు = విన నింపైన, మంజీర=అందెలయొక్క, గర్జాకల్ప= రొదతో సమానము లయిన, అమల = స్వచ్ఛము లయిన, రామ = రామునియొక్క, భారత = భరతవంశపురాజులయొక్కయు, కథా=చరిత్రములయొక్క - అనఁగా రామాయణభారతములనుట. సర్గంబులన్ = నిర్మాణములచేత, మించు = పేర్చునట్టి, వాల్మీకివ్యాసులన్ = వాల్మీకిముని వ్యాసమునులను, తదుభయ = ఆరామాయణభారతముల రెంటియొక్క, శ్లేషార్థ = కూడిక యగునర్థముయొక్క, సంసిద్ధికిన్ = నెరవేరుటకొఱకు, కొలిచెదన్ = సేవించెదను.

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణముం రచించిన మహాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిఁ దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్. 4

ఏయెడన్ = ఎల్లెడలను, అర్థ=వాచ్యాద్యర్థములయొక్క, గౌరవసమృద్ధియున్ = గురుత్వాతిశయమును, శబ్ద=పదములయొక్క, విశుద్ధియున్ = సౌష్ఠవమును, తిరంబై = స్థిరమై, అనవద్యతన్ = నిర్దుష్టమగుటచేత, పరఁగన్ = ఒప్పునట్లుగా, ఆంధ్రవచః = తెనుఁగుపదములయొక్క, స్థితిన్ = ఉనికిచేత - అనఁగాఁ దెనుఁగు ననుట. భారతంబు = భారతంబును, రామాయణమున్ = రామాయణమును, రచించిన = ఒనర్చిన, మహాత్ములన్ = పూజ్యులయిన, జగద్గేయులన్ = లోకస్తుత్యు లయిన, నన్నపార్యునిన్ = నన్నయభట్టారకుని, తిక్కసుధీమణిన్ = తిక్కనకవిని, ఎఱ్ఱసత్కవిన్ = ఎఱ్ఱాప్రెగ్గడను (ఈముువ్వురిని), ఆత్మన్ = హృదయమునందు, తలంచెదన్ = భావించెదను.

క. ఈవిధి నభీష్టసిద్ధికి, దైవతకవి నుతి యొనర్చి తప్పొప్పు మదిన్
భావించి దిద్దకుండను, దేవానాంప్రియుల మ్రొక్కి తెలతుఁ గుకవులన్.

ఈవిధిన్ = ఈక్రమమున, అభీష్టసిద్ధికిన్ = కోర్కి నెఱవేఱుటకు, దైవత=దేవతలయొక్కయు, కవి = కవీశ్వరులయొక్కయు, నుతి=స్తోత్రమును, ఒనర్చి = కావించి, తప్పు = దోషమును, ఒప్పు=గుణమును, మదిన్ = తమహృదయములందు, భావించి= ఎంచి, దిద్దకుండన్ = సరిపఱుపకుండునట్లు, దేవానాంప్రియులన్ = మూర్ఖులకు,

మ్రొక్కి=నమస్కరించి, కుకవులక్ = దుష్కవులకు, తెలతుక్ = నమస్కారము చేయుదును. "దేవానాం ప్రియ ఇతి చ మూర్ఖే" అని వ్యాకరణము.

వ. అని కుకవు లొకనిమిత్తంబునం బ్రార్థనీయు లగుటంజేసి తత్ప్రార్థనం
బునుం గొంత నడపినవాఁడనై యెద్దియేనియు నొక్క భవ్యకావ్యంబు
నవ్యప్రకారంబున రచియించుటకు సుదంచితకుతూహలుండ నై
యుండు సమయంబున. 6

అని=ఇట్లని, కుకవులు = కుత్సితకవులు, ఒకనిమిత్తంబునక్ = ఒకకారణముచేత, ప్రార్థనీయు లగుటంజేసి = కొనియాడఁ దగినవా రగుటచేత, తత్ = ఆకుకవులయొక్క, ప్రార్థనంబును = వేడికోలును, కొంత = కొంచెము, నడపినవాఁడ నై = ప్రవర్తినఁ జేసినవాఁడ నై, ఎద్దియేనియుఁక్=దేని నైన, ఒకభవ్యకావ్యంబు = ఒక మనోజ్ఞ మైన ప్రబంధమును, నవ్యప్రకారంబునక్ = వింత తెఱంగున, రచియించుటకుక్ = ఒనర్చు టకు, ఉదంచితకుతూహలుండ నై = సోత్సుకుండ నై, ఉండుసమయంబునక్ = ఉన్న వేళ. ఈమీఁద నొకటిరెండుపద్యములు విడఁబడి యవి ప్రత్యంతరములయందుఁ గానఁబడమిచే నిటఁ జేర్పఁబడిన వయ్యెఁ గాని దానఁ గథాసందర్భము తప్పినదికాదు.

సీ. ఏమహీవరుతాత యిమ్మభూవరుఁడు స
త్కీర్తిగంగాజన్మకృతిమహాద్రి
యేవిభుతండ్రి నానావిధపౌరుష
స్థిరవృత్తి మీసాలతిమ్మశౌరి
యేనృపోత్తముతల్లి మానితపరమసా
ధ్వీగుణంబులప్రోక తిమ్మమాంబ
యేధీరుననుజన్ము లిద్ధదానక్షాత్ర
భద్రుండు చిన వేంకటాద్రినృపుఁడు
తే. ఘనులు వేంకటరాయవేంకటవరదులు
నన బ్రసిద్ధులు మగు రట్టియాకువీటి
పురవరాంకుండు త్రిభువనపూర్ణకీర్తి
యతులతేజుండు పెదవేంకటాద్రివిభుఁడు. 7

ఏమహీవరు=ఏభూపతియొక్క, తాత = పితామహుఁడు, సత్కీర్తి=మంచియశ ముకలవాఁడు, గంగా = ప్రాయేటియొక్క, జన్మ = పుట్టుకయొక్క, కృతి = ఒనర్పునకు, మహాద్రి = గట్టులఱేఁ డయిన, ఇమ్మభూవరుఁడు = ఇమ్మరాజో, ఏవిభు = ఏప్రభువు యొక్క, తండ్రి=జనకుఁడు, నానావిధ=పెక్కుభంగులయిన, పౌరుష = మగఁటిమల

చేత, స్థిర = తిరమైన, వృత్తి = వ్యాపారము గల, మీసాలతిమ్మశౌరి = మీసాలతిమ్మరాజో, ఏనృపోత్తము = ఏరాజశ్రేష్ఠునియొక్క, తల్లి=జనని, మానిత=మన్నింపఁబడిన, పరమ=శ్రేష్ఠము లయిన, సాధ్వీగుణంబుల=పాతివ్రత్యగుణములకు, ప్రోక = రాసియైన, తిమ్మమాంబ=తిమ్మాంబయో! ఏధీరు = ఏధృతిమంతునియొక్క, అనుజన్ములు = తమ్ములు, ఇద్ధ=ప్రకాశింపఁజేయఁబడిన, దాన=త్యాగముచేతను, క్షాత్ర = క్షత్త్రభావముచేతను—అనఁగాఁ బరిపాలనాదు లనుట. భద్రుండు = మంగళకరుఁ డయిన, చినవేంకటాద్రినృపుఁడు=చిన్నవేంకటాద్రిరాజును, ఘనులు = అధికులయిన, వేంకటరాయ = వేంకట్రాయనృపుఁడును, వేంకటవరద = వేంకటవరదప్రభువును, అనన్ = అనఁగా, ప్రసిద్ధులు=ఖ్యాతి కెక్కినవారు, ముగురు = ఈమువ్వురో, అట్టి=అటువంటి, ఆకువీటి=ఆకువీడను, పుర = పట్టణమునకు, వర = ఱేఁ డనెడు, అంకుండు = చిహ్నము గలవాఁడు, త్రిభువన=ముల్లోకములయందు, పూర్ణ=నిండిన, కీర్తి = యశము గలవాఁడు, అతుల=ఈడు లేని, తేజుండు = పరాక్రమము గలవాఁడు, పెదవేంకటాద్రివిభుఁడు = పెదవేంకటాద్రిరాజు.

వ. నిజాస్థానంబున సంగీతసాహిత్యాదివివిధవిద్యాప్రసంగంబులం బ్రవర్తిల్లుచు. 8

నిజ=తనయొక్క, ఆస్థానంబునన్ = కొలువుకూటమునందు, సంగీత = గానము, సాహితీ=సాహిత్యము, ఆది=మొదలుగాఁగల, వివిధ = అనేకములయిన, విద్యా = విద్యలయొక్క, ప్రసంగంబులన్ = ప్రసక్తులచేత, ప్రవర్తిల్లుచున్ = ఉన్నవాఁ డగుచు.

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు
సుచరిత్రుఁ బింగళసూరసుకవి
పౌత్త్రు నన్నపరతిభావనదౌహిత్రు
నమరధీమణికి నబ్బమకుఁ బుత్త్రు
ననుజన్ములైనట్టియమలనయొఱ్ఱనా
ర్యులు భక్తి సేవింప నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని
సూరననామ విశ్రుతుని నన్నుఁ
ఆ. బ్రియము సంధిలంగఁ బిలిపించి బహువస్త్ర
భూషణాదిదానములఁ గరంబు
సంతసం బొనర్చి యెంతయు గారవ
మెసఁగ మధురఫణితి నిట్టు లనియె. 9

శోభిత = ప్రకాశింపఁజేయంబడిన-ప్రసిద్ధినొందినదనుట. ఆపస్తంబసూత్రుః = ఆపస్తంబ మనుసూత్రము గలవాని, గౌతమగోత్రుః = గౌతములగోత్రముగలవాని, సుచరిత్రుః = మంచినడత గలవాని, పింగళిసూరసుకవిపౌత్రుః = పింగళిసూరన్న కవియొక్కమనమఁడైనవాని, నన్నపరతిభావన = నన్నపరతిభావనలకు, దౌహిత్రుః = కూఁతురుకొడుకైనవాని, అమరధీమణికిః = అమరయకవికిని, అబ్బమకుః=అబ్బమ్మకును, పుత్రుః=తనయుఁడయినవాని, అనుజన్ములైనట్టి = తమ్ములైన, అమలనయెఱ్ఱనార్యులు=అమలనయెఱ్ఱనకవులు, భక్తిః=భక్తిచేత, సేవింపః = సేవచేయుచుండఁగా, అలరువానిః = ఒప్పెడువాని-మహిమఁజెందువానిననుట. సత్కావ్య = మంచికావ్యములయొక్క - అనఁగా దోషరహితములై రసాదిప్రయుక్తము లయినవి యనుట-రచనా=కూర్పునందు, విశారదుం డగువానిః = నేర్పరియైనవాని, సూరననామ=సూరన యను పేర, విశ్రుతునిః = ప్రసిద్ధి కెక్కినవాని, నన్నుః = నను-క్రిందటి వెల్ల దీనికి విశేషణములు. ప్రియము = ప్రీతి, సంధిలంగః = తనరఁగా, పిలిపించి = పిలువ నంపి, బహు=అధికము లయిన, వస్త్ర = చేలములు, భూషణ=సొమ్ములు, ఆది = మొదలుగాఁ గలవానియొక్క, దానములను = ఈవులచేత, కరంబుః = మిక్కిలి, సంతసంబొనర్చి= సంతోషపెట్టి, ఎంతయుః = చాల, గారవ మెసఁగః = ఘనత మీఱఁగా, మధుర ఫణితిః =ఇంపగు తెఱఁగున, ఇట్టులు= ఈమీఁదఁ జెప్పఁబోయెడి ప్రకారమున, అనియెః = పల్కెను.

శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్య మెల్ల నగునే నోహో! యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుకబ్బం బద్భుతం బండ్రు ద
త్తుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్. 10

రెండర్థంబులపద్యము=ద్వ్యర్థి యగుపద్యమును, ఒక్కటియుః = ఒండేనియుఁ, నిర్మింపంగః = కూర్చుటకు, శక్యంబు గాకుండుః = తరముగాకుండును, అట్లుండఁగా; తద్గతిః = ఆరెండర్థములు గలపద్యముచొప్పున, కావ్య మెల్ల నగునేని = ఒక ప్రబంధము కడముట్ట నిర్మిత మాయెనేని - ఆకావ్య మనుట సిద్ధార్థము. అదియ కర్త, ఓహో యనంజేయదే=ఆశ్చర్యపడి మెచ్చుకొనునట్లు చేయఁజాలదా! పాండిత్యంబున నందునుః = రెండర్థములకావ్యమును జేయునట్టియా నేర్పునందును, తెనుఁగుకబ్బంబు= ఆంధ్రకావ్యము - అనఁగా నాంధ్రకావ్యముచేత యనుట. అద్భుతం బండ్రు = అరుదందురు-పెద్ద లని కర్త. భాషాకృతిః = వాగ్రూపమునఁ గావ్యస్వరూపముగననుట. రామభారతకథల్ = రామాయణభారతములను, జోడింపః = జంటగాఁ జేయుటకు-అనఁగా నారెండర్థములను నొకటిగాఁ జెప్పుటకు; ఇలః = భూమియందు, దక్షుండు=

సమర్థుఁడు, ఎవ్వాఁడు=ఏకవి, కలఁ డని శేషము. కావున నీకంటె నెవఁడును లేఁడని భావము.

ఉ. భీమన తొల్లి చెప్పె నను పెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గాన ర టుండనిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్
నామదిఁ దద్ద్వ్యర్థకృతినైపుణియుం గల దంచు నెంచెదన్! 11

తొల్లి = మునుపు, భీమన = భీమన యనుకవి-రెండర్థములకావ్యము నని తెచ్చుకొనునది. చెప్పెను = వచించె ననుట. అను = అనునట్టి, పెద్దలమాటయె కాని = వృద్ధుల వాక్యమే కాని - రెండర్థములకావ్యము నొకదాని భీమన చేసినట్టు పెద్దలు వాడుకొనుచున్నారని భావము. అందున్ = ఆకావ్యమునందు, ఒండు = ఒకటి, ఏమియున్ = ఏదియుఁ-ఒకపద్యము నైన ననుట. ఏయెడన్ = ఎచ్చోటను, నిలుచుట = వర్తించుటను, ఎవ్వరును=ఏవారును, కానరు = ఎఱుఁగరు. అటుండనిమ్ము = ఆవార్త యట్లుండనీ-ఇటనిది యనాదరోక్తి. ఇఁక నేమనఁగా; నానా = పెక్కులయిన, మహిత = పూజ్యములయిన, ప్రబంధ = కావ్యములయొక్క, రచనా = ఒనర్పుచేత, ఘన = అధిక మయిన, విశ్రుతి=ఖ్యాతి, నీకు, కల్గుటన్ = లభించుటచేత (ఇది హేతువు), తత్ = క్రిందటఁ జెప్పిన, ద్వ్యర్థ = రెండర్థముల ప్రబంధముయొక్క, కృతి = కూర్పునందుఁగల, నైపుణియున్ = నేర్పును, కల దంచు=నీకుఁ గలదని, నామదిన్ = నాహృదయమునందు, ఎంచెదన్=తలఁచెదను.

క. చాటుప్రబంధరచనా, పాటవకలితుఁడవు శబ్దపరిచితియందున్
మేటివి దీనిం దెనుఁగునఁ, బాటించి రచింప నీవ ప్రౌఢుఁడ వరయన్.

చాటుప్రబంధ = సంఖ్యాకాసంఖ్యాకాదిభేదప్రశస్తకృతులయొక్క, రచనా = ఒనర్పునందుఁ గల, పాటవ = నైపుణ్యముతోడ, కలితుఁడవు = కూడుకొన్నవాఁడవు, శబ్దపరిచితియందున్ = శబ్దపరిజ్ఞానమునందును, సాహితియం దనుట. మేటివి = సమర్థుఁడవు. కావున, అరయన్ = విచారించి చూడఁగా, దీనిన్ = ఈరెండర్థములకావ్యమును, తెనుఁగునన్ = ఆంధ్రమునందు, పాటించి = చైకొని, రచింపన్ = ఒనర్చుటకు, నీవ = నీవే, ప్రౌఢుఁడవు=జాణవు.

ఉ. దక్షత యింత గల్గి విశదంబుగఁ గాంచియు నీమదిన్ ఫలా
పేక్ష ఘనంబు కామి నిది యిట్టనఁ గొంకెద నీకు నోలలా
టేక్షణభక్తిశీల రచియించుట యిష్టమ కాదె శ్రీవిరూ
పాక్షున కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్. 13

దక్షత = కౌశలము, ఇంత గల్మిన్ = ఇంతమాత్రము కలిగి యుండుటను, విశదంబుగన్ = తెల్లముగ, కాంచియున్ = తెలిసియు, నీమదిన్ = నీయుల్లమందు, ఫలాపేక్ష = ప్రయోజనాసక్తి, ఘనంబు గామిన్ = గొప్ప కాక పోవుట చేత, నీకుఁ గృతి చెప్పి దాని ఫలమును బొందుట గొప్పయనుబుద్ధి లేమి హేతువుచేత నని భావము. ఇది యిట్టనన్ = ఈకృతి చేయుమనుటను, కొంకెదన్ = జంకెదను-అట్లు వలదు గాని, ఓలలాటేక్షణభక్తిశీల = ఈశ్వరభక్తినిరతుఁడయినవాఁడా! ఇది హేతుగర్భవిశేషణము. శ్రీవిరూపాక్షునకున్ = విరూపాక్షస్వామికి, అంకితంబుగన్ = పేర్కొనంబడినదిగా-శ్రీవిరూపాక్షుని పేరననుట. శుభార్థము = మేలుగలుగుటకొఱకు, రాఘవపాండవీయమున్ = రాఘవపాండవీయమను గ్రంథమును, రచియించుట=ఒనర్చుట, నీకున్=నీకును, ఇష్టము కాదె=అభీష్టమే కదా, ఫలాపేక్షచే నొనర్ప నిష్టము లేనివాఁడవైనను భగవదంకితముగఁ జేయ నిచ్ఛ గలవాఁడవు కావున శ్రీవిరూపాక్షుని పేర నీద్వ్యర్థకృతి నొనర్పు మని తాత్పర్యము.

వ. అని సవినయభక్తికంబు లగుమధురభాషణంబుల నిజాభిలాషంబు తెలుపం గొఱలంగించిన నేనునుం దదీయంబు లగునతిమాత్రగౌరవ సంభావనాదివిశేషంబులచేతం బ్రీతచేతస్కుండ నై యునికిం జేసి శక్యాశక్యవిచారంబు లేక యంగీకారభంగీతరంగితం బగునంత రంగంబుతో నతని నభివీక్షించి. 14

అని=ఇట్లని, సవినయభక్తికంబులు = వినయభక్తిసహితములు, అగు = అగునట్టి, మధురభాషణంబులన్ = తియ్యనిమాటలచే, నిజాభిలాషంబు తెలుంగు = తనకోర్కెరీతిని, ఎఱింగించినన్ = తెలిపించినను, తదీయంబులు=అతనివి - అగునట్టి, అతిమాత్రగౌరవ= ఎంతయు గౌరవముతోఁగూడిన, సంభావనాదివిశేషంబులచేతన్ = వింత లగుమన్ననలచే, ప్రీతచేతస్కుండ నై = సంతసించినహృదయము గలవాఁడ నై, ఉనికిం జేసి=ఉండుటచేత, శక్యాశక్యవిచారంబు = కాఁదగుఁ గాఁదగ దనుచింత, లేక, అంగీకారభంగీ=ఒప్పికోలువిధముచే, తరంగితం బగు= పెనుపఁబడినట్టి, అంతరంగంబుతోన్ = చిత్తముతోను, ఇట్లంటిని=ఈలాగునఁ బల్కితిని.

ఉ. రాఘవపాండవీయకథ రమ్యముగా నొకకావ్యసృష్టి నా
హా ఘటియింపఁగా వశమె యాంధ్రకవీంద్రుల కైనఁ దావక
శ్లాఘనపూర్వకోక్తి యవిలంఘ్యము గావునఁ గోవిదానుకం
పాఘనబుద్ధిఁ జూపెదఁ జమత్కృతిమత్కృతి మత్కృతిత్వమున్. 15

ఆంధ్రకవీంద్రుల కయినన్ = ఆంధ్రకవిశ్రేష్ఠులకేనియు, రాఘవపాండవీయకథ = రామాయణభారతములను, రమ్యముగాన్ = ఒప్పిదముగా, ఒకకావ్యసృష్టిన్ =

దక్షత = కౌశలము, ఇంత గల్మిన్ = ఇంతమాత్రము కలిగి యుండుటను, విశదంబుగన్=తెల్లముగ, కాంచియున్ = తెలిసియు, నీమదిన్ = నీయుల్లమందు, ఫలాపేక్ష = ప్రయోజనాసక్తి, ఘనంబు గామిన్ = గొప్ప కాక పోవుట చేత, నీకుఁ గృతి చెప్పి దాని ఫలమును బొందుట గొప్పయనుబుద్ధి లేమి హేతువుచేత నని భావము. ఇది యిట్టినన్ = ఈకృతి చేయుమనుటకు, కొంకెదన్ = జంకెదను-అట్లు వలదు గాని, ఓలలాటేక్షణభక్తిశీల = ఈశ్వరభక్తినిరతుఁడయినవాఁడా! ఇది హేతుగర్భవిశేషణము. శ్రీవిరూపాక్షునకున్ = విరూపాక్షస్వామికి, అంకితంబుగన్ = పేర్కొనంబడినదిగా-శ్రీవిరూపాక్షుని పేరననుట. శుభార్థము = మేలుగలుగుటకొఱకు, రాఘవపాండవీయమున్ = రాఘవపాండవీయమను గ్రంథమును, రచియించుట=ఒనర్చుట, నీకున్=నీకును, ఇష్టము కాదె=అభీష్టమే కదా, ఫలాపేక్షచే నొనర్ప నిష్టము లేనివాఁడవైనను భగవదంకితముగఁ జేయ నిచ్ఛ గలవాఁడవు కావున శ్రీవిరూపాక్షుని పేర నీద్వ్యర్థకృతి నొనర్పు మని తాత్పర్యము.

వ. అని సవినయభక్తికంబు లగుమధురభాషణంబుల నిజాభిలాషంబు
తెఱం గెఱింగించిన నేనునుం దదీయంబు లగునతిమాత్రగౌరవ
సంభావనాదివిశేషంబులచేతం బ్రీతచేతస్కుండ నై యునికిం జేసి
శక్యాశక్యవిచారంబు లేక యంగీకారభంగీతరంగితం బగునంత
రంగంబుతో నతని నభివీక్షించి. 14

అని=ఇట్లని, సవినయభక్తికంబులు = వినయభక్తిసహితములు, అగు = అగునట్టి, మధురభాషణంబులన్ = తియ్యనిమాటలచే, నిజాభిలాషంబు తెఱంగు = తనకోర్కెరీతిని, ఎఱింగించినన్ = తెలిపించినను, తదీయంబులు=అతనివి - అగునట్టి, అతిమాత్రగౌరవ= ఎంతయు గారవముతోఁగూడిన, సంభావనాదివిశేషంబులచేతన్ = వింత లగుమన్ననలచే, ప్రీతచేతస్కుండ నై = సంతసించినహృదయము గలవాఁడ నై, ఉనికిం జేసి=ఉండుట చేత, శక్యాశక్యవిచారంబు = కాఁదగుఁ గాఁదగ దనుచింత, లేక, అంగీకారభంగీ=ఒప్పికోలువిధముచే, తరంగితం బగు= పెనుపఁబడినట్టి, అంతరంగంబుతోన్ = చిత్తముతోను, ఇ ట్లంటిని=ఈలాగునఁ బల్కితిని.

ఉ. రాఘవపాండవీయకథ రమ్యముగా నొకకావ్యసృష్టి నా
హా ఘటియింపఁగా వశమె యాంధ్రకవీంద్రుల కైనఁ దావక
శ్లాఘనపూర్వకోక్తి యవిలంఘ్యము గావునఁ గోవిదానుకం
పాఘనబుద్ధిఁ జూపెదఁ జమత్కృతిమత్కృతి మత్కృతిత్వమున్. 15

ఆంధ్రకవీంద్రుల కయినన్ = ఆంధ్రకవిశ్రేష్ఠులకేనియు, రాఘవపాండవీయకథ = రామాయణభారతములను, రమ్యముగాన్ = ఒప్పిదముగా, ఒకకావ్యసృష్టిన్ =

ఒక ప్రబంధనిర్మాణముచేత, ఆహా = ఔరా ! ఆశ్చర్యవాచకము. ఘటియింపఁగాన్ = కూర్చుటకు, వశమె = శక్యమా, రాఘవభారతార్థములు రెండు కలిగి యుండునట్లుగా నొకకావ్యము నిర్మింపఁ గూడునా యనుట. అట్లైనను, తావక = నీదగు, శ్లాఘనపూర్వక = పొగడుకోలుమున్నుగాఁ గల, ఉక్తి=మాట, అవిలంఘ్యము = దాఁటఁ దగనిది, కావునన్ = ఆకారణముచేత, కోవిద = విద్వాంసులయొక్క, అనుకంపా=కరుణచేత, ఘన = అతిశయముం బొందిన, బుద్ధిన్ = మతిచేత - పండితోత్తముల కృపాతిశయమువలన నాబుద్ధికి నిట్టిమహాకావ్య నిర్మాణమునందుఁ జూడ్కి కలిగెంగాని మఱి యొకటిఁ గాదనుట. చమత్కృతిమత్ = చమత్కారము గల, కృతిన్ = ప్రబంధరచనయందు, మత్కృతిత్వమున్ = నాకౌశలమును, చూపెదన్=కనుపఱిచెదను.

వ. అని మఱియు నతనిచేత ననేకవిధసత్కారసంభావనాసంభృతసమ్మదుండనై. 16

అని=ఇట్లని, మఱియును, అతనిచేతన్ = ఆపెదవేంకటాద్రిప్రభువుచేత, అనేకవిధ=నానాప్రకారములయిన, సత్కారసంభావనా = దానసమ్మానములచేత, సంభృత = వహింపఁబడిన, సమ్మదుండనై=సంతోషము గలవాఁడనై.

సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష,
యొక్కొకచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట న,
ర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేషఘటన యొక్కొకతఱి
నర్థాన్వయము వేఱెయగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక్క,
తఱి నివి యొక్కొక్కతఱిని రెండు
తే. మూఁడు గూడుట యన సముజ్జ్వలము గాఁగ
నాకుఁ దోఁచినగతిఁ జెక్కుఁబోక లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచుసుమతుల కేర్పడ నాచరింతు. 17

ఒక్కొకచోటన్ = ఒక్కొకయెడ, ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష = ఆంధ్రగీర్వాణములయొక్కకూడికయు, ఒక్కొక్కచోటన్, ఉచిత = తగిన, శబ్దశ్లేష= శబ్దములకూడికయు, ఒక్కొక్కచోటన్, అర్థశ్లేష = అర్థములకూడికయు, ఒక్కొక తఱిన్=ఒక్కొకవేళ, ముఖ్యగౌణ = ప్రధానాప్రధానములయిన, వృత్తి=ప్రవృత్తులు

గల, శ్లేష = కూడికయొక్క, ఘటన = కూర్పును, ఒక్కొకతఱిని, అర్థాన్వయము = అర్థములచేరిక, వేఱె యగుచున్ = భిన్నమగుచును, ఉనికి = ఉండుటయు, ఒక్కొక తఱిని, శబ్దాన్వయ = శబ్దములచేర్పుటయొక్క, విభేదసంగతి=వేఱుపాటును, ఒక్కొక తఱిని, ఇవి = ఈక్రిందటఁ జెప్పినశ్లేషాదులు, రెండుమూఁడు = రెండు గాని మూఁడు గాని, కూడుట = చేరుటయు, మఱియు, సముజ్జ్వలముగన్ = ఒప్పునట్లుగా ననుట. నాకు, తోఁచినగతిన్ = స్ఫురించునట్టివిధమున, పెక్కుపోకలు = పలుమార్గములు, అమరన్ = ఏర్పడునట్లుగా, రామభారతకథలు = భారతరామాయణములను, పర్యాయ దృష్టిన్ = పర్యాయక్రమమున, చూచుసుమతులకున్ = పరికించునట్టిధీమంతులకు, ఏర్పడన్ = రామభారతకథలు వేఱువేఱ నేర్పడునట్లు, ఆచరింతున్ = రచియింతును, కృతి నని సంబంధము.

క. ఒకకథ వినియెడితఱి వే
 ఱొకకథపై దృష్టి యిడిననొకయర్థముఁ దోఁ
 పక పోవుఁ గాన నేకా
 ర్థకావ్య మెట్లట్ల వినఁగఁ దగునొకటొకటిన్. 18

ఒకకథ = ఒక్కకథను, వినియెడితఱిన్ = ఆకర్ణించునట్టివేళ, వేఱొకకథపైన్= మఱియొకకథమీఁద, దృష్టి యిడినన్ = చూడ్కి యుంచినయెడల - తలఁపుంచిన ననుట. ఒకయర్థమున్ = ఒకయర్థమేనియు, తోఁపక పోవుఁ గానన్ = స్ఫురింపక పోవును గనుక, ఏకార్థకావ్యము = ఒకయర్థముగలగ్రంథము, ఎట్లు = ఏప్రకారమో, అట్ల = ఆప్రకారమే, ఒకటొకటిన్ = ఒక్కొక్క యర్థమునుగా, వినఁగఁ దగున్= ఆకర్ణింపవలయును.

తే. ప్రభువుసత్కారఋణ మిందుఁ బాయు ననియు
 శ్రీవిరూపాక్షసేవావిశేష మనియు
 సుజను లిందు గుణాంశంబ చూతు రనియుఁ
 జలిపితి నసాధ్యకృతి కిట్లు సాహసంబు. 19

ప్రభువు = పెదవేంకటాద్రిప్రభువుయొక్క, సత్కార = సమ్మాన మనెడు, ఋణము=అప్పు, ఇందున్ = ఈకావ్యనిర్మాణమునందు, పాయు ననియున్=తీరు నను చును, శ్రీవిరూపాక్ష = విరూపాక్షదేవునియొక్క, సేవా = భజనవలన నైన, విశే షము = శ్రేష్ఠ్యమును కలుగు నని శేషము. అనియు, సుజనులు = పెద్దలు, ఇందున్= ఈకావ్యమునందు, గుణాంశంబ=మేలగుపట్టునే, చూతురనియున్ = కాంతురనియు, అసాధ్య = సెఱవేర్పఁ దగని, కృతికిన్ = ప్రబంధనిర్మాణమునకు, ఇట్లు = ఈలాగున, సాహసంబు = తెగువను, చలిపితిన్ = చేసితిని, "సలుపు" అనునీక్రియాపద మీరాఘవ పాండవీయప్రాచీనలిఖితప్రతులయం దంతటఁ జాదిగా వ్రాయఁబడి యున్నది గాని

తదాది యని నిర్ధారణ చేయుట కాకరము లేదు. ఇప్పటివాడుక సాదిగాఁ గనుపడు చున్నయది.

వ. అని యిట్లుకృతోత్సాహుండ నగుచు నేతత్ప్రబంధనిబంధనారంభం బునకుఁ బ్రేరకుండైనసకలాంతర్యామి హేమకూటాధ్యక్షుండు శ్రీ విరూపాక్షుండనిర్విఘ్నపరిసమాప్తిప్రచయగమనంబులకుం దానకలం డతనిసంకల్పానుసారంబున నెట్లు గావలయు నట్లగుం గాక నాకు భారం బేమి యనుతలంపున నిశ్చింతుండ నై కడంగి దీనికిఁ బ్రత్యక్ష నియామకుం డైన పెదవేంకటాద్రిమహీవల్లభువంశక్రమం బభి వర్ణించెద. 20

అని యిట్లు, కృత = చేయఁబడిన, ఉత్సాహుండ నగుచున్ = పూనిక గలవాఁడ నై, ఏతత్ప్రబంధ = ఈకావ్యముయొక్క, నిబంధనారంభంబునకున్ = నిర్మాణప్రారంభ మునకు, ప్రేరకుం డైన = పురికొల్పువాఁ డగునట్టి, సకలాంతర్యామి = సర్వజనహృద యాంతర్వర్తియైన, హేమకూటాధ్యక్షుండు = హేమకూటాచలేంద్రుఁడగు, శ్రీవిరూ పాక్షస్వామియే, నిర్విఘ్న = చెఱుపు లే కుండునట్లు, పరిసమాప్తి = ముగియుటకును, ప్రచయగమనంబులకున్ = వ్యాప్తి నొందుటకును, తాన = తానే-శ్రీవిరూపాక్షుఁడే యనుట. కలండు = ఉన్నాఁడు. అతని = ఆవిరూపాక్షస్వామియొక్క, సంకల్పాను సారంబునన్ = ఇచ్ఛవెంబడిని, ఎట్లు = ఏరీతి, కావలయున్ = కావలయునో, అట్లు= ఆరీతి, అగుంగాక=ఔఁ గాత. నాకు, భారంబు=బరువు, ఏమి యనుతలంపునన్ = ఏమి యున్న దనుభావముచే, నిశ్చింతుండ నై = వగపు లేనివాఁడ నై, కడంగి=యత్న పడి, దీనికిన్ = ఈప్రబంధనిర్మాణమునకు, ప్రత్యక్ష = ఎదుట నుండునట్టి, నియామ కుండు = ప్రోత్సాహకుఁడు, అయిన, పెదవేంకటాద్రి మహీవల్లభు = పెదవేంకటాద్రి ప్రభువుయొక్క, వంశ = కులముయొక్క, క్రమంబు = వరుసను, అభివర్ణించెదన్ = ఉగ్గడించెదను.

శా. శ్రీశోభాఘనుఁ డిమ్మభూవరుఁడు లక్ష్మీనాథకల్పద్రుబా
హాశాఖాఫలమైనవంశమున మూర్ధామోదమున్ బోలె స
ర్వాశాపూరితకీర్తివాసనలతో నావిర్భవించెన్ ధరి
త్రీశోత్తంసితభవ్యశాసనకళాహేతుప్రతాపాఢ్యుఁ డై. 21

శ్రీశోభా=సంపద్విలాసముచేత, ఘనుఁడు = అధికుఁ డయిన = ఇమ్మభూవరుఁడు= ఇమ్మరాజు, లక్ష్మీనాథ = శ్రీమన్నారాయణుఁ డనెడు, కల్పద్రు = కల్పవృక్షము యొక్క, బాహా = భుజ మనెడు, శాఖా=కొమ్మయందుఁ గల, ఫలమయినవంశమునన్= పండైనకులమునందు - అనఁగా క్షత్రియకులమునందనుట. ధరిత్రీశ = రాజులచేతఁ

ఉత్తంసిత = శిరోభూషణముగాఁ జేయఁబడిన దై, భవ్య = ఒప్పిదము నైన - యుక్తమైన దనుట. శాసనకళా = శిక్షావిధికి, హేతు = కారణమైన, ప్రతాప=పరాక్రమము చేత, ఆఢ్యుఁడై = సంపన్నుఁడయి-అతనిపరాక్రమమునకు వెఱచి రాజులందఱు నతని యాజ్ఞ శిరముచే వహించుచుండిరి. (అనఁగా రాజులంద ఱతనికి లోఁబడిరనిభావము.) మూర్తా మోదముల్ బోలెన్=మూర్తివంతమైన వాసనావిశేషమువలె, సర్వాశా=ఎల్ల దిక్కులయందు, పూరిత = నిండింపఁబడిన, కీర్తి=యశమనెడు, వాసనలతోన్ = గంధములతోడ, ఆవిర్భవించెన్=జనించెను.

తే. ఆకువీటిపురీశాసనాంకుఁ డగుచు
సకల సంగ్రామకేళినిశ్శంకుఁ డగుచు
ననిశపూజితశేషపర్యంకుఁ డగుచు
నతఁడు సొంపొందు యువతి మీనాంకుఁ డగుచు. 22

ఆకువీటిపురీశాసన = ఆకువీటిపురప్రభువనెడు, అంకుఁ డగుచున్=పేరుగలవాఁడగుచు, సకలసంగ్రామకేళి = సమస్తయుద్ధక్రీడలయందు, నిశ్శంకుఁడగుచున్=జంకులేనివాఁడగుచు, అనిశ = నిరంతరము, పూజిత = అర్చింపఁబడిన, శేషపర్యంకుఁడగుచున్ = అనంతుఁడు శయ్యగాఁగలవిష్ణుమూర్తిగలవాఁ డగుచు, యువతిమీనాంకుఁడగుచున్ = మానినీమన్మథుఁడగుచును, అతఁడు=అయిమ్మభూపతి, సొంపొందున్=యింపొందెను.

క. కౌండిన్యగోత్రజలధివి,ధుం డాతఁడు గాంచె వరసుతున్ భావమహీ
మండలపతిఁ గదనబలో,ద్దండుని లక్ష్మాంబ యనెడు తనసతియందున్.

కౌండిన్యగోత్రమనెడు, జలధి = సముద్రమునకు, విధుండు = చంద్రుఁడయిన, ఆతఁడు = అయిమ్మభూపతి, లక్ష్మాంబ యనెడు, తనసతియందున్ = తనభార్యయందు, కదనబలోద్దండునిన్ = యుద్ధమునందలి బలిమిచేత భయంకరుఁడైనవాని, భావమహీమండలపతిన్=భావరాజును, వరసుతున్ = శ్రేష్ఠుఁడైనపుత్త్రునిగా, కాంచెన్ = కనెను.

స్రగ్ధర. ఆలక్ష్మాంబాకుమారుం డమలయశుఁడు భావావనీశుండు సాధ్వీం
బోలాంబన్ బెండ్లి యై యొప్పుగఁ గనియెసుతున్ భూపరీరంభలీలా
శీలస్థూలంభవిష్ణుస్థిరభుజబలలక్ష్మీవిశేషప్రయుక్తో
ద్వేలాశాదంతిశుండా విలసనలఘిమావేశు నిమ్మక్షితీశున్. 24

ఆలక్ష్మాంబాకుమారుండు = ఆలక్ష్మమ్మపుత్త్రుఁడయిన, అమలయశుఁడు = నిర్మలకీర్తిగలవాఁడైన, భావావనీశుండు = భావరాజు, సాధ్వీన్ = పతివ్రతయైన, పోలాంబన్ = పోలమను, పెండ్లియై = వివాహమయి, ఒప్పుగన్ = తగునట్లుగా, భూ = భూదేవి యొక్క, పరీరంభ=కౌఁగిలింతయందుఁగల - భూమివహనమనుట. లీలా=వేడుకయే, శీల=

స్వభావముగాఁగల, స్థూలంభవిష్ణు = తోరముగాఁగల - వృద్ధిఁబొందుచున్నదనుట. స్థిర= నిల్కడయైన, భుజబల = బాహుబలముయొక్క, లక్ష్మీవిశేష = సమృద్ధ్యతిశయముచేత, ప్రయుక్త = ప్రయోగింపఁబడిన - కలుగఁజేయఁబడినదనుట. ఉద్వేలాశా = దిగంతములయందున్న, దంతి = దంతావలములయొక్క, శుండా=తుండములయొక్క, విలసన = విజృంభణముకొఱకైన, లఘిమావేశున్ = లఘుత్వప్రవేశముగలవాని, ఇమ్మక్షితీశున్ = ఇమ్మభూపతిని, సుతున్=పుత్త్రునిగా, కనియెన్ = కాంచెను.

క. రాజమహేంద్రవరాధిపు, రీజైత్రవిచిత్రములఁ బరిభ్రాజితుఁడై
యాజిఘనుం డాయిమ్మమహీజాని ప్రసిద్ధిఁగాంచె నెంతయుమహిమన్.

రాజమహేంద్రవరమనెడు, అధిపురీ = పట్టణశ్రేష్ఠముయొక్క, జైత్ర = జయశీలమైన, విచిత్రములన్ = వింతపనులచేత, పరిభ్రాజితుఁడై=ప్రకాశింపఁబడినవాఁడై, ఆజిఘనుండు = రణశూరుఁడయిన, ఆయిమ్మమహీజాని = ఆయిమ్మరాజు, ఎంతయుఁమహిమన్=మిక్కిలి ప్రభావముచేత, ప్రసిద్ధిగాంచెన్ = ప్రఖ్యాతిఁజెందెను.

తే. ఆమహీలోకవిభుని యర్ధాంగలక్ష్మి
యయినకసవమ్మ యనసూయ యగుట నార్య
యగుట సుప్రసిద్ధమ వేఱె యడుగ నేల
వినుతికెక్కు పాతివ్రత్యవిలసనంబు. 26

ఆమహీలోకవిభుని = ఆయిమ్మభూవరునియొక్క, అర్ధాంగలక్ష్మి = అర్ధశరీరలక్ష్మి, ఐన=అయినట్టి-అనఁగా భార్యయయిన, కసవమ్మ = కసవాంబ, అనసూయ = అనసూయాదేవియు-అసూయలేనిదియు, అగుటన్ = అవుటచేతను, ఆర్య=పార్వతీదేవియు - కులీనయు, అగుటన్=అవుటచేతను, సుప్రసిద్ధమ=తేటతెల్లమె, వినుతికెక్కు = ప్రఖ్యాతినొందిన, పాతివ్రత్యవిలసనంబు = పతివ్రతామహిమను, వేఱె = ప్రత్యేకముగా, అడుగనేల=విచారింపనేమిటికి.

క. ఆయిమ్మడిధాత్రీతల, నాయకునకుఁ గసవమకును నందను లధిక
శ్రీయుతు లిద్దరు సుజనవి, ధేయులు బొమ్మప్రభుండు తిమ్మవిభుండున్.

ఆయిమ్మడిధాత్రీతలనాయకునకున్ = ఆయిమ్మభూపతికిని, కసవమకును=కసవాంబకును, అధికశ్రీయుఁతులు = ఘనలక్ష్మీసమన్వితులు, సుజనవిధేయులు = సజ్జనులకడఁగినవారు, బొమ్మప్రభుండు=బొమ్మరాజును, తిమ్మవిభుండున్ = తిమ్మరాజుననఁగా, ఇద్దరు = ఇరువురైన, నందనులు=సుతులు-కలరని శేషము.

వ. వారిలోన. 28

వారిలోనన్=ఆయిరువురిలోపల.

ఉ. పావనమూర్తియై విజయభైరవసద్బిరుదాంకుఁ డై దశా
శావనితాలలాటతటచందనచిత్రకభావభాగ్యశ
శ్శ్రీవిభవాభిరాముఁ డయి జృంభితదానవిహారుఁ డై ధరి
త్రీవలయంబునన్ వెలసెఁ దిమ్మనృపాలుఁడు ధర్మశీలుఁ డై. 29

పావనమూర్తియై=నిర్మలదేహుఁడై - సౌందర్యవంతుండై యనుట, విజయభైరవసద్బిరుదాంకుఁడై=విజయభైరవుఁ డను మేటిబిరుదుగలవాఁడై, దశ=పదియైన, ఆశా = దిక్కు లనెడు, వనితా = కాంతలయొక్క, లలాటతట = అలికప్రదేశముల యందుఁ గల, చందనచిత్రకభావ = గంధపుబొట్టగుటను, భాక్ = పొందిన, యశశ్శ్రీవిభవ= కీర్తివైభవముచేత, అభిరాముఁడయి = ఒప్పినవాఁడై - అనఁగా శుభ్రకీర్తి యెల్లదిశల వ్యాపించిన దని భావము. జృంభితదానవిహారుఁడై = ప్రశస్తత్యాగపరుఁడయి, ధర్మశీలుఁడై = పుణ్యస్వభావుఁడయి, తిమ్మనృపాలుఁడు = తిమ్మరాజు, ధరిత్రీవలయంబునన్ = భూతలమునందు, వెలసెన్ = ప్రకాశించెను.

క. ఉభయకులసిద్ధిఁ దనరెడు,నభినవగుణములఁ బ్రసిద్ధ యగుతిమ్మాంబన్
విభవమునఁ బెండ్లియాడెను, ద్రిభువనవిభుఁ డాకువీటితిమ్మవిభుఁ డొగిన్.

త్రిభువన=ముల్లోకములయందు వ్యాపించిన, విభుఁడు=ప్రతాపముగల, ఆకువీటి= ఆకువీడను పట్టణమునకురాజైన, తిమ్మవిభుఁడు=తిమ్మరాజు, ఒగిన్ = క్రమమున-వయఃప్రాప్తియందనుట. ఉభయకుల = పుట్టినమెట్టినయింటివారివంగసములయొక్క, సిద్ధిన్= నిల్కడచేత, తనరెడు = ఒప్పునట్టి, అభినవగుణములన్ = క్రొత్తలైనసద్గుణములచేతను, ప్రసిద్ధయగు=ప్రసిద్ధురాలైన - పాతివ్రత్యాదిసద్గుణమహిమచే నుభయకులోద్ధారకుగా లయినదనుట. తిమ్మాంబన్=తిమ్మమ్మను, విభవమునన్=వైభవమున, పెండ్లియాడెను = వివాహమయ్యెను.

చ. పటుబలశాలి తిమ్మనరపాలుఁడు పుత్త్రులఁ గాంచె విక్రమో
ద్భటుఁ బెదవేంకటాద్రిఁ బ్రతిపక్షహరుం బినవేంకటున్ మరు
ద్విటపిసమానదానఘను వేంకటరాయని భవ్యతేజు వెం
కటవరదున్ బుధప్రణుతి గాంచినతిమ్మమయందుఁ బెంపుగన్. 31

పటుబలశాలి = గట్టిబల్మిగల, తిమ్మనరపాలుఁడు = తిమ్మభూపతి, బుధప్రణుతి గాంచిన=పెద్దలస్తోత్రమునుబొందిన, తిమ్మమయందున్ = తిమ్మాంబయందు, పెంపుగన్= వృద్ధిగా, విక్రమోద్భటున్ = పరాక్రమోద్దండుఁడైన, పెదవేంకటాద్రిన్ = పెద వేంకటాద్రియనునాతని, ప్రతిపక్షహరున్=శత్రుసంహారకుఁడయిన, పినవేంకటున్ = చిన్నవేంకటాద్రియనునాతని, మరుద్విటపిసమాన=కల్పవృక్షముతో నీడయిన, దాన=

ఈవిచేత, ఘనున్ = గొప్పవాఁడైన, అనఁగాఁ బ్రసిద్ధినొందిన, వేంకటరాయనిన్ = వేంకట్రాయఁడనునాతని, భవ్యతేజున్ = ప్రతాపశాలియైన, వేంకటవరదున్ = వేంకటవరదుఁ డనునాతనిని, ఈనలువురిని, పుత్త్రులన్ = సుతులను, కాంచెన్ = కనెను.

వ. అందు 32

అందున్ = ఆనలువురియందు.

తే. అమరవరభూమిభృన్మస్తకములఁ గ్రిందు
పఱచునిజపాదకటకసత్ప్రౌఢిచేత
విమలధృతిఁ గేశవప్రాయణమున వెలయు
వేంకటాద్రియ యనఁ బినవేంకటాద్రి. 33

అమరవరభూమిభృత్ = దేవనగరమైన మేరుపర్వతముయొక్క, మస్తకములన్ = శిఖరములను, క్రిందుపఱచు = తగ్గఁజేయుచున్న, నిజ=తనయొక్క, పాదకటక=నితంబప్రదేశముయొక్క, సత్ప్రౌఢిచేతన్ = ఔన్నత్యముచేతననుట - మేరుపర్వతమునకంటె మించినదనితాత్పర్యము. అర్థాంతరము. అమరన్=ఒప్పుఁగా, వరభూమిభృత్=రాజశ్రేష్ఠులయొక్క, మస్తకములన్ = తలలను, క్రిందుపఱచు = క్రిందుగాఁజేయుచున్న-వంచికొనఁజేయుచున్నవనుట. నిజ=తనయొక్క, పాద = చరణములయందున్న, కటక = నూపురములచేతనైన, సత్ప్రౌఢిచేతన్ = మ్రోఁతచేతననుట - చినవేంకటాద్రియొక్కడుకడిమిచే బిరుదుగాఁబాదములఁ దాల్చినయందియలఁజూచి శత్రురాజులు మాఱాడక తలలు వంచుకొందురని తాత్పర్యము. విమల=నిర్మలమైన, ధృతిన్=ధైర్యముచేతను, కేశవ=వేంకటేశ్వరునికి, ప్రాయణమునన్ = ఉనికి యగుటచేతను - చిన వేంకటాద్రి వేంకటేశ్వరుని నిరంతరభక్తిచే ధ్యానించుచుండుటవలన, వేంకటేశ్వరస్వామియుఁ జినవేంకటాద్రిహృదయమందే వాసముచేయుచుండె నని తాత్పర్యము. అర్థాంతరము. వేంకటాద్రియ యనన్=వేంకటాచలమే యనునట్టుగా, పినవేంకటాద్రి = చినవేంకటాద్రిరాజు, వెలయున్ = ఒప్పును.

చ. క్షమయు నమోఘవిక్రమము సద్వినయంబు ప్రతాపమున్ సురూ
పము నవికారభావమును బ్రాభవశక్తియు నిత్యదానశీ
లముఁ దగ నొక్కటొక్కటి కలంకృతిఁజేయఁగఁ దాల్చి శోభిలున్
విమలత నాకుపీటిపుర వేంకటరాయఁ డతిప్రసిద్ధుఁ డై. 34

ఆకుపీటిపుర=ఆకుపీటిపట్టణమునకధిపతియయిన, వేంకటరాయఁడు=వేంకటరాయఁడనురాజు, క్షమయున్=సయిరణను, అమోఘ=మొక్కవోని, విక్రమము=బీరమును, సద్వినయంబు=మంచినమ్రతను, ప్రతాపమును=వేఁడిమిని, సురూపమును=చక్కఁదనమును, అవికారభావమును = వెక్కురుఁదనములేమిని, ప్రాభవశక్తియున్ = దొరతనపుఠీవిని,

నిత్య=ఎడతెగని, దానశీలము = ఈగినడకను, తగన్=తగునట్లు, ఒక్కటి=ఒకగుణము, ఒక్కటికిన్=మఱియొకగుణమునకు, అలంకృతిన్ = సింగారమును, చేయఁగన్=ఒనర్చునట్లుగా - ఒకటిచేనొకటి ప్రకాశింపఁగా ననుట. తాల్చి=ధరించి-అనఁగా నీగుణములు కలవాఁడై, అతిప్రసిద్ధుఁడై=ఇట్టిసద్గుణములు కలవాఁడు కనుకనే మిక్కిలి ఖ్యాతిజెంది నాఁడని సంబంధము. విమలతర=నిష్కల్మషత్వముచేత - పాపకృత్యములుచేయనివాఁడనుట. శోభిలున్=ప్రకాశించును.

క. వేంకటవరదుఁడు వెలయు ని,రంకుశవితరణనిరూఢ ప్రజ్ఞను రణని
శ్శంకితప్రాభవమున నక,లంకితకీర్తిప్రతాపలక్ష్ములమహిమన్. 35

వేంకటవరదుఁడు = వేంకటవరదరాజు, నిరంకుశ = అడ్డపాటులేని, వితరణ=త్యాగములందు, నిరూఢ=తీర్పుగల, ప్రజ్ఞను=బుద్ధిచేతను, రణ=కయ్యముచేత, నిశ్శంకిత=జంకులేనిదిగాఁజేయఁబడిన, ప్రాభవమునన్ = విలుబడిచేతను - అనఁగాఁ జక్కఁగా యుద్ధముచేయువాఁ డనుట. అకలంకిత = కలకలేనిదిగాఁ జేయఁబడిన, కీర్తిప్రతాపలక్ష్ముల = పొగడువేడుములసిరులయొక్క, మహిమన్ = ఎక్కువచేతను, వెలయున్ = ప్రకాశించును.

తే. ఇట్టి యన్వయపరిశుద్ధి యింపుమీఱ
శ్రీవిరూపాక్ష భక్తివిశేష విమల
హృదయుఁ డగుచు సంగీతసాహిత్యనిత్య
సరసగోష్ఠీవినోదైకనిరతుఁ డగుచు. 36

ఇట్టి= ఈపూర్వోక్తమయినట్టి, అన్వయ=వంశముయొక్క, పరిశుద్ధి=గరగరిక, ఇంపుమీఱన్=ముద్దుచెలఁగఁగా, ఇది (సతిసప్తమి) శ్రీవిరూపాక్షస్వామియందుఁగల, భక్తివిశేష=భక్త్యతిశయముచేత, విమల = కసటువాసిన, హృదయుఁడగుచున్=ఉల్లము గలవాఁ డగుచును, సంగీత=పాటచేతను, సాహిత్య=చదువుచేతను, నిత్య=నిశ్చల మగు, సరస=తెలివరులతోడనగు, గోష్ఠీ=కూటువయందైన, వినోదైక = వేడుకయొకటనే, నిరతుఁడగుచున్=ఇచ్చకలవాఁడగుచును, కర్తృక్రియలు వైపద్యమున.

క. వడిగలతనాన నీవిని
విడిముడిపసఁ బ్రాభవమున విజయనగరిలోఁ
గడు నెన్న నేర్చఁ గలమే
ల్నడకలఁ బెదవేంకటాద్రినరవరుఁ డొప్పున్. 37

వడిగలతనానన్=శౌర్యముచేతను, ఈవిని = త్యాగముచేతను, విడిముడిపసన్=ధనసంపత్తిచేతను, ప్రాభవమునన్ = ప్రభుత్వముచేతను, విజయనగరిలోన్ = విజయనగరములో, కడున్ = మిక్కిలి, ఎన్నన్ = గణించుటకును, ఏర్చన్=ఇవి యని యేర్ప

రించుటకును, కల = కలిగినట్టి-తగిన వనుట. మేల్నడకలన్ = మేటివర్తనలచేత, పెద వేంకటాద్రిరాజు, ఒప్పున్ = ప్రకాశించును.

చ. విడువక యాకువీటి పెద వేంకటభూపతిసత్ప్రతాపముం
గడుఁ దెలుపైనకీర్తియు జగంబుల నన్నిఁటి మించి ముంచినన్
జడధిశయుండు సంతసిలునాదువిరాణ్మయమూర్తికబ్బె ని
ప్పుడు నవకుంకుమంబు తెలిపూవులపూజయు నంచు నాత్మలోన్. 38

ఆకువీటి = ఆకువీటిపట్టణప్రభువైన, పెదవేంకటభూపతి = పెద్దవేంకటాద్రిరాజుయొక్క, సత్ప్రతాపమున్ = ఉజ్జ్వలమైనపరాక్రమమును, కడున్ = మిక్కిలి, తెలుపైన = తెల్లనైనట్టి, కీర్తియున్ = యశమును - ఈరెండుకర్తలు. జగంబులనన్నిఁటిన్=లోకములనెల్లను, మించి = అతిక్రమించి, ముంచినన్=ముసుఁగఁజేసినను - కీర్తిప్రతాపప్రవాహము జలప్రళయమువలె లోకములనెల్ల ముంచెననుట. జడధిశయుండు=సముద్రశాయియయిననారాయణుఁడు, ఇప్పుడు = ఈవేళ, నాదు = నాయొక్క, విరాణ్మయ = విరాడ్రూపమైన, మూర్తికిన్ = దేహమునకు-ప్రళయమున హరి విరాణ్మూర్తియయి సముద్రములోఁ బవళించుటశాస్త్రసిద్ధము. నవ = క్రొత్తయయిన, కుంకుమంబు=కుంకుమపుఁబూఁతయు, తెలి=తెల్లనైన, పూవుల = పుష్పములచేనయిన, పూజయున్=అర్చనయు, అబ్బెనంచున్ = కలిగెననుచు, ఆత్మలోన్ = హృదయమున, సంతసిల్లున్=ఆనందించును.

ఉ. చేకొని యాకువీటివిభు శ్రీపెదవేంకటుఁ జెంది యాత్మలో
నేకలసద్గుణంబు మహియెన్న దనేకలసద్గుణాప్తిచేఁ
గై కొని శేషభోగములకల్మి దలంప దశేషభోగలీ
లాకలనంబుచేతఁ గరులన్ గిరులన్ మఱి చెప్పనేటికిన్. 39

మహి=భూమిదేవి, ఆకువీటివిభున్ = ఆకువీటిపురాధీశ్వరుఁడైన, శ్రీపెదవేంకటున్=పెదవేంకటాద్రిరాజును, చేకొని = వరియించి, చెంది = కూడి-పాలింపఁబడినదైయనుట. ఆత్మలోన్ = హృదయమునందు, అనేకల = ఏకలముగానివానియొక్క, సద్గుణాప్తిచేన్ = సుగుణప్రాప్తిచేత-హేతువు, ఏకల = వరాహముయొక్క, సద్గుణంబు=సుగుణము, ఎన్నదు = గణింపదు-రసికశిఖామణియఁగున పెదవేంకటాద్రిని గూడియాతనిగుణముల మరిగినది గనుక మృగముయొక్కగుణములను మెచ్చనిదాయెననుట. అనేక=పెక్కులయిన, లసత్=ప్రకాశింపుచున్న, గుణ=గుణములుగలవస్తువుయొక్క, ఆప్తిచేన్ = ప్రాప్తిచేత, ఏక=ఒకటైన - లసద్గుణంబును ఎన్నదని యర్థాంతరము. అశేషభోగ=శేషభోగములుకానివానియొక్క, లీలాకలనంబు చేతన్ = విలాసానుభవముచే-ఇదియు హేతువు. శేష = ఆదిశేషునియొక్క, భోగముల = పడగలయొక్క, కల్మి =

విలాససంపదను, తలంపదు = ఎన్నదు-పెదవేంకటాద్రిలీలలను గన్నది కాన సర్పక్రీడను మెచ్చనిదయ్యెననుట. అశేష = సమస్తములైన, భోగ=సుఖానుభవములయొక్క, లీలాకలనంబుచేతఁ = విలాసక్రియచేత, శేష=కొద్దియయిన - భోగములకల్మిని తలంపదని యర్థాంతరము. మఱి=ఇంక, కరులఁ=అష్టదిగ్గజములను, గిరులఁ = సప్తకులపర్వతములను, చెప్ప నేటికిఁ=వానినేల, కేవలభగవదంశసంభూతములైనవరాహాదిశేషులే యిట్టులైనచో నితరములఁ జెప్పనేల యని తాత్పర్యము.

తే. ఈకరణి ధాత్రి వెలసినయాకువీటి
తిమ్మరాహుత్తతనయుఁ డుత్తీర్ణ కీర్తి
పరుఁడు పెదవేంకటాద్రిభూవరుఁడు సేయు
సేవ లింపుగఁ గైకొని దైవమునకు. 40

ఈకరణిఁ = ఈవిధమున, ధాత్రిఁ = భూమియందు, వెలసిన=ఒప్పిన, ఆకువీటి=ఆకువీటిపురాధ్యక్షుఁడైన, తిమ్మరాహుత్త=తిమ్మరాజాగ్రణియొక్క, తనయుఁడు = కొమరుఁడైన, ఉత్తీర్ణ=లోకమునతిక్రమించిన, కీర్తి = యశమునందు, పరుఁడు=సక్తుఁడైన, పెదవేంకటాద్రిభూవరుఁడు=పెదవేంకటాద్రిరాజు, చేయుఁ=ఒనర్చునట్టి, సేవలు=వందనములు, ఇంపుగఁ = ఇష్టముగ, కైకొని=గ్రహించి, దైవమునకుఁ = నాయిష్టదేవతకు.

క. లోకైకస్తుత్యునకు ని
రాకృతనతజనజనుర్జరామృత్యునకున్
త్రైకాల్యసత్యునకుఁ బా
ణౌకృతగిరిరాడపత్యునకు నిత్యునకున్. 41

లోక=జనులచేత, ఏక=ముఖ్యముగ, స్తుత్యునకుఁ = స్తోత్రము చేయఁదగినవానికి, నిరాకృత=పోఁగొట్టఁబడిన-ఇది జనురాదిశబ్దమునకు విశేషణము. నతజన=అభివాదకులయొక్క, జనుర్జరామృత్యునకుఁ = పుట్టువుముదిమిచావులుగలవానికి, త్రైకాల్య = భూతభవిష్యద్వర్తమాన కాలములమూఁటను, సత్యునకుఁ = నిత్యుఁడయినవానికి, పాణౌకృత=పెండ్లాడఁబడిన, గిరిరాడపత్యునకుఁ=పార్వతిగలవానికి.

క. అధ్యాత్మ తత్త్వవిద్యా
సాధ్యునకు సమస్తయోగిజనహృత్కమలా
రాధ్యునకుఁ గాలదిగనవ
రోధ్యునకధ్యుషితతిగ్మరుచిమధ్యునకున్. 42

అధ్యాత్మతత్త్వవిద్యా=బ్రహ్మవిద్యచేత, సాధ్యునకున్ = సాధింపఁదగినవానికి- తెలియఁదగినవాని కనుట. ఇతరవిద్యలచే నెట్టివారిచేతను సాధింపఁదగినవాఁడుగాఁడని భావము. సమస్త=ఎల్లరగు, యోగిజన = తపోవంతులయొక్క, హృత్కమల=మానసాబ్జములచేత, ఆరాధ్యునకున్ = పూజింపఁదగినవానికి, కాల = కాలముచేతను, దిక్= దిక్కులచేతను, అనవరోధ్యునకున్ = అడ్డగింపఁబడఁదగనివానికి, అధ్యుషిత = ఉనికి చేయఁబడిన, తిగ్మరుచి = వేఁడివెలుంగుయొక్క, మధ్యునకున్ = నడుముగలవానికి- త్రిమూర్తులును మార్తండమండలమధ్యవర్తులగుట వేదనిష్ఠము.

క. శంకారుజాపహృత్యగ, దంకారున కచలితామృతప్రియముఖస
త్యంకారభక్తియుక్త్యక,లంకారచితార్యనుత్యలంకారునకున్. 43

శంకా=భయమనెడు, రుజా=నొప్పియొక్క, అపహృతి=పోఁగొట్టుటయందు, అగదంకారునకున్ = వెజ్జగువానికి - ఆశ్రితులకు జననాదులవలనఁ గలుగుభయమును బాపువాఁడనిభావము. అచలిత=చలింపఁబడని - అనఁగా నెడవాయనిముఖశబ్దమునకు విశేషణము. అమృత=సుధవలె, ప్రియ=ఇంపయిన, ముఖ = వాక్కులయొక్క, (ఇట లక్షణ), సత్యంకార=నిజమైన-అనఁగా నిశ్చలమైన, భక్తి=భక్తియొక్కయు, యుక్తి= కూడికచే, అకలంక = కాలుష్యములేకుండునట్లుగా, ఆరచిత = మించఁజేయఁబడిన, ఆర్య=పెద్దలయొక్క, నుతి=స్తోత్రములే, అలంకారునకున్ = తొడవుగాఁగలవానికి - కేవలభక్తితోడ సుజనులుచేయుస్తోత్రమునకు సంతసించువాఁడనిభావము.

క. ప్రార్థనపరసురసార్థహి,తార్థకృతత్రిపురదైత్యహాతికిన్ వేదాం
తార్థావనలీలాచరి, తార్థీకృతబహుమహర్షిహర్షితమతికిన్. 44

ప్రార్థన=వేఁడుకోలునందు, పర = సక్తులైన - అనఁగాఁ బ్రార్థించుచున్న, సుర సార్థ=వేల్పుగుమికి, హిత=మేలైన, అర్థ = ప్రయోజనముకొఱకు, కృత = చేయఁబడిన, త్రిపురదైత్య = త్రిపురాసురులయొక్క, హాతికిన్=చావుగలవానికి-అనఁగా దేవతలెల్లఁ బ్రార్థింపఁగా వారికొఱకుఁ ద్రిపురాసురులఁజంపెననిభావము. వేదాంత = ఉపనిషత్తుల యొక్క, అర్థ=అర్థముయొక్క, అవన = పాలనమునందుఁగల, లీలా = విలాసముచేత, చరితార్థీకృత=సార్థకములుగా నొనర్పఁబడిన, బహు = అనేకులైన, మహర్షి = గొప్ప ఋషులయొక్క, హర్షిత = సంతసమందిన, మతికిన్ = మనస్సుగలవానికి - అనఁగా వేదాంతార్థానుసరణంబుగఁ దానటించి, మహర్షులయెన్నికలను, సఫలమొందించెనని భావము.

క. దక్షమఖధ్వంసునకుం, జక్షూభవదనలకుముదసఖహంసునకున్
భిక్షాసరిరంసునకున్, వీక్షాసఫలితమనోజవిజిఘాంసునకున్. 45

దక్ష = దక్షప్రజాపతియొక్క, మఖ = జన్నమును, ధ్వంసునకున్ = చెఱిపిన వానికి, చక్షూభవత్ = నేత్రము లగుచున్న, అనల = అగ్నిదేవుఁడును, కుముదసఖ = కలువఱేఁడును, హంసునకున్ = సూర్యుఁడుగలవానికి, భిక్షా = బిచ్చమందు, సరిరంసునకున్ = క్రీడించునిచ్ఛతోఁ గూడుకొన్నవానికి - భిక్షాటనమూర్తి కనుట. వీక్షా = చూపుచేత, సఫలిత = సెల్లవేర్పఁబడిన, మనోజ = మన్మథునియొక్క, విజిఘాంసునకున్ = చంపనిచ్ఛగలవానికి - మూఁడవకంట మన్మథు నేర్చినవాని కనుట.

క. పశ్యత్ఫాలున కతిదృ, గ్దృశ్యద్రష్ట్రాదిభేదధీజాలునకున్
వశ్యావిద్యునకు శమా, వశ్యాసాద్యునకు నిత్యవైశద్యునకున్. 46

పశ్యత్=జూచుచున్న, ఫాలునకున్ = నుదురుకలవానికనుట - నుదుటఁగన్నుగల వానికనుట. అతిదృక్ = చూడనతిక్రమించినవాఁడు, దృశ్య = చూడఁదగినవాఁడు, ద్రష్ట = చూచువాఁడును, ఆది=ఇవిమొదలుగాఁగల, భేద = భిన్నమొందిన, బుద్ధి = బుద్ధులయొక్క, జాలునకున్=సమూహముగలవానికి, ధీమంతులును దమతమబుద్ధిబలంబునఁ దన్నుఁ జూడరానివాఁడనియుఁ జూడఁదగినవాఁడనియుఁ దా నొరులఁ జూచు వాఁడనియు నిట్లు భిన్నభావంబుల నిరూపణము చేయుదురని భావము. వశ్య=లోఁకువ చేసికొనఁదగిన, అవిద్యునకున్ = మాయగలవానికి - మాయ దా నందఱ మోహింపఁ జేసినను నీశ్వరుఁ డట్టిమాయకుఁ దా మోహ మడరించునని భావము. శమ=ఓర్పు చేత-ఇది దమాదుల కుపలక్షణము. అవశ్య=ముఖ్యముగ, ఆసాద్యునకున్=పొందఁదగినవానికి-శమదమాదిగుణములుగలవారికే లభ్యుండని భావము. నిత్య=నిత్యమైన, వైశద్యునకున్ = నిర్మలత్వముగలవానికి-నిష్కళంకుఁ డనుట.

క. దేవాసురనరతిర్యక్, స్థావరబహుజంతుపూర్ణసంఖ్యాతిగరా
జీవభవాండఫలావి, ర్భావాకరవపురుదుంబరక్ష్మాజునకున్. 47

దేవ = వేలుపులు, అసుర = రక్కసులు, నర=మానుసులు, తిర్యక్=పసిపులుంగులు లోనగునవి, స్థావర=నిలువరములు నెడు, బహు=పెక్కులైన, జంతు = మేతాల్పుల చేత, పూర్ణ=నిండిన, సంఖ్యాతిగ = ఎన్నికకుమీఱిన, రాజీవభవాండ=తమ్మిచూలిగ్రుడ్డు లనెడి, ఫల=మఱ్ఱిపండ్లయొక్క, ఆవిర్భావ=పుట్టుకకు, ఆకర=ఇరవయిన, వపుః = మేన నెడి, ఉదుంబరక్ష్మాజునకున్ = మఱ్ఱిమ్రానుగలవానికి - అనఁగా నసంఖ్యాతచరాచర జంతుసంఘాతసంయుత బ్రహ్మాండభాండసహస్రంబులు వటఫలంబులు వటకుటంబునం బోలెఁ దనగాత్రంబున నతిమాత్రంబుగ నుప్పతిల నొప్పువాఁడని భావము.

క. దీపితరాగశివాత, న్వీపుండ్రేక్షునకు నాకువీటిపురాంక
శ్రీ పెదవేంకటనృపధీ, రూపాంబకలక్షునకు విరూపాక్షునకున్. 48

దీపిత=ప్రజ్వలితమైన, రాగ=అనురాగముగల - అనఁగాఁ గాఢోద్రిక్తరాగులైన దనుట. శివా = పార్వతీదేవియనెడు, తన్వీ = కాంతకు, పుండ్రేక్షునకున్=మన్మథుఁడైనవానికి, (ఆకుపీటిపురము), అంక=చిహ్నముగాఁగల, శ్రీ = సంపద్విశిష్టుఁడగు, పెదవేంకటనృప = పెదవేంకటాద్రిరాజుయొక్క, ధీరూప = బుద్ధిస్వరూపమయిన, అంబక= నేత్రములకు, లక్షునకున్ = విషయమైనవానికి-అనఁగాఁ బెదవేంకటాద్రి వాలాయము నీశ్వరుని దనహృదయమున ధ్యానించుచుండునని భావము. విరూపాక్షునకున్ = ఇట్టి విరూపాక్షస్వామికి - మీఁదటికన్వయము.

వ. సభక్తిక సమర్పితంబుగా నాయొనర్పంబూనిన రాఘవపాండవీయంబు నకుఁ గథాప్రారంభం బెట్టి దనిన.

సభక్తిక=భక్తితోఁగూడుకొన్నట్టు, సమర్పితంబుగాన్ = ఒసఁగఁబడ్డదిగా, నా= నాయొక్క, ఒనర్పన్ = రచియించుటకు, పూనిన=కడంగిన, రాఘవపాండవీయంబునకున్=రాఘవపాండవీయమను గ్రంథమునకు, కథాప్రారంభము=కథారంభము, ఎట్టిదనిన్ = ఎటువంటిదనఁగా.



శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# రాఘవపాండవీయము.

## స వ్యా ఖ్యా న ము.

## ప్ర థ మా శ్వా స ము.

కథా ప్రారంభము

ఆ. వెలయు నఖిలభువనములలోనవారణ
నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నాఁ
రాజవినుతి గనిన రాజధాని. 1

రామాయణార్థము. అఖిలభువనములలోన్ = సకలజగత్తులలోపల, 'విష్టపం భువనం జగత్', అని యమరము. అవారణ = అనర్గళమైన, నగరిపు=ఇంద్రునియొక్క, రమ = సంపదకు-అవారణపదము రమకు విశేషణము. తల్లి = పోషించునది, నాన్= అనఁగా-ఉ. 'శ్రీయనగౌరినాఁబరఁగు చెల్వ' యని సోమయాజిప్రయోగము. తనర్చి = ప్రకాశించినదై-రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబలఁగా, ఇది యత్యుక్తి. ఇందుకు లక్షణము చంద్రాలోకమందు, "అత్యుక్తిరద్భుతాతథ్యశౌర్యౌదార్యాదివర్ణనమ్, త్వయి దాతరి రాజేంద్ర యాచకాః కల్పశాఖినః" అని. 'భువనములలోనవారణ' అనుదిక్కున సంధికి ఆంధ్రభాషాభూషణమందు, క. 'మానుగ విభక్తులందుం, బూనిన నురులులకు నచ్చు వోయినఁబోవు' నను లక్షణమువలన నుకారము లోపము. రమ తల్లి యనుదిక్కున, గీ. 'క్షమనకారాంతరూపప్రకాశితంబు, లైన పుంలింగములుదక్క నన్నిటికిని, బరఁగ సంబంధషష్ఠిపైఁ బ్రథమయగును, దంతికన్నులు రమపల్కు తరువుకొమ్మ.' అను లక్షణము వలన షష్ఠ్యర్థమందుఁ బ్రథమాంతరూపము. అయోధ్యనాన్ = అయోధ్య యనెడి పేరుగలదై, రాజవినుతిగనిన రాజధాని, వెలయున్ = సర్వోత్కృష్టమై వర్తించును

క. 'కృతిముఖమున దైవనమ, స్కృతి యొండె నభీష్టవస్తుకీర్తన మొండేన్, వితతా శీగపద మొండెను, బ్రతిపాదింపంగ వలయు భద్రాపేక్షన్.' అనున్యాయమున వస్తునిర్దేశరూపమంగళము. క. 'శుభసుఖరుక్షయధనకన, కభయైశ్వర్యములఁ జేయుఁ గవులకుఁ గావ్య, ప్రభులకుఁ గృతులకు మొదల, న్మభజసనయరతగణాళిమల్లియ రేచా.' అని భీమునిఛందమందుఁ జెప్పియున్నది గనుక నాదియందు నగణప్రయోగము వెలయు ననునది శుభపదము నకార మమృతబీజమును.

భారతార్థము. అఖిలభువనములోనన్, వారణనగరి = హస్తిపురము, పురమతల్లి పురశ్రేష్ఠమైనది, నాన్ = అనఁగా. ని. "మతల్లికామచర్చికాప్రకాండముద్ఘతల్లజౌ ప్రశస్తవాచకాన్యమూని" అని అ. అవారణనగరిపురమతల్లి యనుదిక్కున, క. పొసఁగం బల్కెడు నెడఁ బొ, ల్పెసఁగిన ప్రథమాంతములపయిం గదిసి కడుం, బసనారుక చటతపలను, గసడదవల్ ద్రోచివచ్చుఁ గవిజనమిత్రా.' అని యాంధ్రభాషాభూషణమందును, క. 'ప్రథమాంతవిభక్తులపైఁ, గథితము లగుకచటతపలు గసడదవ లగుం, బృథివి నవి గజడదబ లగుఁ, బ్రథమపు సున్నలుగణాంతపదమునమీఁద' నని యనంతునిఛందమందును జెప్పినలక్షణమువలన, పకారమునకు వకారము రావలసినందుకుఁ దాతంభట్టుగారు కవిలోకచింతామణియందు. క. 'భిన్నపదప్రథమలపై, నున్నపకారంబునత్వ మెందునువళిలన్, మున్నిజరూపముప్రాసము, నన్నవరూపంబు దాల్చు నాళీకాక్షా.' అని విశేషవిధులుగాఁ జెప్పిరి. శా. 'ఆవాలుం గనుదోయి యా నగు మొగం బాగుబ్బపాలిండ్లపెం, పావేణీరుచి యూతనూవిలసనం బాయొప్పులేఁ జెప్పినన్, గైవారం బగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁ గూడ నా, హా పుట్టింపదె పుష్పధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్.' అని పిల్లలమఱ్ఱి వీరన్నగారిప్రయోగమును. ఉ. 'భూనుతకీర్తిబ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడనె పుట్టునుత్తమ, జ్ఞాన' మని యివి మొదలయిన కవిత్రయమువారి ప్రయోగములును వ్రాసినందువలనఁ బ్రథమాంతము మీఁది పకారమునకు వకారాదేశము ప్రాసస్థానమందు నిత్యము గావచ్చును. యతిస్థానమందుండరాదు. ఇతరత్రయేదైనఁ జెప్పవచ్చునన్నట్టాయెను గనుక, వారణనగరిపురమతల్లి యని చెప్పవచ్చును, కాఁగానే, సూరపరాజుగా రీమీఁదటిపద్యమందును విముఖితసమదాటోపారిపంక్తిరథుఁ డని, రామాయణార్థమందుఁ జెప్పినారు. ప్రకృతము, తనర్చి=ప్రకాశించినదై, అయోధ్య=యుద్ధముచేయ శక్యము గానిది, యోద్ధుమశక్యా = అయోధ్యా యనునర్థమందు, "ఋహలోర్ణ్యత్" అని సూత్రమున ణ్యత్ప్రత్యయాంతము. నిడుపులుడుపఁ డెనుఁగగును. నాన్ = అనఁగా, రాజ=దిగ్దేశ రాజులచేతనైన, వినుతి గనిన, రాజధాని = సింహాసనస్థలమైనది, వెలయును, క్రియ.

4

క. ఆపట్టణ మేలెడిపృథివీపాలుఁడు భ్రుకుటిమాత్రవిముఖితసమదా
టోపారిపంక్తిరథుఁ డుద్దీపించు నుదారనీతి ధృతరాష్ట్రుఁడనన్. 2

భా. భ్రుకుటిమాత్ర=బొమముడిచేతనే, "మాత్రం కార్త్స్న్యేఽవధారణే" అని అ. విముఖిత=పరాఙ్ముఖములుగాఁ జేయఁబడిన, సూ. తత్కరోతీతిణ్యంతాత్కర్మణి క్త అని క్తప్రత్యయాంతము. "సువర్ణదండైకసితాతపత్రిత జ్వలత్ప్రతాపావళి కీర్తిమండలః" అని నైషధము. సమదాటోప = గర్వాతిశయముతోఁగూడిన, అరి=శత్రువుల యొక్క, పంక్తి = శ్రేణులయొక్క, రథుఁడు = రథములుగలవాఁడు, విముఖితపదము రథవిశేషణము, ఉదారనీతి = ఘనమైన నీతిగలవాఁడు, "ఉదారో దాతృమహతోః" అని అ. ధృతరాష్ట్రుఁ డుద్దీపించును.

రా. భ్రుకుటిమాత్రవిముఖితులయిన సమదాటోపారులుగలవాఁడు, పంక్తి రథుఁడు=దశరథుఁడు, "పంక్తిస్స్యాద్దశమచ్ఛందోదశసంఖ్యావళీషుచ" అని విశ్వ నిఘంటు. ఉదారనీతిచేత, ధృత = ధరింపఁబడిన, రాష్ట్రుఁడు = దేశముగలవాఁడు, అనన్= అనఁగా, ఉద్దీపించును, క్రియ.

చ. తెలివి నతిప్రగల్భుఁ డసదృగ్బలుఁ డాతఁడు భీష్మచాపకౌ
శలమె సహాయమై యమరశత్రుల నేపడఁపన్ వలంతియై
నిలుకడ నేలె విశ్వధరణిం దనమిత్రకులంబు వైభవో
జ్జ్వలతఁ దలిర్పఁ బౌరవసు సంతతి రాజుల కెల్ల హెచ్చుగన్. 3

రా. అసదృగ్బలుఁడుసరిలేనిబలముగలవాఁడు, "సదృక్షస్సదృశస్సదృ" క్కని అ. అతఁడు = దశరథుఁడు, భీష్మ=భయంకరమైన, చాపకౌశలమె=వింటియందలి నేర్పె, ధనుర్విద్యయనుట, సహాయమై, అమరశత్రులన్ = అసురులను, ఏపడఁపన్= కొంచముపఱుచుటకయి, వలంతియై = సమర్థుఁడై, తనయొక్క, మిత్రకులంబు=సూర్య కులము, "ద్యుమణిస్తరణిర్మిత్ర" అని అ. వైభవములయొక్క, ఉజ్జ్వలతన్=ఆధిక్యము చేత, తల్ప్రత్యయాంతము, తలిర్పన్ = ప్రకాశించునట్లుగా, పౌర=పట్టణమువారి యొక్క, వసు = ధనములయొక్క, "వసురత్నే ధనేఽపిచ" అని అ. సంతతి=సమూహము, రాజులకెల్ల, హెచ్చుగన్ = అరుదగునట్లుగా, విశ్వధరణిన్=సమస్తభూమిని, "విశ్వం కృత్స్నమశేష" మని అ. నిలుకడన్, వంశపారంపర్యముగా, ఏలెను, రాజుల యొక్కసంపద యను క్తసిద్ధము.ఇది కావ్యార్థాపత్త్యలంకారము, "కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే" అని.

భా. తెలివిన్ = బుద్ధిచేత, అతిప్రగల్భుఁడు, అసదృగ్బలుఁడు, దృష్టిబలసహితుఁడుకానివాఁడు, ధృతరాష్ట్రుఁడు, భీష్మునియొక్కచాపకౌశలమేసహాయమై యమ

ర్చఁగా శత్రులను, ఏపడఁపక = మట్టుపెట్టుటకు, వలంతియై, మిత్రకులంబు=బంధువుల యొక్కకులము, తలిర్ప, పౌరవ=పూరునిసంబంధమైన, సుసంతతి = సత్కులమందుఁ గల, సంతతిర్గోత్రజననకులాని" అని అ. రాజులకెల్లన్ = యయాతి భరతుఁడు మొదలయినరాజులకందరికిని, హెచ్చుగ, ఏలెను, క్రియ.

క. సుబలతనయగుణమహిమన్, బ్రబలి తనకుదారధర్మపాలనలీలన్
సొబగొంది వన్నెదేఁగా,విబుధస్తుతుఁ డవ్విభుండువెలసెన్ ధరణిన్.

భా. సుబలతనయ=గాంధారి, గుణ = సౌశీల్యాదిగుణములయొక్క, మహిమన్= మహిమచేత, క. 'వినుతద్వితీయసప్తమి, కిని మఱియుఁ దవవిభక్తికిని నిడఁగానౌ, విన నింపుపుట్టుపట్టున, ననువెఱిఁగి ప్రబంధములఁబయోంబుధిశయనా.' అని కవిలోకచింతామణియందు, ప్రబలి తనకు, దారధర్మ =స్మృత్యుక్తమైనభార్యాధర్మముయొక్క, పతివ్రతాచారముయొక్క యనుట, "అర్తార్తే ముదితే హృష్టా ప్రోషితే మలినాకృశా, మృతే మ్రియేత యా నారీ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా" అనిస్మృతి. "ధర్మః పుణ్యేయమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ" అని అ. పాలనలీలచేత, "ప్రదిత్సతస్స్వం పితురం ధమాత్మనో నిశమ్య భర్తారమగూఢసమ్మదా, అరుంధతీకీర్తిమసౌ నిరుంధతీ బబంధ పట్టేన దృశౌ ప్రతివ్రతా" అని బాలభారతమందును జెప్పియున్నది గనుక, సొబగొంది=ఒప్పినదై, వన్నెదేఁగా "అనుకూలాం విమలాంగీం కుశలాం కులజాం సుశీలసంపన్నామ్,పఞ్చలకారాంభార్యాం పురుషః పుణ్యాధికోలభతే" అని చెప్పుదురు. విబుధస్తుతుఁడు = పెద్దలచేత స్తోత్రముచేయఁబడినవాఁడు, "విబుధః పండితే దేవే" అని వి. అవ్విభుండు= ఆధృతరాష్ట్రుఁడు, వెలసెను.

రా. సుబలత=బలిమి, బహువ్రీహిమీఁదితల్ప్రత్యయాంతము, నయగుణమహిమ చేతఁ బ్రబలి యుదారధర్మపాలనలీలచేత, సొబగొంది తనకు వన్నెదేఁగా, ఈయర్థమున సుబలతయనునది కర్తృపదము. విబుధ=దేవతలచేత, స్తుతుఁడు, అవ్విభుండు=దశరథుండు, వెలసెను, అర్థాంతరము. సుబలతన్ =బలిమిచేతను, అయగుణ=భాగ్యలక్షణములయొక్క, "అయశ్శుభావహోవిధిః, అని అ. "గుణః ప్రధానేశబ్దాదౌ మౌర్వ్యాం సూదేవృకోదరే" అని వి. మహిమచేతఁబ్రబలి, ఉదారధర్మపాలన=దుష్టనిగ్రహ శిష్టానుగ్రహాది ధర్మములయొక్కసంరక్షణము, న్యాసశ్రంథోయుచ్ఛని యు చ్ప్రత్యయాంతము గనుకఁ బాలనాశబ్దముస్త్రీలింగము. ఉ. 'పాండవసైన్యసంఘపరిపాలన సేయు, నితండయంచుఁ గృష్ణుం డభిషేకసంపదు[illegible]యఁగ' ననిసోమయాజియుఁ స్త్రీలింగముగాఁ బ్రయోగించినాఁడు. ఇ[illegible]ప్రత్యయాంతములైనపుడు నపుంసకలింగములు నవును గనుక [illegible]లింగములును గలవని ముందును దెలిసికొనునది, వన్నెదేఁగా, ఈయర్థమున ధర[illegible]కర్తృపదము, వెలసెను



క. అని నీడు లేనికడిమిం, దనరారు నతిప్రతాపితదనుజుం డతం డు
ర్విని గలన్నృపతుల నందఱుం, దన కరిగాంపులుగం జేసె దర్పస్ఫురణన్.

రా. అనిన్=యుద్ధమందు, కడిమిన్ = శౌర్యముచేత, తనరారునట్టి, అతిప్రతాపితదనుజుండు=మిక్కిలితపింపఁజేయఁబడినదనుజులుగలవాఁడుఁ "సకిలసంయుగమూర్ధ్ని సహాయతాం మఘవతః ప్రతిపద్య మహారథః, స్వభుజవీర్యమవాప యదుచ్ఛ్రితం సురవధూరవధూతభయాశరైః" అని కాళిదాసుచెప్పినాఁడు గనుక, అతఁడు = దశరథుఁడు, నృపతులనందఱు నరిగాంపులుగఁజేసెను.

భా. అతిప్రతాపి = అధికప్రతాపముగల, తదనుజుఁడు=అధృతరాష్ట్రునితమ్ముఁడైనపాండురాజు, కర్మధారయము, తనరారును, అతఁడు=ఆపాండురాజు, నృపతుల నరిగాంపులుగఁ జేసె నని యన్వయము.

క. తానన్నమాట యింద్రున, కైన నలంఘ్యమయి పేర్చు నట్లుగ నెంతేఁ
బూనిక చెల్లింపుచు జగ,తీనుతవిక్రముఁ డొనర్చె దిగ్విజయంబున్.

భా. తాను, అన్నమాట = జ్యేష్ఠుఁడైన ధృతరాష్ట్రునివాక్యము, కడమయే కార్థము సులభము.

రా. తానన్నమాట=తానాడినమాట.

సీ. ధృతిఁ గుంతిమద్రభూపతుల నెయ్యపుఁగన్య
కలననవాలుఁదూపుల జయించె
యలరారునతనుజయశ్రీల వరియించి
యవనసౌరాష్ట్రభూధవుల గెలిచె
ద్రవిడకళింగసాల్వవిదర్భవసుధాధి
పతుల నోడించి కప్పములు గొనియెఁ
జోళనేపాళపాంచాలకేరళమత్స్య
వత్సభూపతులగర్వం బడంచె
తే. శకయుగంధరఘూర్జరాశ్మంతసింధు
లాటభూపాలముఖ్యుల నోటుపఱిచె
జగతిఁగోసల కేకయమగధులతన
యలవరించినయాజ్ఞలో మెలఁగఁజేసె. 7

రా. ధృతిన్ = ధైర్యముచేత, కుంతిమద్రదేశాధీశ్వరులను, నెయ్యపుఁగన్యకలనన = ఇంపైనక్రొత్త జగడమునఁజేయనుట, ఈదిక్కునఁగొందఱు కావ్యాలంకారచూడామణియందు, గీ. "విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు, లొనరఁజూపిరి ప్రాకృ

తంబునకుఁద్రోవ, నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమై కాన, వలయుఁ దల్లక్షణం బులు వరుసఁదెలియ. క. నదలకసిద్ధాక్షరములు, పాదివినవర్ణములు దూలిపోఁబలు కఁగన,ర్థదమై ప్రాకృతనిభమగు, నదితద్భవపదమునాఁగ నభిమతమయ్యో' నని చెప్పినలక్షణమువలన, కన్యకాశబ్దముప్రాకృతమున, 'మనయామ్=అధోవర్తమానానాం మకారనకారయకారాణాం లోపస్స్యా'త్తని కియ్యవడికి లోపమువచ్చి, 'శేషాదేశస్యార్హో చోఘోః=అవశిష్టస్యాచః పరస్యసంయుక్తాదేశస్యాహారస్యహాలోద్విత్వంభవతి' అని నకారద్విత్వమునువచ్చి యంత్యకకారములుప్తమై యుపర్యకారమునకు యకారశ్రవణము రాఁగా, కన్నయా అనియుండును. ప్రాకృతాపభ్రంశరూపమై తద్భవ మయ్యెనేనిఁ, దెనుగునఁ గన్నియ యనవలెను. కన్యాశబ్దమే తద్భవమయ్యె నేనిఁ గన్నెయని యుండును గనుక బహువచనమందుఁ గన్నియలు కన్నెలనవలెఁగాక భారతార్థమందుఁ గన్నెకలనని కన్యకాశబ్దముమీఁద నంత్యకకారము యకారముగాకయే మధ్యైత్వము వచ్చి తెనుఁగై యుండదు. ఎట్లువిచారించినను, రెండర్థములకు సరిపోదని సందేహింతురు, గ్రంథకర్త కన్నెలకలననయని యేత్వము నిలువఁజెప్పలేదు. అది లేఖకదోషము. తే. 'పుడమి స్త్రీలింగశబ్దంబు కడకకార,మునకు వచ్చుయకారంబు గనఁగఁగొన్ని, యెడల నెత్వంబునగుఁగియ్యవడియుంనగును, జడ్డయగుచోటనైశాటచక్రశమన. తే. 'వధునికకుఁ జెల్లు వదినియ వదినెయనఁగ, వర్ణికకుఁజెల్లు వన్నియవన్నెవన్య, యనఁగ నీరీతి మౌక్తికంబునకుఁజెల్లు, ముత్తియము దొడ్డముత్తెము ముత్య మనఁగ.' ముక్తయే మౌక్తికము. అని. కవిలోకచింతామణియందుఁ జెప్పినలక్షణమువలనఁ గన్యకాశబ్దముమీఁద దెనుఁగునఁ గన్యయనికియ్యవడియుండనేచెప్పినారు కాఁగా భారతార్థమందు గన్యకలనని చెప్పవచ్చును. తత్సమపదము, ప్రకృతము, వాలుఁదూపులన్ = తీక్ష్ణబాణములచేత, జయించి, అతను = విస్తారములయిన, జయశ్రీలను వరియించెను. కోసలకేకయమగధులయొక్క, తనయలన్=కౌసల్యాకైకేయీసుమిత్రలను, వరించి నయాజ్ఞలో మెలఁగఁ జేసెను. తనయలవరించి, కోసలకేకయమగధులను నయాజ్ఞలో మెలఁగఁ జేసెననియుఁ జెప్పవచ్చును.

భా. ధృతిన్ = సంతోషముచేత, "ధృతిర్యోగాంతరే ధైర్యే ధారణాధ్వరతుష్టిషు" అని వి. కుంతిమద్రభూపతులయొక్క, చెయ్యెఁపుఁగన్యకలన్ = కుంతీమాద్రులను, ననవాలుఁదూపులన్=పుష్పబాణములచేత, జయించి, అలరారు=ఒప్పుచున్న, అతను=మన్మథునికి, జయశ్రీలన్ = జయశ్రీలైనవారిని - కన్యకలకు విశేషణము. వరియించెన్=వివాహమాయెను - కడమసమానార్థము. కోసలకేకయమగధులన్ = ఈదేశములరాజులను, 'తద్రాజస్యబహుషు తేనైవాస్త్రియాః' మని అఙ్ప్రత్యయలోపము. తనయొక్క, అలవరించిన=నియమించిన, క. 'అచ్చుగఁ బెరయచ్చులపై, యచ్చు యకారంబుదాల్చు

నబలాయీ వే, యిచ్చయపూర్వము నావిని, యచ్చెరువై యుండెనా నుదాహరణంబు లని యాంధ్రభాషాభూషణము. ఆజ్ఞలో మెలఁగఁజేసెను.

సీ. కొందఱు తనవార్త కొనసోఁకినంతన,
కొందఱు వృత్తాంత గురుతకతనఁ
గొందఱు భేరినిర్ఘోషంబు లాలించి,
కొందఱు బలరజోబృంద మరసి
కొందఱు నాసీరకోలాహలంబునఁ,
గొందఱు మణికేతుకోటివీక్షఁ
గొందఱు కోదండగుణటంకృతులు విని,
కొందఱు హుంక్రియాకులతఁ జెంది
తే. కొంద ఱొకటిరెండేటులకొలఁది గలిగి
వివిధదిగ్దేశనృపతులు విరిగి పాఱ
నవనియందును యుద్ధవిహారమునకు
మాఱులేకయ విహరించె మనుజవిభుఁడు. 8

భా. రా. రెంటికిని సమానము, భేరినిర్ఘోష మనెడుచిక్కునఁ దెనుఁగుషష్ఠి.

మ. తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు తదుద్యజ్జైత్రయాత్రాసము
త్కలికారింఖదసంఖ్యసంఖ్యజయవత్కంఖాణరింఖావిశృం
ఖలసంఘాతధరాపరాగపటలాక్రాంతంబు మిన్నె యన
ర్గళ భేరీరవనిర్దళద్గగనరేఖాలేపపంకాకృతిన్. 9

రా. భా. రెండర్థములకుసమానము. తత్ = ఆరాజుయొక్క, ఉద్యత్ = ప్రకాశించుచున్న-జైత్రయాత్రయందు, సముత్కలికా = అధికోత్కంఠచేత, "ఉత్కంఠోత్కలికేసమే" అని అ. రింఖత్ = సంచరించుచున్నవై - అసంఖ్యములైన, సంఖ్య = యుద్ధములయందు, "మృధమాస్కందనం సంఖ్య" మని అ. జయవత్ = జయములుగలవియునైన, కంఖాణ=అశ్వవిశేషములయొక్క, రింఖా=గోరిసెలచేత-విశృంఖల మానట్టుగా, సంఘాత = త్రొక్కఁబడిన, ధరా = భూమియందుఁగల, పరాగ=ధూళియొక్క-పటలముచేత, ఆక్రాంతంబు=ఆక్రమింపఁబడినదైన, మిన్నెఱు = ఆకాశగంగ-కర్తృపదము. అనర్గళములైన భేరీరవములచేత, నిర్దళత్=పగులుచున్న, గగన = ఆకాశముయొక్క, రేఖా = బీఁటికలకు - ఆలేపార్థమైన, పంక=బురదయొక్క, ఆకృతిన్ =సామ్యముచేత, తలఁపన్ = ఊహించుటకు, చొప్పడి=యుక్తమై-ఒప్పెను. "సంబంధాలిశ

యోక్తిస్స్యా దయోగే యోగకల్పనమ్, సౌధాగ్రాణి పురస్యాస్య స్పృశంతి విధుమండల''మని సంబంధాతిశయోక్త్యలంకారము.

చ. తురగఖురాహతిక్షితిజధూళిచయస్థగితాంబరంబుతో
నొరయుచుఁ దచ్ఛమూగజసముత్కర మప్పుడు చూడ నొప్పె ది
క్కరివరయూథమత్సరవిగాఢతఁజేసి సమస్తమైనయి
ద్ధర దనపైకి నెత్తుకొని తాల్చెడినో యనుచుండఁ జూపఱుల్. 10

భా. రా. రెంటికి సమము. సులభము.

మ. జవవద్ఘోటకపాటితక్షితిరజస్సంక్రాంతిచే నింకుసిం
ధువులం గ్రమ్మఱ నుర్వికిన్ దివికిఁ దోడ్తో నించెఁ దన్నాగముల్
నవనిర్యన్మదనిర్ఝరౌఘమున శుండాశీకరోర్ధ్వప్రవ
ర్షవిధిం దానను జేసి సింధురములన్ ప్రఖ్యాతి గాంచెం గరుల్. 11

రా. భా. రెంటికిసమము. ఇంకు = ఇంకెడు, సింధువులన్ = సముద్రములను-ఆకాశగంగను, ''దేశే నదవిశేషేబ్ధౌ సింధుర్నాసరితి స్త్రియామ్'' అని అ. సేనాధూళి సర్వత్ర వ్యాపించి యాకాశగంగను సముద్రములను నింకించె నని యతిశయోక్తి. తన్నాగముల్ = ఆసేనాగజములు, నవనిర్యన్మదనిర్ఝరౌఘములచేతను, ''ప్రవాహోనిర్ఝరో ఝరః' అని అ. ''ఓఘో బృందేంభసాం రయే'' అని అ. శుండా = తొండముల యొక్క, ''శుండాతుబలహస్తిన్యాం మదిరాకరిహస్తయోః'' అని వి. శీకర = జలకణములయొక్క, ఊర్ధ్వప్రవర్షవిధిన్ = పొడవుగాఁ జల్లుటచేతను, ఉర్వికిన్=భూమికిని, దివికిన్=ఆకాశమునకును-క్రమాలంకారము. క. 'ద్యోశబ్దమునకు దివియును, భూశబ్దంబునకు భువియుఁ బూనఁగవలయున్, నౌశబ్దము నావయరో, రైశబ్దము రాజపదము రాజనఁజెల్లు' నని తాతంభట్టు. క్రమ్మఱన్ = తిరుగ-నించెను. క. 'స్థావరతిర్యక్ప్రకృతుల, కేవెరవునఁ గ్రియలుదలఁప నేకవచనముల్, దేవమనుష్యాదిక్రియ, భావింపఁగ నేకవచన బహువచనంబౌ' నని కేతన. దానను జేసి = అటుకనుక నే, సింధురములు. 'సింధూన్ రాంతి దదతీతి సింధురాః' రాదానే యను ధాతువు. ఈయర్థముగలసింధురములనెడిప్రఖ్యాతిని గరులు గాంచెను - నిరుక్త్యలంకారము. ''నిరుక్తి ర్యోగతో నామ్నామన్యార్థత్వప్రకల్పనమ్, ఈదృశైశ్చరిత్రైర్జానే సత్యం దోషాకరో భవాన్'' అని చ.

సీ. గంభీరవేదిలక్షణలక్షితంబులై,
తనరారుభద్రదంతావళములు
నారట్టసింధుగాంధారాదిభవములై,
కొఱలు శ్రీవృక్షకీఘోటకములు

పదునాల్గుజాతులం ద్రిదశకాంతల మీఱు,
పద్మినీజాతిసౌభాగ్యవతులు
కడు నద్భుతములైన కనకరత్నాంశుక,
చందనాదిసువస్తుసంపదలును
తే. నఖిలదిగ్దేశభూపసమర్పితంబు
లగుచు నరణంబుగతిఁ దోన యరుగుదేఱఁ
దనువరించు జయశ్రీలఁ గొనుచు నతఁడు
పురికిఁ జనుసొంపువాగగోచరతఁ బరఁగె 12

భా. రా. రెండర్థములకు సమము. గంభీరవేదులనెడుగజవిశేషములయొక్క లక్షణములచేత, లక్షితంబులై, కనుపట్టినవై. "త్వగ్భేదాచ్ఛోణితస్రావాన్మాంసస్య దళనాదపి, ఆత్మానం యోవజానాతి తస్య గంభీరవేదితా" యను మృగచర్మీయమందును, "చిరకాలేన యోవేత్తి శిక్షాం పరిచితామపి, గంభీరవేదిర్విజ్ఞేయస్సగజో గజవేదిభిః" అని రాజపుత్రీయమునందునుఁ జెప్పఁబడి యున్నది. తనరారు=ఒప్పుచున్న, భద్రదంతావళములు = పట్టపుటేనుఁగులును, ఆరట్టసింధుగాంధారాదిభవములై కొఱలు = చెలఁగుచున్న, ఈదేశములయశ్వము లుత్తమములు గనుక, శ్రీవృక్షకీఘోటకములు, "వక్షోభవావర్తచతుష్టయంచ కంఠేభవేద్యస్య చరోచమానః, శ్రీవృక్షకీనామహయస్స భర్తుః పుత్రప్రపౌత్రాభివివృద్ధయే స్యా" త్తని హయలీలావతి. "శ్రీవృక్షకీ వక్షసి చేద్రోమావర్తో ముఖేపి చ" అని వైజయంతీనిఘంటువు. పదునాల్గుజాతులక్ = బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాహణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకర, తిలఘాత, లుబ్ధక, చండాల, మాతంగు లనెడు పదునెనిమిది జాతులందు, బ్రాహ్మణజాతియు నరబాహ్యులయిన లుబ్ధకచండాలమాతంగజాతులును వినా కడమ పదునాలుగుజాతులయందును, త్రిదివకాంతలమీఱుచున్న పద్మినీజాతి సౌభాగ్యవతులును. పద్మినీజాతిలక్షణము రతిరహస్యమందు, "కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవగంధీ సురతపయపి యస్యాస్సౌరభం దివ్యమంగే, చకితమృగదృగాభే ప్రాంతరక్తేచ నేత్రే స్తనయుగళమనర్ఘ్యశ్రీఫలశ్రీవిడంబి, తిలకుసుమ సమానాం బిభ్రతీ నాసికాం చ ద్విజగురుసురపూజాశ్రద్దధానా సదైవ,కువలయదళకాంతిః కాపి చాంపేయకాంతిర్వికచకమలకోశాకారకామాతపత్రా, వ్రజతి మృదుసలీలం రాజహంసీవ తన్వీ త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషా, మృదుశుచి లఘు భుఙ్క్తే మానినీ గాఢలజ్జా ధవళకుసుమవాసో వల్లభా పద్మినీస్స్యా" త్తని చెప్పియున్నది. చందనాదిసువస్తుసంపదలును, అరణంబుగతిక్=హరణమునిచ్చినట్లు, తోన = వెంటనే-కడమ సులభము.

క. తనపాండుసమాఖ్య జగం
బున వెలయఁగ నిట్లు సకలభూనాథుల నా
త్మనిదేశవర్తనులుగా
నొనరించె నితాంతవైభవోజ్జ్వలుఁ డగుచున్. 13

రా. ఈపద్యమునకుఁ గర్తృపదము నరనాథుఁడని ముందరిపద్యములో నున్నది, పాండు = శుభ్రమైన, "హరిణః పాండురః పాండుః" అని అ. సమాఖ్య = కీర్తి "యశఃకీర్తిస్సమాఖ్యాచ" అని అ. కడమ సులభము.

భా. తనయొక్క పాండుసమాఖ్య = పాండురాజను పేరు, "ఆఖ్యాహ్వే అభిధానంచ" అని అ. కడమ సులభము. సం. ఉపసర్గము.

వ. ఇట్లు యథేష్టభోగంబులఁ బ్రవర్తిల్లుచు నొకనాఁడు తనమనంబున. 14

చ. శ్రమ ముడుగుం దనూజడిమ జాఱుఁ జలాచలలక్ష్యభేదన
క్రమము లెఱుంగవచ్చు మదిఁ గానఁబడుం బరజాతిభీతికో
పములవిచేష్టితంబు లివి భావమునం దలపోయ నన్నిచం
దములఁ బ్రియంబె యంచు నరనాథుఁడు వేఁటకు నుద్యతాత్ముఁ డై.

రెంటికి నేకార్థము - వేఁట ప్రశస్తమని, "పరిచయం చలలక్ష్యనిపాతనే భయరుషోశ్చతదింగితబోధనం, శ్రమజయాత్ప్రగుణాంచకరోత్యసౌ తనుమతోనుమతస్సచివైర్యయా" అని కాళిదాసువలెనే చెప్పినాఁడు. నైషధమందును - "మృగయాఘాయ న భూభృతాం ఘ్నతామ్" అని చెప్పియున్నది గనుక అన్నిచందములఁ బ్రియంబె యంచు చెప్పెను. నరనాథుఁ డనెడి దిక్కున డాపలియున్నను నకారము యతిగాఁ జెల్లినందుకు లక్షణము కవిలోకచింతామణియందు, తే. 'టపతవర్గాక్షరములకు డాపలించి, యొనర నూఁదిన బిందువు లుండెనేని, వరుసణనమలువళు లగువానికెల్ల, నవనిఁ గొందఱు సుకవులయనుమతమున. చ. కినుకఁ జళుక్యవంశనృపకేసరిప్రేసినచోఁ గృపాణఖం, డనమునఁ గల్గుఁబో సురగణత్వము తత్పదపారిజాతవం, దనమునఁ గల్గుఁబో మనుజనాథతతద్భటదర్శనావలం, బనమునఁ గల్గుఁబో గహనమధ్య నివాసము శత్రుకోటికిన్.' అని కావ్యాలంకారచూడామణి.

క. అతివినయాన్వితకుంతియు
ధృతిమహిమాద్రియును నగుచు నతిప్రీతితరం
గితమతులై తనుఁగొలువఁగఁ
జతురమృగయుఁ లేగుదేరఁ జనియె వనికిన్. 16

భా. అతివినయాన్విత = అత్యంతవినయముతోఁ గూడిన, కుంతియు, ధృతి = ధైర్యమునకు, మహి = స్థానమైన - మాద్రియును, క, 'వనితా యనుచో వనితయు, జననీ యని పలుకుచోట జననియును వధూ, యనుచో వధువును దెనుఁగునఁ, జనుసా యీాయూాలు దుదలఁ జనుపలుకులకు' నని కుంతియుఁ మాద్రియుఁ నన్నందుకుఁ గావ్యాలంకారచూడామణియందు లక్షణము. నగుచుఀ = నవ్వుచును, అతిప్రీతి = అత్యంత సంతోషరసము చేత, తరంగిత=పరంపరలుగలదైన, తదస్య సంజాతం తారకాదిభ్యఇతచ్చని యితచ్ప్రత్యయాంతము. మతులై = బుద్ధిగలవారై, తనుఁగొలువఁగ, చతుర = సమర్థులైన, మృగయులు=వేఁటకాండ్రును, "మృగయుర్లుబ్ధ కశ్చ స" అని అ. ఏగుదేరఁగా, వనికిఀ = వనమునకు, చనియెను.

రా. అతివినయాన్వితులైన, కుంతియుఀ = ఈటెలుగలవారు గలవాఁడు "ప్రాసస్తుకుంత" అని అ. "కుంతా ఏషాంసంతీతి కుంతినః" అనెడు మతుబంతశబ్దముమీఁద బహువ్రీహి. ఈదిక్కునఁగ ప్రత్యయరహితముగాఁ జెప్పినందుకు భారవిప్రయోగము. "పృథుకదంబకదంబకరాజితం ప్రథితమాలతమాలవనాకులం, లఘుతుషారతుషారజలచ్యుతం ధృతిసదానసదాననదంతినమ్" అని ధృతిమహిమకు. అద్రియుఀ=పర్వతమైనవాఁడు. అర్థాంతరము. ధృతిమఀ = ధైర్యలక్ష్మిచేత, హిమాద్రియుఀ = హిమవత్పర్వతమువంటివాఁడును అగుచు, కొలువఁగఀ = కొలిచెడునిమిత్తమై, మృగయుఁలు, ఏగుదేరఀ = రాఁగా, చనియెను.

వ. ఇట్లు సని చని వివిధమృగంబుల వేఁటాడుచుం దిరిగితిరిగి. 17

భా. రా. రెంటికి సరి సులభము.

క. నెలకొనియె వేఁటతమిన,బ్బలియుఁడు శిశిరనగరుచిరపరిసరమహిమఀ
గలతమసతీరసికతా, విలసనములు డెందమునకు విందొనరింపన్. 18

రా. అబ్బలియుఁడు = దశరథుఁడు, శిశిరనగ=శీతలవృక్షములచేత, "శైలవృక్షౌ నగావగౌ" అని అ, రుచిర = మనోహరములయిన, పరిసర = ప్రాంతభూములయొక్క, "పర్యంతభూః పరిసరః" అని అ. మహిమంగల = మహిమనుగలిగినట్టి, అరసున్నయున్నచో నెఱసున్న వచ్చినందుకు లక్షణము. క. 'కుఱుచలతుదహల్లులకుం, బిరుద న్నెలకొన్నయట్టిబిందువు లెల్లన్, నెఱయఁగ నూదుచుఁదేలుచు, నొఱపై యిరుఁదెఱఁగు నెల్లుచుండుం గృతులన్.' అని యాంధ్రభాషాభూషణము. తమస=తమసానదియొక్క, తెనుఁగుషష్ఠి, = తీర=గట్టులయందుఁగల, సికతా=ఇసుకదిబ్బలయొక్క, "సికతావాలుకాయాం చ సైకతేష్వామయాంతరే" అని వి. విలసనములు = ఒప్పిదములు, ల్యాదంతము, డెందమునకుఀ = మనస్సునకు - దేశీయపదము, విందొనరింపఀ = వేఁటతమియందు, నెలకొనియెఀ=స్థిరుఁడయ్యెను,

భా. అబ్బలియందు=పాండురాజు, శిశిరనగ = హిమవత్పర్వతముయొక్క-రుచిరమైనపరిసరమహియందు, మంగలతమ = అత్యంతశుభములయిన, సతీ = కుంతీమాద్రులయొక్క, రసికతావిలసనములు = రసికత్వవిలాసములు - మంగళతమశబ్దము రసికశబ్దమునకు విశేషణము. డెందమునకు విందొనరింపఁగా వేఁటతమిచేత మహియందు నెలకొనియె నని యన్వయము.

ఉ. హారిమృగవ్యనవ్యవిహితాదరుఁ డాధరణీతలేశుఁ డ
ధ్వారచితశ్రమాకలితుఁ డై కడు మెచ్చె సురాపగాజలా
సారసమాగమార్హతమసారససారససారసౌరభో
దీరణకారణంబు నతిధీరసమీరకిశోరవారమున్. 19

భా. హారి = ఒప్పుచున్న, మృగవ్య = వేఁటయందు, "ఆచ్ఛోదనం మృగవ్యం స్యాదాఖేటో మృగయా స్త్రియా" మ్మని అ. నవ్య = నూతనముగా, విహిత=చేయఁబడిన-ఆదరముగలవాఁడు, ఆధరణీతలేశుఁడు=పాండురాజు, అధ్వ = మార్గమందు, ఆరచిత = చేయఁబడిన-వేఁటచేతఁ జేయఁబడినదనుట. శ్రమ = బడలికచేత, ఆకలితుఁడై = అలసినవాఁడై, సురాపగాజలాసార = గంగాజలప్రవాహములయందు, "ధారాసంపాత ఆసారః" అని అ. సమాగమ = పరస్పరసాంగత్యమునకు, అర్హతమ = మిక్కిలిఁదగిన, సారస = బెగ్గురులుగల, సారస = తామరలయొక్క - సమాగమార్హతమసారసపదము పద్మములకు విశేషణము. సార = ఉత్కృష్టములయిన సౌరభ = వాసనలయొక్క, ఉదీరణ = విస్తరించుటకు, కారణంబు = హేతువైన - అతిధీరములయిన, సమీరకిశోర= మందమారుతములయొక్క, వారమున్ = సమూహమును, కడున్, మెచ్చెను. క్రియ.

రా. హారి = హారములుగలవాఁడు, మృగవ్యనవ్యవిహితాదరుఁడు, ఆధరణీతలేశుఁడు = దశరథుఁడు, సురాపగాజలాసార=గంగాప్రవాహమునకు, సమ=సమమును, ఆగమ = శ్రుతిస్మృతులవల్ల, అర్హ = శ్రేష్ఠమయినది, ఆగమార్హ = యాత్రాయోగ్యమయినది యనియుఁ జెప్పవచ్చును. తమసారస = తమసానదీజలమందుఁగల, కడమ సమము. ఉదకమువల్ల శైత్యము పద్మములవల్ల సౌరభము కిశోరపదమువల్ల మాంద్యమును జెప్పుట.

సీ. పుడమిఱేఁ డీరీతిఁ గడఁగి డెందము మృగ
వ్యాపారఖేలన మభిలషింపఁ
గానలోఁ దారుమృగంబులకై వడిఁ
గైకొని యసమాస్త్రకర్మ వలనఁ
దనరుచొక్కపురాణమునిదంపతులు దమ
కంబులు ధేర నెయ్యంబు మీఱ

ననిచిన తత్ప్రియతనయుండవారిత,
కారుణ్యుఁ డై పూని కలశమంబు
తే. మగ్నముగఁ జేయుచప్పుడు భుగ్నహృదయుఁ
డగుచు వినిశితశరవిశేషాభిహతిని
ద్రెళ్లనేసె నాఘునులసద్దృష్టినియతి
బ్రుంగఁ గేవలసారంగబుద్ధిఁజేసి. 20

రా. పుడమి = భూమికి, ఱేఁడు = రాజైనదశరథుఁడు, ఇటువంటివి తద్భవపదములు. సీ. 'యోధులు జోదులు యోగంబు జోగంబు భేదంబు బిందంబు పృథివి పుడమి' యని కావ్యాలంకారచూడామణియం దుదహరించినవి గనుక ముందరను దెలిసికొనునది. ఈరీతిన్ = ఈపూర్వోక్తప్రకారముగ, కడఁగి=ఉద్యోగించి, డెందము= మనస్సు, సీ. 'వెన్నన్ను విన్నవావిరివంతవాగంబు డెందంబు దెప్పాడి దెల్లపాటు' ఇటువంటివెల్లను దేశ్యపదములని యాగ్రంథమందె చెప్పినాఁడు. మృగవ్య = వేఁటయందుఁగల, అపారఖేలనము = అధికవిహారమును, కం 'జంగమపదములు దక్క థ, రం గలపదముల ద్వితీయప్రథమయు నగురా, జంగదము లూడ్చె సతి నూ, త్నాంగదములు దాల్చె నా నుదాహరణంబు' లను నాంధ్రభాషాభూషణమందలిలక్షణమువల్లఁ బ్రథమకు ద్వితీయార్థము. కానలోన్ = అడవియందు, తారు=సంచరించెడి, మృగంబులకై = మృగములకొఱకు, వడిఁగైకొని, అసమ = సరిలేని, అస్త్రకర్మకలనన్ = బాణప్రయోగగతిచేత, తనరుచున్ = ఒప్పుచున్నవాఁడై, చప్పుడు విని యని ముందరికన్వయము. ఒక్కపురాణమునిదంపతులు = ఒక్కవృద్ధమునిస్త్రీపురుషులు. "పురాణప్రతనప్రత్నపురాతనచిరంతనాః" అని అ. "జాయాయాదంభావజంభావౌ వా నిపాత్యేతే పత్యౌ" అనువార్తికమువల్ల జాయాశబ్దమునకు దం జం అనునాదేశము, "దంపతి జంపతీ జాయాపతీ" యని అ. అంబులుదేరన్ = నీళ్ళుదెచ్చెదునిమిత్తమై, క. 'గురువులు గురులనఁగొల్తురు, గురువులచేగురులకొఱకు గురువులవలనన్, గురులకు భక్తిదనర్చును, గురువులయందుండుసకలగుణములు నెపుడున్.' అని కావ్యాలంకారచూడామణియం దుదహరించినవి గనుక, అంబువులు + అంబు లని రెండువిధములఁ జెప్పవచ్చును. నెయ్యంబుమీఱ, అనిచిన=అంపిన, తత్ప్రియతనయుండు = ఆమునిపుత్త్రుఁడు, అవారితకారుణ్యుఁడై పూనికలశము, అంబుమగ్నముగఁ జేయుచప్పుడు = నీళ్లుముంచెడుధ్వనిని, భుగ్నహృదయుఁ డగుచున్=సరళముగాని మనస్సుగలవాఁడై, "ఆవిద్ధంకుటిలంభుగ్నం వేల్లితం వక్రమిత్యపి" అని అ. విని, శిత = వాఁడియైన, శరవిశేష = శబ్దఘాతి యనెడు బాణవిశేషముయొక్క, అభిహతిన్ = వ్రేటుచేత, లసద్దృష్టి = మంచివివేకము. దృష్టిర్జ్ఞానేఽక్షిదర్శనే" అని అ. నియతిన్ = విధిచేత, "భాగ్యం స్త్రీనియతిర్విధిః" అని అ.

ఖ్రుంగన్ = కొంచెపడఁగా, సారంగబుద్ధిఁజేసి = ఏనుఁగనెడిబుద్ధిచేత, "సారంగ శ్చాతకే భృంగే కురంగేచ మతంగజే" అని అ. ఆఘనున్ = ఆమునిపుత్త్రుని, త్రెళ్లఁ జేసెను.

భా. పుడమిఱేఁడు = పాండురాజు, ఈరీతిఁగడఁగి, ఇంక భిన్నాన్వయము, డెందము, మృగ = మృగదంపతులయొక్క, వ్యాపార = రతివ్యాపారమువంటి, ఖేల నము క్రీడను, "మృగీచ మృగశ్చ మృగౌ పుమాన్ స్త్రియా" మ్మనుసూత్రమున నేక శేషము "మృగయోర్వ్యాపారః మృగవ్యాపారః" అని. సమాసము, అభిలషింపఁగా, తారు=తాము, అ. 'ఒత్తు నక్షరములు నొనరంగ జఝలుర్ష, శషసహలునిరూఢి జడ్డగాని, శౌను నచ్చు తెనుఁగులను దీర్ఘములమీఁద, బండిరాను లేదు పద్మనాభ' యని వెల్లంకికులశ్రేష్ఠుఁ డైనతాతంభట్టుగారు కవిలోకచింతామణియందుఁ జెప్పినారు గనుక తారు సంచరించెడుననుదిక్కునను రేఫమే. మృగంబుల = మృగములయొక్క, కైవడిన్ = రీతిచే, అసమాస్త్రకర్మకలనన్=మన్మథవ్యాపారాసక్తిచేత, కలిఃకామధేను వన్నారు గనుక, తనరు=ఒప్పునట్టి, చొక్కపురాణన్=మంచియనురాగముచేత, రాగ శబ్దమునకు రాణ యనునది మాగధిరూపము, మునిదంపతులు, తమకంబులు దేరన్ = తమిపుట్టఁగా, నెయ్యంబు నెనరు, మీఱనినిచిన, తల్ప్రియతన = ఆవిహారమందలి తాత్పర్యముచేతనే, ఉండఁగా, పుడమిఱేఁడు వారితకారుణ్యుఁడై యని యన్వయము. పూని = లక్ష్యముచేసికొని యనుట, కలశమంబు = కలిగినశాంతినంతటిని, మగ్నముగఁ జేయుచున్ = అడఁచుచును, అపుడు, వినిశిత = మిక్కిలిఁ దీక్ష్ణమైన, శరవిశేషము యొక్క యభిహతిచేత, సద్దృష్టి=వివేకులయొక్క, నియతి = నియమము, వృద్ధాచార మనుట, ఖ్రుంగన్ = తప్పఁగా, సారంగబుద్ధిఁజేసి=లేళ్లనెడిబుద్ధిచేత, ఆఘనులఁద్రెళ్లనేసె నని యన్వయము.

వ. ఇ ట్లేసిన. 21

క. వాలంపతాకునకు ధృతి, ప్రీలఁగ హా తాత యనుచు వెలువడుతన్మ
ర్త్యాలాపమునకు నాజన,పాలకులోత్తంసుగుండె భగ్గునఁ గలఁగెన్.

రెంటికి సమము సులభము.

క. ఆధరణీపాలుఁడు తమ, సాధునియతికొమరునేఁడు సమసెనె యిట్లా
హా ధాత వ్రాఁత యనిశర, బాధం గలఁగఁగను వారిపజ్జకుఁ జనియెన్.

భా. ఆధరణీపాలుఁడు = పాండురాజు, తమయొక్క, సాధు = లెస్సైనన, నియతి=భాగ్యముయొక్క, కొమరునేఁడు, సమసెనె=సమసెఁగదాయని ఖేదవాక్యము, అని శరబాధచేత, కలఁగఁగన్ = మునిదంపతులు త్రొట్రుపడఁగా, వారియొక్క, పజ్జకున్=సమీపమునకు, చనియెను.

రా. ఆధరణీపాలుఁడు=దశరథుఁడు, తమసాధునిన్=తమసానదియందు, "తటినీ హ్రాదినీ ధునీ" అని అ. యతికొమరు = మునిపుత్త్రునియొక్క, ఏఁడు = ఏండ్లు, ఆయువనుట, జాత్యేకవచనము. క. 'రూకలు వేవేఁ కనఁగా, బ్రాకటముగ వృష్టి ప్రాణిభాగ్యం బనఁగా, లోకమున నాఁడుదానికి, శ్రీకర మగుసొమ్ము సువ్వె సిగ్గ యనంగ' నని కవిలోకచింతామణియందు, నేఁడు+అనుచోటను నర్థబిందువున్నందున, ఉ. 'వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్, నేఁ డిటవచ్చె నేఁ తమనిష్ఠమెయిన్ భవదగ్నిహోత్త్రముల్, పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నింటికిన్, రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో' యని నన్నయభట్టప్రయోగము. సమసెనేయని, వారిపజ్జనున్ = ఉదకసమీపమునకు చనియెను.

క. చని తన్ముఖమునఁ దద్వృ
త్తనవిధ మంతయును విని ధరారమణుఁడు ద
త్తనుశరవేదనఁ గ్రమ్మఱె
తనుఁ బొదవినయ ట్లతివ్యథావిహ్వలుఁ డై. 24

రెంటికి సమము సులభము.

క. ఏనుం గనికర మరయక
పూనితిఁ గా కిట్టియెడలఁ బొసఁగునె యేయం
గానమె కాలని యమగతి
తో నావేట మునియుగము ద్రుంగించెఁ దుదన్. 25

రా. ఏనుంగని = గజమని, సీ. 'ఏనుంగునెక్కి పెక్కేనుంగు లిరుగడరాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె' అని సోమయాజి. కరము = మిక్కిలి, అరయక=విచారింపక, పూనితిఁగాక, ఇట్టియెడలన్ = ఈయాశ్రమభూములయందు, ఏయను, పొసఁగునె = యుక్తమౌనా, అని కాకుస్వరము. కానమే = ఎఱుంగమా. "నృపతేరపన్యాసన్యాసకరః" అనునర్థమునసుట. కాలనియమగతితోన్ = కాలప్రేరణతోఁ గూడి, "లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే" అని న్యాయము. మునియుగము=మునికుమారుని యాయువును, నానుడువార్త, తుదన్ = వేఁటయగుసమయమున, త్రుంగించెను = క్రియ.

భా. ఏనున్ = నావంటివాఁడును, కని = ప్రత్యక్షముఁగఁ జూచి, కరమరయక చెయిగొంచింపక, ఇట్టియెడలన్ ఈక్రీడాసమయములయందు, కనికర మరయక=దయ లేక యనియుఁ జెప్పవచ్చును. ఏనును+కనికరమను దిక్కున సంధికి, క. 'వాంతములైన పదంబుల, పొంతం బైనున్న శబ్దముల కచటతపల్, దొంతిగ జడదబ లగున, య్యంత

రా. ఆయమ=మాద్రి, మహాయతధైర్యమహి=అధికధైర్యస్థానమైనది, మగని = పాండురాజుయొక్క, అసురక్ష=ప్రాణరక్షను, అమత్యాయత్తతన్ = అబుద్ధివశమున, తాఁజేయక, ఆయతనుక్రియకున్=ఆమన్మథక్రీడకు, అతనినియతిచేన్=ఆపాండురాజు దురదృష్టము చేత, చేరెను.

రా. ఆయమనియమైకనిధి=యమనియమములకు ముఖ్యస్థానమైన యావిశ్వామిత్రుఁడు, "శరీరసాధనాపేక్షం నిత్యం యత్కర్మ తద్యమః, నియమస్తు స యత్కర్మ నిత్యమాగంతుసాధన" మ్మని అ. మహాయతధైర్య, మహిమ = మహిమను, కని=ఎంచి, మఱియొకయర్థము. మహిమకు, గని = ఆకరమైనవాఁడు, అసురక్షయము = రాక్షస నాశమును, అత్యాయత్తతన్=ఆసక్తిచేత, అతనుక్రియకు=అధికోద్యోగమునకు, అతని నియతిచేన్=ఆదశరథునిభాగ్యమున, చేరెను=వచ్చెను.

చ. మనుజవరుండు నప్డు నడుమన్ ఘటియిల్లెడువిఘ్నవాక్ప్రవ
ర్తనలు గురుప్రయత్నవిహతంబులు సేయుచు రామ యేక్రియన్
నిను విడనేర్తు నంచుఁ గడు నెమ్మిఁ గవుంగిటఁ జేర్చి యంతటం
దనయసువాంఛ డించి తగఁ దన్పెఁ దదర్థిఁ గృతార్థుఁ గామునిన్.

రా. మనుజవరుండు = దశరథుఁడు, విఘ్నవాక్ప్రవర్తనలు = అంపలేననుమాటలను, గురుప్రయత్న=వసిష్ఠునినిర్బంధముచేత, విహతంబులు సేయుచున్ = మాన్చినవాఁడై, తనయసువాంఛన్ = అధిక పుత్త్రవాత్సల్యమును, డించి, తత్ = ఆరాముని, అర్థిన్=తోడుకపో నిశ్చయించినవాని, మునిని గృతార్థుగాఁ దన్పెను.

భా. మనుజవరుండు=పాండురాజు, నడుమన్ ఘటియిల్లెడు, విఘ్నవాక్ప్రవర్తనలు=మాద్రిప్రతికూలోక్తులను, గురుప్రయత్నవిహతంబులు సేయుచున్ = అధిక ప్రయత్నముచేత మాన్పుచు, రామ=మాద్రికి సంబుద్ధి. తనయొక్క, అసువాంఛను డించి, తత్=ఆప్రాణములను, అర్థిన్=హరియింప నిశ్చయించినవాని, కృత = చేయఁబడిన, అర్థున్=ప్రయోజనము గలవాని, సంఘటనకర్త యనుట, తన్పెను, మాద్రి మాటలు వినక సంభోగించె ననుట.

తే. స్వవిధివిఘ్ననిరాసంబు సలుప నతఁడు
రామసాంగత్య మర్థించెఁ బ్రమదగరిమఁ
బెనుచుతదనుయాత్రకు నంతఁ దనువు వొంగఁ
బ్రస్ఫుటం బైనయుత్సాహభరముఁ బూనె. 12

భా. స్వవిధి=తనవిధి, విఘ్ననిరాసంబు సలుపన్=విఘ్నములేకుండఁజేయఁగా, స్త్రీయొక్క, సాంగత్యమును, అర్థించెను=క్రీడించె ననుట, అంతన్=అటుతర్వాత

ప్రమద=మాద్రి, గరిమఁబెనుచు=గౌరవహేతువైన, తదనుయాత్రకున్=తదనుగమనము నకు, ఉత్సాహభరమును బూనెను.

రా. స్వవిధివిఘ్ననిరాసంబు = స్వానుష్ఠానవిఘ్నరాహిత్యమును, చలుప, అతఁడు= విశ్వామిత్రుఁడు, రామసాంగత్య మర్థించెన్ = రాముని నంపుమనెను, అంత=దశరథుఁ డంపెదనన్నతర్వాత, ప్రమదగరిమఁ బెనుచు = సంతోషాతిశయమును గూర్చుచున్న, తత్ = ఆరఘునాథునియొక్క, అనుయాత్రకున్=వెంటవచ్చుటకు, ప్రస్ఫుటం బైన యుత్సాహభరముం బూనెను = త్వరపడె ననుట.

స్రగ్ధర. తలఁపి ట్లుత్సాహ మొందం దనయజనపరిత్రాణ మర్థించియ
క్కాం, దళితాపత్యానురక్తిన్ మహిపుననుగతిం దాను రాఁ బూన
కుండన్, వలనొప్పన్ మాన్చి స్వస్థానమునకుఁజనియెన్ రామునాత్మే
శుఁ బ్రేమా, త్యలఘుశ్రేయస్సుమిత్రానవరతనయ యోగాఢ్యుఁ దో
డ్కొంచు వేడ్కన్.

రా. తన, యజనపరిత్రాణము = యజ్ఞసంరక్షణమును, అర్థించి, అక్కాందళితా పత్యానురక్తిన్=ఆచిగిర్చినపుత్త్రానురాగము కలవాని, మహిపున్=దశరథుని, మాన్చి= తిరుగనంపి, ప్రేమచేత, అత్యలఘు = అతిశయమానట్టుగా, శ్రేయః = శ్రేష్ఠుఁడైన, "శ్రేయాన్ శ్రేష్ఠః పుష్కలశ్చ" అని అ. సుమిత్రా=సుమిత్రయొక్క, అనవరతనయ= అపరతనయుఁడు గానిజ్యేష్ఠుఁడైన లక్ష్మణునియొక్క, "యవీయాత్ వరజానుజా" అని అ. యోగాఢ్యున్ = కూటమిగలవాని, ఆత్మేశున్=పరబ్రహ్మస్వరూపమైనవాని, రామునిఁ దోడ్కొంచు, స్వ = తనయొక్క, స్థానమునకున్ = ఆశ్రమమునకు, చనియెను, కందళి తాపత్యానురక్తిన్మహిపుననుదిక్కున, బిందువునకు నకారము యతిచెల్లినందుకు, తే. 'టతప వర్గాక్షరములకు డాపలించి, యొనర నూఁదినబిందువు లుండెనేని, వరుస ణనములు వళు లగువానికెల్ల, నవనిఁ గొందఱు సుకవులయనుమతమున' నని కావ్యాలంకార చూడామణి, 'కందళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడి' నని మనుచరిత్రములోనిప్రయోగము.

భా. తనయజనపరిత్రాణము = పుత్త్రజనరక్షణమును, అర్థించి, దళిత=పోఁగొట్ట, బడిన, అపత్య=పుత్త్రులయందుఁగల, అనురక్తిన్ = వాత్సల్యము గలదాని, అక్కున్ = కుంతిని, అక్కాందళిత యనుదిక్కున, క. 'నాంతము లైనపదంబుల, పొంతంబై నున్న శబ్దముల కచటతపల్, దొంతిగజడదబ లగున, య్యంత నకారంబు సున్న లభినవదండీ' యనులక్షణమున నకారపుఁబొల్లు సున్నైనది. ఏయక్షరమున్నఁగాన సున్న నిలువఁ జెప్పవచ్చునందుకు, లయగ్రాహి. 'కమ్మని లతాంతములకు మ్మొనసివచ్చు మధుపమ్ములసుగీతనినదముల" అని యాదిపర్వమునందు నన్నయభట్టుప్రయోగము. మహిపుననుగతిన్ =

రాజువెంటను, మాన్చి, ప్రేమ = ప్రియముచేత, అత్యలఘు = మిక్కిలి నధికమైన, శ్రేయః = పుణ్యమునకు. "స్యాద్ధర్మమస్త్రియాం పుణ్యశ్రేయసీసుకృత" మని అ. సుమిత్ర = లెస్సచెలికాఁడైన, అనఁగాఁ బుణ్యముతోఁ గూడినవాఁడనుట, అనవరత = ఎడతెగని, నయ=నీతిగల, యోగ=ఆత్మయోగముచేత, ఆఢ్యున్=సంపన్నుఁడైనవాని, రామున్=మనోహరుని, ఆత్మేశున్=తనపతిని, తోడ్కొంచు, స్వస్థానమునకున్ = స్వర్గస్థానమునకు, చనియెను.

తే. అట్లు తండ్రిచేత విసృష్టులైనయట్టి
రాకుమారులు సహజననీకయాత్రఁ
బూని సంయమీశ్వరనీయమాను లగుచుఁ
జనిరి నిజపురమునకు విషాద మొదవ. 14

భా. అట్లు, తండ్రిచేతన్ = పాండురాజుచేత, విసృష్టులైనయట్టి=విడువఁబడినట్టి, తండ్రిచచ్చినవారనుట, రాకుమారులు = ధర్మజభీమార్జుననకులసహదేవులు, సహజననీకయాత్రన్=తల్లియైన కుంతితోఁగూడిన యాత్రను పూని, సంయమీశ్వరులచేత, నీయమానులగుచున్=తోడుకొని రాఁబడినవారై, విషాదమొదవన్ = ఖేదపడుచును, నిజపురమునన్ = హస్తినగరమునకు, చనిరి.

రా. తండ్రిచేత, విసృష్టులైనయట్టి = అంపఁబడినట్టి, రాకుమారులు=రామలక్ష్మణులు, సహజన్=కులాచారయోగ్యమైన - స్వభావసిద్ధమైన దనుట, అనీక యాత్రను = యుద్ధయాత్రను, "అస్త్రియాం సమరానీకరణాః" అని అ. సంయమీశ్వర=విశ్వామిత్రుని చేత, నిజపురమునకున్ = అయోధ్యకు, విషాదమొదవన్ = ఖేదమగునట్లుగా, చనిరి.

సీ. అత్తెరంగునఁ జను నప్పుడు దమవార్త
దవుదవ్వులను విని తత్పథంబు
నందు మదప్రౌఢి మందాటకమహేభ
హారిశతాంగసమృద్ధిఁ గరముమించు
సముదగ్రతరబల సంపద నెదురుగాఁ
గనిజపితృజ్యేష్ఠుఁ డనుప నతని
ప్రియముగా రాముసంశ్రితధర్మగుణమైన
యమ్ము బుధాళికి సమ్మదకర
ఆ. మగుచుఁ బరగె నమ్మహాబలముదము భ
జించి యమరనగరిఁ జేర నంత
నక్కుమారు లరిగి రావలమానని
గాఢధృతినిమానికథలు వినుచు. 15

రా. మదప్రౌఢిమన్=గర్వోద్రేకముచేత, మహేభ = మత్తేభములయొక్కయు, హరి = సింహములయొక్కయు, శత = నూఱులసంఖ్యలైన, అంగ = శరీరములయొక్క, సమృద్ధిన్ = స్ఫూర్తిచేత, కరముమించు, సముదగ్రతరబలసంపదను = అత్యంత బలసమృద్ధిగలదాని, తాటక నెదురుగాఁ గని, జపితృజ్యేష్ఠుఁడు = మునిశ్రేష్ఠుఁడైన విశ్వామిత్రుఁడు, అనుపఁగా నతనిప్రియముగా, రాము = రామునియొక్క, సంశ్రిత ధర్మగుణమైన=వింటియల్లెయందు సంధింపఁబడిన దనుట. "మౌర్వీ జ్యా శింజినీ గుణః" అని అ. అమ్ము = బాణము, బుధాళికిన్ = దేవశ్రేణికి, సమ్మదకర మగుచు, అమ్మహాబల= తాటక, ముదముభజించి, అమరనగరిన్ = స్వర్గమును, చేరన్ = చేరునట్టుగా, పఱఁగెన్=పఱచెను. అంత, అక్కుమారులు = రామలక్ష్మణులు, మానని=అణఁగని, గాఢ ధృతిన్=అధికసంతోషమున, ఆవల నరిగిరి.

భా. మదప్రౌఢిచేత మందమానట్టుగా, అటక = చరింపుచున్న, "అట గతౌ" అనుధాతువుమీఁద ఘఞ్ప్రత్యయాంతము. మహేభములయొక్కయు, హరి = గుఱ్ఱముల యొక్కయు, శతాంగ = రథములయొక్కయు "శతాంగః స్యందనో రథః" అని అ. సమృద్ధిన్ = అతిశయముచేత, కరముమించు, బలసంపదన్ = చతురంగబలసంపదను, నిజపితృజ్యేష్ఠుఁడు = ధృతరాష్ట్రుఁడు, ఎదురుగాననుప అతనిప్రియము, గారాము, సంశ్రితధర్మగుణమై, నయమ్ము = నీతియు, బుధాళికిన్ = పెద్దలకు, సమ్మదకరమగుచుఁ బరఁగె నమ్మహాబలము తమ్ము, భజించి యమరన్=కొల్చి యొప్పఁగా, ఆవలమాన=ఇంచు కంతచలింపుచున్న, "ఆజీవదర్థేఽభివ్యాప్తౌ" అని అ. నిగాఢధృతిన్ = అధికధైర్యము చేత, అక్కుమారులు, మానికథలు = వెంటవచ్చెడుమునులవాక్యములను, వినుచు, అరిగిరి=హస్తిపురికిఁ బోయిరి.

సీ. ఆరీతిఁ జని తమయానగరంబు ప్ర
వేశించి మెలఁగ నుద్వృత్తి నడరు
నస్రపయోధుల నంబకంబుల నాఁగి
తన్మహాశ్రమశోక దైన్యభరము
హరియించుటకుఁ దమకురువృద్ధు లొసఁగెడు
బహుళతాపసహిత భాషితములు
దీ వెనల్ వినయవిధేయతతోడఁ జే
కొనుచును వెండియు నెనరుదొరలు
ఆ. గౌరవము లొనర్పఁ గైకొంచుఁ గ్రమమునఁ
బితృవియోగచింతఁ బ్రిదిలి క్రీడ

సలిపి రెల్లప్రొద్దు సన్మానసస్థితిఁ
జాల ధార్తరాష్ట్ర లీలఁ దగిలి. 16

భా. తమ, ఆనగరంబు = ఆహస్తినగరమును, ప్రవేశించి, అస్ర = కన్నీళ్లనెడి, పయోధులక్ = సముద్రములను, "అస్రమశ్రుణి శోణితే" అని అ. అంబకంబులక్ = నేత్రములయందు, "అంబకం నేత్రశరయోః" అని వి. ఆఁగి, తత్ = ఆవ్యథచేతనైన, మహాశ్రమ = అధికమైన బడలికగల, శోక = ఖేదముయొక్కయు, దైన్యముయొక్కయు, భరముఁ=అతిశయమును, "భరోఽతిశయభారయోః" అని వి. హరియించుటకు, తమ, కురువృద్ధులు = భీష్మాదులు, ఒసఁగెడు, బహుళతాప = అధికపరితాపముతోడ, సహిత= కూడిన, భాషితములను, నెనరుదొరలు=నెనరులుగలరాజులు, గౌరవములు = పూజలను, ఒనర్పఁ గైకొంచు, పితృవియోగచింతక్=పాండురాజు పోయినవిచారమును, ప్రిదిలి = విడిచి, సన్మానసస్థితిక్ = మంచిమనోవ్యాపారముచేత, ధార్తరాష్ట్ర = దుర్యోధనాదుల యొక్క, లీలఁదగిలి క్రీడసలిపిరి.

రా. ఆరీతిఁజని, తమయాన=తమయాజ్ఞ, "ఆజ్ఞప్తి యానతి యాజ్ఞ యాన"యని యాంధ్రభాషాభూషణమందుఁ దద్భవములలోఁ జెప్పినది. అస్రప = రాక్షసులైన, యోధులక్=వీరులను, అంబకంబులక్=బాణములచేత, ఆఁగి=నివారించి, తత్=ఆవిశ్వామిత్రునియొక్క, మహాశ్రమ=తపోవనమందుఁగల, తమకు, ఉరువృద్ధులు=అభివృద్ధులను, ఒసఁగెడు బహుళతాపసులయొక్క, హితభాషితముల=ప్రియోక్తులయందుఁగల, దీవెనలను జేకొనుచు, వెండియుఁ=మఱియును, నెనరుదొరలు = ప్రియముగూడిన, గౌరవములను, ఒనర్పక్=మునీశ్వరులుచేయఁగా, సత్=సత్పురుషులయొక్క, మానస=మనస్సనెడిమానస సరస్సునందుఁగల, శ్లిష్టరూపకము. "సితాంశువర్ణై ర్వయతి స్మ తద్గుణైః" అని నైషధ ప్రయోగము. స్థితిక్=వర్తనచేత, ధార్తరాష్ట్రలీలక్=హంససామ్యమును "ధార్తరాష్ట్రాస్సితేతరైః" అని అ. తగిలి క్రీడసలిపిరి.

మ. అమితప్రౌఢిగధార్మికాగ్రియపితృవ్యాదిష్టవృత్తిఁ మహో
త్తమభక్తిఁ గ్రహియించి శాంతనవసత్త్వశ్రీచమత్కారప
క్రిమసౌభాగ్యధురీణతన్మహిమహర్షిస్వాంతలీలోచితో
త్తమసంక్రీడ లొనర్చి రక్కుమరు లాత్మజ్ఞాతిసఖ్యాఢ్యులై. 17

రా. అమితప్రౌఢిని, గ = పొందినవాఁడునై, ధార్మిక = విలుకాండ్రలోపల, అగ్రియ = శ్రేష్ఠుఁడైన, "పరార్ధ్యాగ్రప్రాగ్రహరప్రాగ్ర్యాగ్రీయమగ్రియ" మని అ. పితృ = దశరథునిచేత, వ్యాదిష్ట = ఆజ్ఞాపింపఁబడిన, వృత్తిక్=వర్తనను, గ్రహియించి, శాంత = పరస్పరవిరోధములేనివియు, నవ = ప్రాయపువియునైన, సత్త్వ = సింహాది మృగములయొక్క, శ్రీ=సమృద్ధియొక్క, సమూహముయొక్కయనుట, చమత్కార =

చెల్లాటములచేత, పక్త్రిమ=పరిపక్వమైన, సౌభాగ్య = ఒప్పిదమును, ధురీణ=వహించిన, తన్మహి=ఆతపోవనభూమియందున్న, మహర్షి=మునీశ్వరులయొక్క, స్వాంత=మనస్సుల యొక్క, లీలా=ఉల్లాసమునకు, ఉచిత = తగిన, ఉత్తమసంక్రీడల నొనర్చిరి, ఆత్మజ్ఞ= బ్రహ్మజ్ఞులతోడనైన, అతిసఖ్యాఢ్యులై.

భా. అమిత, ప్రౌఢిగన్=ప్రౌఢియగునట్టుగా, ధార్మిక=ధర్మాత్ముఁడైన, అగ్రియ పితృవ్య = పెదతండ్రియైనధృతరాష్ట్రునిచేత, "పితృభ్రాతా పితృవ్యస్స్యా" త్తని అ. ఆదిష్ట = ఉపదిష్టమైన, వృత్తిని, శాంతనవ=భీష్మునియొక్క, సత్త్వశ్రీ = బలసంపద యొక్క, తన్మహిమ = ఆధృతరాష్ట్రునియైశ్వర్యముచేత, హర్షి = సంతోషముగల, ఆత్మజ్ఞాతి=దుర్యోధనాదులతోడనైన, కడమ సరి.

శా. శశ్వద్విస్ఫురితస్వబాహుబలభీష్మప్రౌఢచాపక్రియల్
విశ్వామిత్రవితానవిఘ్నభయవిశ్లేషం బొనర్పన్ జగ
ద్విశ్వాసస్థితిఁ జాలి యున్కి నటులవ్వీరార్భకుల్ గాంచి ర
త్యైశ్వర్యాహమికావిశృంఖలవిహారారంభవిస్రంభముల్. 18

భా. భీష్మునియొక్క, విశ్వ=సమస్తమైన, అమిత్ర = శత్రువులయొక్క, వితాన= సమూహముచేతనైన, అవ్వీరార్భకుల్ = కౌరవపాండవులు, అత్యైశ్వర్యమును, అహమికా = పరస్పరాతిశయాహంకారమును, విశృంఖలవిహారములను, ఆరంభముల యందుఁగల, విస్రంభములు = విశ్వాసములను, "సమౌ విస్రంభవిశ్వాసౌ" అని అ. సిద్ధఫలములైన యుద్యోగములను ననుట, కాంచిరి.

రా. స్వబాహుబలముచేత, భీష్మ = భయంకరములైన, ప్రౌఢచాపక్రియలు, విశ్వామిత్రునియొక్క, వితాన = యజ్ఞముయొక్క, "క్రతువిస్తారయోరస్త్రీ వితానం త్రిషు తూచ్ఛకే" అని అ. అవ్వీరార్భకుల్ = ఆరామలక్ష్మణులు, అత్యైశ్వర్య = ఈశ్వరకృత్యము నతిక్రమించిన, "అత్యాదయః క్రాంతాద్యర్థే ద్వితీయయా" అని ద్వితీయాతత్పురుషము. ఐశ్వర్యశబ్దము "గుణవచన బ్రాహ్మణాదిభ్యః ష్యఞ్" అని కర్మధారయమందలి ష్యఞ్ప్రత్యయాంతము. అహమికా = అహంకారముచేత, విశృంఖల = అనివారితములైన, విహారారంభ=క్రీడోద్యోగములయందుఁగల, విస్రంభములు= అసంకోచవృత్తుల ననుట, కాంచిరి.

సీ. ఇమ్మాడ్కి నయ్యన్నదమ్ములపాపల
వార్యఖేలల నతివ్యాప్తమైన
యాసవనక్షోణియందును సరసుల
గరిడి నిష్టపురాణపరిచితిఁ బ్రియ

మం దెడుసమయంబునం దాటకాకుమా
    రులలోలసద్బలరూఢి నెందు
మాఱుద్ది లేకొప్పుమాఱుభీమోద్ధతి
    ప్రబలంగఁ దారాసరణి మెలంగ
ఆ. గడఁక చాలక కడుఁ గలఁగెడు తాపస
    నాథహృదయవర్తనంబు దిరము
    గాఁగఁ దేర్చి బాధకలితసుయోధనా
    దు లగురాజనందనులు గడంగి. 19

రా. ఇమ్మాడ్కిని, అయ్యన్నదమ్ములు = ఆరామలక్ష్మణులు, అపాపలవ = పాప లేశరహితులైన, ఆర్య = పెద్దలయొక్క, ఖేలలన్ = విహారములచేత, అతివ్యాప్తమైన, ఆసవనక్షోణియందున్ = ఆయజ్ఞభూమియందు, సరసులగరిడిన్ = రసికులవెంబడిని, ఇష్ట, పురాణపరిచితిన్ = పురాణశ్రవణమువలన, ప్రియమందెడు సమయంబున, తాటకాకుమారులు = సుబాహుమారీచులు, అలోల = చలింపని, సద్బల = మంచి సేనయొక్క, భీమ = భయంకరమైన, తారాసరణిన్ = ఆకాశమున, మెలంగఁగా, తాపసనాథ = విశ్వామిత్రునియొక్క, హృదయవర్తనంబు తేర్చి, బాధకలిత = మిక్కిలిఁ జేయఁబడిన, సుయోధ = శూరులయొక్క, నాదులు = సింహనాదముగలవారనుట, కలితప్రారంభులైరని ముందటిపద్యములోఁ గ్రియ.

భా. ఇమ్మాడ్కిని, అన్నదమ్ములపాపలు = కౌరవపాండవులు, అవార్య = విశృంఖలమైన, ఖేలలన్ = విహారములయందు, ఆసన్ = అపేక్షచేత, వనక్షోణి యందున్ = ఉద్యానవనభూమియందును, సరసులన్ = కొలఁకులయందును, గరిడి యందును, ఇష్టపురాణ = వేడుకయొక్క, పరిచితిన్ = ఎడతెగమిచేత, సమయంబు నందు, ఆటకు నాకుమారుల లోలసద్బలనిరూఢిచేత, భీమోద్ధతి = భీముని యౌద్ధత్యము, ప్రబలంగ, తార = తాము, ఆసరణిన్ = ఆరీతిని, మెలంగ, కడఁక = ధైర్యము, చాలక, తాపసనాథ = విచారయుక్తమైన, హృదయవర్తనంబు తేర్చి, బాధ = సంహ రించెదమనెడి ప్రతిజ్ఞచేత, ''భృశప్రతిజ్ఞయోర్బాధ'' మని అ. కలిత = కూడిన, సుయోధనాదులు = దుర్యోధనాదులు.

మ. అసమామ్నాయనయాధ్వరక్షణవిభూతౌపాదిరై మించురా
    క్షసకర్మంబునకుం దలంకక సమగ్రస్థైర్యధారేయమా
    నసులై డెందములోనధర్మపటిమం దద్భీమసేనాంగద
    ర్పసముద్రేకము రూపుమాపఁ గలితప్రారంభులై రంతటన్. 20

భా. అసమ = సరిలేని, ఆమ్నాయ = కులముయొక్క, "ఆమ్నాయ స్సంప్ర దాయకః" అని అ. నయాధ్వ = నీతిమార్గముయొక్క, రక్షణమునకు, రాక్షసకర్మంబు నకున్ = క్రూరకృత్యమునకు, లోను, అధర్మపటిమన్ = అధర్మపునేర్పుచేత, కడమ సులభము.

రా. అసమమైన, ఆమ్నాయనయ = వేదవిధిగల, "శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః" అని అ. అధ్వరక్షణ = యజ్ఞోత్సవముయొక్క, "నిర్వ్యాపారస్థితౌ కాలవిశేషోత్సవయోః క్షణః" అని అ. రాక్షసకర్మంబునకున్ = రాక్షసుల యత్నములకు, తలంకక, ధర్మపటిమన్ = వింటినేర్పుచేత, తత్ = ఆరాక్షసులయొక్క, భీమ = భయంకరములైన సేనలయొక్క, అంగ = అంగములైన రథకరితురగపదాతులయొక్క, దర్ప సముద్రేకమును రూపుమాప డెందములోన, కలితప్రారంభులైరి = ఉద్యోగించిరనుట.

ఉ. తోరపుటల్క నారిపులు దొమ్మిగఁ బైపయిఁ గ్రమ్మ వారిలీ
లారణవృత్తిఁ గిట్టి కడు లావరిభీముఁడు రామభద్రుఁ డే
పారెడువేడ్కతో నెరపె నప్పుడు కాండపటుప్రహారదు
ర్వారవిధిన్ సుబాహుఁడనువాఁడిలసద్గతి గాంచి మించఁగన్. 21

రా. అరిభీముఁడు = రామభద్రుఁడు, అప్పుడు, కాండ = బాణములయొక్క, సుబాహుఁ డనువాఁడు, ఇలసద్గతిగాంచి మించఁగా, కడు, లావు = బలిమిని, నెరపెనని యన్వయము.

భా. తోరపుటల్కను, అరిపులు = దుర్యోధనాదులు, వారిలీలా = జలక్రీడ యందగు, రణవృత్తిన్ = పోరాటముచేత, పైపయిఁ గ్రమ్మఁగాఁ గడులావరి, రామ భద్రుఁడు = మంచియదృష్టముగల, "స్వశ్శ్రేయసం శివం భద్ర" మని అ. భీముఁడు, సుబాహుఁడను = లెస్సభుజములు గలవాఁడనెడి, వాఁడి = ప్రతాపము, లసద్గతి గాంచి = ప్రఖ్యాతినిగాంచి, మించఁగా, కాండ = ఉదకముయొక్క, "కాండోఽ స్త్రీ దండబాణార్వవర్గావసరవారిషు" అని అ. పటుప్రహారవిధిని నెరపెనని క్రిందటి కన్వయము.

వ. అప్పు డతండు మఱియును. 22

క. వెసఁ దజ్జ్యేష్ఠుని నతిసా, హసుని హృదర్పితమహాశుగాశుగవేగో
ల్లసనప్రసభాచరితా, ధిసముద్రనిపాతుఁ జేసె దృఢదోశ్శక్తిన్. 23

భా. వెసను, తజ్జ్యేష్ఠునిన్ = దుర్యోధనుని, మహాశుక్ = అధికశోక మనెడి, "మన్యుశోకౌతుశుక్ స్త్రియా" మని అ. ఆశుగ=బాణములయొక్క, ఆ ధిసముద్ర = చింతాసముద్రమందు, నిపాతున్ = పాటుగలవానిఁగా, చేసెను.

రా. తజ్జ్యేష్ఠురిక్ = మారీచుని, ఆశుగాశుగ = వాయవ్యాస్త్రముయొక్క, "ఆశుగౌ వాయువిశిఖౌ" అని అ. ఆచరితమైన, అధిసముద్ర = సముద్రమందు, అవ్య యీభావము, నిపాతుర్ = పాటుగలవానిఁగా, చేసెను.

చ. అతఁడును నట్ల బాల్యదశయంద కడుం బిరుదైనయాబలా
ద్భుతునిదురంబరిస్ఫురణదూలఁ బ్రవర్తిలువేళఁ గ్రూరచి
త్తతఁ దనమూఁకతోఁ బొదివి తాఁ దదజయ్యతచూచుటన్ భయా
హతమతిఁ గట్టివైచె వెస నాపగలోన ననారతంబుగన్. 24

రా. అతఁడును=ఆమారీచుఁడును, ఆబలాద్భుతుని = రామునియొక్క, దురంబు= యుద్ధము, అరిస్ఫురణ = శత్రుసామర్థ్యము, తూలన్ = కొంచెముపడునట్టుగా, ప్రవర్తిలు వేళ, తత్ = ఆరామునియొక్క, అజయ్యత = జయింప శక్యముగానివాఁడౌటను, "క్షయ్యజయ్యౌ శక్యార్థే" అని నిపాతము. చూచుటవల్ల, లోనన్ = మనసులోన, ఆపగ = భ్రాతృవధద్వేషమును, అతఁడు, కట్టివైచెను = అణఁచెను, అని యన్వ యము.

భా. ఆతఁడును = దుర్యోధనుండును, అట్లు=పూర్వోక్తప్రకారమున, బలాద్భు తున్=భీముని, నిదురన్=నిద్రచేత, పరిస్ఫురణదూలఁ బ్రవర్తిలువేళ = ఏమఱియుండు నప్పు డనుట, ఆపగలోనన్ = నదియందు, 'స్రవంతీనిమ్నగాపగా" అని అ. వారితం బుగ, కట్టివైచెన్=బంధించిపడవేసెను, కడమ సులభము.

వ అప్పుడు. 25

క. ఘనవిగ్రహజృంభణమున
ననయము దనకట్లు దెగఁగ నవ్వాహినిఁ గ్రీ
డన గెలిచి వచ్చునబ్బా
లుని గని వెఱఁ గంది రాత్మ లో నచటిజనుల్. 26

భా. విగ్రహ = శరీరముయొక్క, "విగ్రహస్సమరే కాయే విస్తారప్రవిభాగ యోః" అని వి. జృంభణమునన్=నీల్గుటచేత, కట్లు దెగఁగా, అవ్వాహినిన్=ఆనదిని, "స్రవంత్యామపి వాహినీ" అని అ. గెలిచివచ్చు=తరించివచ్చుచున్న.

రా. విగ్రహజృంభణమునన్ = యుద్ధాతిశయముచేత, అవ్వాహినిన్ = రాక్షస సేనను, తనపు, అట్లు=ఆరీతిని, తెగఁగన్ = తెగిపోఁగా.

క. ఆతఁడు మదిఁ జతురాత్మ
భ్రాతృసహాయతఁ గరంబు రంజిలుచుం ద
ద్దాతులయాగస్ఫుటవిధు
లీలెఱుఁగున జరుగ నిర్వహించె విజయతన్. 27

రా. ఆతఁడు = రాముఁడు, చతుర = సమర్థుఁడైన, ఆత్మభ్రాతృ=లక్ష్మణుని యొక్క, తజ్జ్ఞ=విశేషజ్ఞుఁడైనవిశ్వామిత్రునియొక్క, అతుల = సరిలేని, యాగముయొక్క, స్ఫుటవిధులను, విజయతః=విశిష్టజయముకలవాఁడౌటచేత, నిర్వహించెను.

భా. ఆతఁడు=భీముఁడు, చతుః=నలుగురైన, ఆత్మభ్రాతృ = ధర్మాదులయొక్క, తజ్జ్ఞాతుల=ఆదుర్యోధనాదులయొక్క, ఆగః=అపరాధములయొక్క, "ఆగోపరాధో మంతుశ్చ" అని అ. స్ఫుటవిధులు = కనిపించుకొని చేయుటలు, "శర్పరే ఖరి వా విసర్గ లోపః" అని విసర్గలోపము జరుగఁగా, విజయతః = విజయత్వమును, నిర్వహించెను.

సీ. అతఁడు దానవిహాత యైనవసుధయంద
మును మించుప్రఖ్యాతి ఘనసమృద్ధిఁ
దనర విశ్వామిత్ర తాపసుహృత్ప్రమో
దస్ఫూర్తి సాధించి తద్గురుత్వ
శక్తినంబకఘనాశనిగదాస్యాదులు
వర్ణింప నెక్కుడై వఱలఁ గాంచెఁ
గావున నప్వీర్య కలితుఁ డాశత్రుల
యమ్మనాకులవృత్తి నిమ్ముకొనఁగఁ
తే. జేసె నంత ఘనఖ్యాతి భాసిలఁ గృప
నామునిఁ బురస్కరించి నానామహాస్త్ర
గరిమ వడసి రాకుమారు లాగురునిరూఢిఁ
దిరముకొలిపెఁ దదచ్యుత తేజ మిలను. 28

భా. అతఁడు=భీముఁడు, తాను, అవిహాతయై, నవసుధయందమును = అమృత రీతిని, మించు, ప్రఖ్యాతి = కీర్తి, తనర, విశ్వామిత్రతాప = అఖిలశత్రుతాపము యొక్కయు, సుహృత్ప్రమోద = మిత్రసంతోషముయొక్కయు, స్ఫూర్తిని సాధించి, తత్=ఆస్ఫూర్తియొక్క, గురుత్వశక్తిచేత, అఘనాశనిగః=దుఃఖమును విడిచిన దగు నట్లుగా, అంబకః = తల్లియైన కుంతికి, దాస్యాదులు = సేవాదులను, కాంచెఁగావున, అప్వీర్యకలితుఁడు=భీముఁడు, ఆశత్రుల = దుర్యోధనాదులయొక్క, అమ్మను = గాంధారిని, ఆకులవృత్తి నిమ్ముకొనఁగఁజేసెః = విచారపడఁజేసెను, అంత, ఆకుమారులు= కౌరవపాండవులు, కృపనామునిః=కృపాచార్యుని, పురస్కరించి యస్త్రగరిమను బడసిరి, తత్=ఆకుమారులయొక్క, అచ్యుత=జాఱని, తేజము, ఆగురుని=కృపునియొక్క, రూఢిః=ప్రసిద్ధిని, తిరముకొలిపెను, అని యన్వయము.

రా. అతఁడు=రాముఁడు, దానవి=తాటక, హతయైన వసుధయందు = నొచ్చి పోయినభూమియందే, మును=మునుపు, విశ్వామిత్రతాపసు = విశ్వామిత్రునియొక్క, హృత్ = హృదయమునకు, ప్రమోదస్ఫూర్తిని సాధించి, తద్గురుత్వశక్తిః = ఆయన యొక్కగురుత్వముతోఁ గూడిన సామర్థ్యముచేత, వర్ణింప నెక్కుఁడై వఱల, అంబక= బాణములైన, ఘన=మేఘములును, అశని=పిడుగులును, గదా = గుదియలును, అసి= చంద్రహాసమును, ఆదులు = మొదలుగాఁ గలవాని, వారుణాస్త్ర-ఇంద్రాస్త్ర-యామ్యాస్త్ర-రౌద్రాస్త్రములు మొదలైనయస్త్రము లనుట, "చంద్రహాసొరిష్టయః" అని అ. కాంచెక్ = పరిగ్రహించెను, కావున, అవీర్వ్యకలితుఁడు = రాముఁడు, శత్రుల యమ్ము=శత్రుసంహారమును, అనాకులవృత్తిక్ = అనాయాసముననే, చేసెను, స్వతః సిద్ధమైన మహిమగలరఘునాథుఁడు విశ్వామిత్రునివల్ల నస్త్రముల నభ్యసించి శత్రుజయమును జేయుటకు హేతువుఁజెప్పుచున్నాఁడు, తత్=ఆ, అచ్యుత=విష్ణువుయొక్క, తేజము = అంశమయిన రాముఁడు, అంత = అంతైన, రఘునాథునికిని గురువనెడి యనుట, ఘనఖ్యాతిభాసిల, కృపక్ = తనదయవలన, ఆమునిక్ = విశ్వామిత్రుని, పురస్కరించి యస్త్రగరిమనుబడసి, రాకుమారు = రాజపుత్రునియొక్క, లాగు=రీతిని, ఉరునిరూఢిచేతఁ దిరముకొలిపెను, తాను శిష్యుఁడై విశ్వామిత్రునికిఁ బ్రసిద్ధి గల్పించె ననుట.

వ. అంత. 29

సీ. సంయమిదివ్యతేజమునఁ గుంభిని జనిం
చినయాదిలక్ష్మి నజేయుఁ డైన
విమలశీలునిరఘువీరకులోత్తంసుఁ
దాఁగూర్చువాఁ డయితన్నుఁ బ్రోల
వరకుమారకులకుగురువై మనఃప్రీతి
దనర నత్యాశ్చర్యజనకధామ
భీమబాణాసనస్థేమవార్తా ప్రవ
ర్తనమనుభవ్యసుధన్విమూర్తు
తే. విరచితావధానశ్రుతివీథికలను
ద్రోణులసదాదరైకధురీణుఁ డగుచుఁ
బ్రౌఢి మన్నించె మేదినీపతిసుతులును
దద్ధనుశ్శక్తిపస గాంచుతమిఁ బొదలిరి. 30

రా. సంయమి = విశ్వామిత్రుఁడు, కుంభినిక్, భూమియందు, దివ్యతేజమున, జనించినయాదిలక్ష్మిక్ = సీతను, రఘువీరకులోత్తంసుక్=రాముని, కూర్చువాఁడయి=

వివాహము చేయించు యత్నము చేసినవాఁడై, మనఃప్రీతి, గురువై = అధికమై, తనర, జనక = జనకుని యొక్క, ధామ = గృహమందున్న, భీమ = పరమేశ్వరునియొక్క, బాణాసన = వింటియొక్క, స్థేమ=బలిమియొక్క, స్థిరశబ్దముమీఁద నిమనచ్ప్రత్యయము. వార్తాప్రవర్తనము, అను = అనెడి, సుధన్ = అమృతమును, శ్రుతిపీథికలను=కర్ణరంధ్రములనెడు, ద్రోణులన్ = దొన్నెలయందు, "ద్రోణీకాష్ఠాంబువాహినీ" అని అ. ప్రోషిమను, నించెన్ = నిండించెను-నిలిపె ననుట.

భా. సంయమిదివ్యతేజమునన్ = భరద్వాజమునివీర్యమున, కుంభిన్ = కలశమందు, జనించి, నయాదిలక్ష్మిన్ = నయాదిగుణసంపదచేత, అజేయుఁడైన విమలశీలుని, నిరఘున్ = అఘరహితుఁడైనవాని, అత్యాశ్చర్యజనకమైన, ధామ = ప్రతాపముచేత, భీమ = భయంకరమైన, బాణాసన = వింటిపల్లనైన, స్థేమ=స్థైర్యగుణముయొక్క, వార్తాప్రవర్తనచేత, మను=ఒప్పుచున్న, భవ్యసుధన్వి = మంచి విలుకాఁడైనవాని - ధనుర్ధరుని ననుట. నూత్నమానట్టుగా విరచితమైన, అవధాన = ఎచ్చరికగల, శ్రుతిపీథికలనున్= వేదమార్గవిచారముగలవాని, ద్రోణున్=ద్రోణాచార్యుని, తన్నృపాలవరకుమారకులకున్= కౌరవపాండవులకు, తాను, కూర్చువాఁడయి = ఆప్తుఁడై, గురువై = ఆచార్యుఁడై, తనర, మేదినీపతి = ధృతరాష్ట్రుఁడు, మన్నించెను, అని యన్వయము. సుతులును, కాంచుతమిన్ = అభ్యాసాపేక్షచేత, పొదలిరి=వర్తించిరి, కడమ సులభము.

వ. అందు. 31

మ. గురుసంకల్పముచొప్పు దప్ప కెలమిన్ క్షోణీజనాశ్చర్యవి
స్ఫురణం బొంద ఘనోగ్రకార్ముకవరంబున్ వంప నెంతే మహా
శరసోత్కర్షరయప్రయుక్తిఁ బొదలన్ సామర్థ్యసంపద్ధురం
ధరుఁ డా రామవిభుండు జిష్ణుఁడు సముద్భాసిల్లె నత్యంతమున్. 32

భా. జనాశ్చర్యమైన, విస్ఫురణంబు = ఖ్యాతిని, ఒందను, శర = బాణముల యొక్క, రామవిభుండు=మనోజ్ఞ కాంతిగలవాఁడు, జిష్ణుఁడు = అర్జునుఁడు, సముద్భాసిల్లెన్ = లెస్సగాఁ బ్రకాశించెను. క. 'సల్లలితైకపదముపై, నిల్లుండుట యగుట యనఁగ నెల్లెడఁ జను రా, జిల్లుట ప్రభవిల్లుట శో, భిల్లుట వర్తిల్లు టనఁగఁ బెనుపై యునికి' నని యాంధ్రభాషాభూషణమందుఁ గ్రియాపదములలోఁ బ్రభవిల్లుట యని యెత్తినాఁడు గనుక నుపసర్గముతోఁగూడఁ జెప్పినాఁడు.

రా. గురు = విశ్వామిత్రునియొక్క, సంకల్పముచొప్పు, ఆశ్చర్యవిస్ఫురణము= వింతైనకాంతిగల, క్షోణీజను = సీతను, పొందన్ = వరించునట్టుగా, ఉగ్రకార్ముకవరంబున్ = రుద్రచాపమును, వంపన్ = ఎక్కుఁబెట్టుటకును, మహాశరసోత్కర్షరయప్రయుక్తిన్ = అనురాగమహిమవేగప్రేరణచేత, ఎంతేన్=మిక్కిలి, పొదలన్, అత్య

ధికమాచునుండఁగాననుట, జిష్ణుఁడు = జయశీలుఁడు, రామవిభుండు, సముద్భాసిల్లెను = సంతసిల్లెను, సామర్థ్యసంపద్ధురంధరుఁడు గనుక నీశ్వరునివిల్లు వంచి సీతను వరింపఁదలచెనని మిక్కిలి తెలివిగలిగియుండె ననుట.

సీ. అపు డేమి చెప్పన న్యాసాధ్యతద్ధను
ర్వార్త సర్వక్షత్రవంశ్యులందు
మిగులఁ గర్ణాసహ్యముగఁ బర్వ నతఁడు త
న్మహిమ పెంపునరాతి మత్సరవిధి
నాత్మలో సరకుసేయక సభ్రమించె స
న్మునికృప జనకునింటను వివాహ
మగుటకు మున్ను తదంబకాశ్చర్యమం
త్రమహత్త్వకృతచండధామయుక్తి
తే. నుదయ మందిన మేటియన్యులకలఁగునె
యరయ నిట్లర్కసంతతి ఖ్యాతిమహిమ
ధాత్రిపైఁ గుంద సూతసంతానభావ
గణనఁ బ్రబలుట తత్పోష కారణమున. 33

రా. అతఁడు = రాముఁడు, తత్ = ఆవింటియొక్క, మున్ను=మునుపు, మహిమ పెంపును, అరాతి = శత్రులయొక్క, మత్సరవిధిన్ = తనజయమును సహింపనివారి తోడిద్వేషమును, సరకుసేయక జనకునింట వివాహమగుటకు, సంభ్రమించెన్=త్వర పడెను. ఇంకఁ గవివాక్యము. తదంబక = ఆవిశ్వామిత్రునిబాణములయొక్క, ధామ యుక్తిన్=ప్రతాపయోగముచేత, ఉదయ = అభ్యుదయమును, అందిన మేటి = రఘు నాథుఁడు, అన్యులకున్ = పరులకు, అలఁగునె=లోపడునా, ఇట్లు, అర్కసంతతి=సూర్య వంశముయొక్క, ఖ్యాతి = మహిమ, తత్పోషకారణమునన్=ఆరాముఁడు పోషించుట వల్ల, ధాత్రిపై, కుంద = మొల్లలయొక్కయు, "మాఘ్యం కుంద" మని అ. సూత= పాదరసముయొక్కయు, "రసస్సూతశ్చ పారదే" అని అ. సంతాన = కల్పవృక్షముల యొక్క, భా = కాంతియొక్క, అవగణనన్ = తిరస్కారమువల్లఁ బ్రబలుట.

భా. తత్ = ఆయర్జునునియొక్క, ధనుర్వార్తమిగుల, కర్ణాసహ్యముగఁబర్వ = కర్ణునికి నసహ్యముగాఁబరఁగ, అతఁడు = ఆకర్ణుఁడు, తన్మహిమ = ఆధనుఃప్రావీణ్యము యొక్క, పెంపును, నర = అర్జునుమీఁదనున్న, మత్సరవిధిచేత సరకుసేయక సంభ్ర మించెను, ఇంకఁ బూర్వకథాసూచనముగాఁ గవివాక్యము. తత్=ఆయర్జునునియొక్క, అంబకున్ = తల్లియైనకుంతికి, వివాహమగుటకు, మున్ను = మునుపే, జనకుని = కుంతి భోజునియొక్క, ఇంటను, సన్ముని=దూర్వాసునియొక్క, కృపన్ = అనుగ్రహమువల్ల,

ఆశ్చర్యమంత్రమహత్త్వకృతమైన, చండధామయుక్తిక్ =సూర్యయోగముచేత, ఉదయమందిన = పుట్టిన, మేటి = కర్ణుఁడు, అన్యులకలఁగునె, కాకుస్వరము. అర్కసంతతి = సూర్యపుత్త్రుఁడనెడి, ఖ్యాతి = మహిమ, కుందక్ = అణఁగఁగా, సూతసంతానభావ = సూతపుత్త్రత్వముచేతనైన, గణనక్ = ఎన్నికచే, బ్రబలుట, తత్ =ఆసూతునియొక్క, పోషకారణమున.

చ.అది యటులుండెఁ గన్గొనుసమస్తజనుల్ దమలోనఫల్గును
న్మదఘనశత్త్రుభంగగరిమన్ గురుదక్షిణ నేసి యొప్పుశ
శ్వదనఘుఁ జారుమూర్తిమనువంశవతంసు నుతించి రిమ్మహా
భ్యుదయునిఁ గన్న నెంతలరునో జనకుం డనుచింత సంధిలన్. 34

భా. మదఘన = గర్వపూర్ణుఁడైన, శత్రు = ద్రుపదునియొక్క, భంగ = పరాజయముయొక్క, గరిమన్=అతిశయముచేత, మను=మనెడి, వంశవతంసున్ = తనవంశమునకు శేఖరమైనవాని, ఫల్గునున్ = అర్జునుని, కన్నన్ = చూచినను, జనకుండు = పాండురాజు, ఎంతలరునోయను, చింత = విచారము, సంధిలఁగా నుతించిరి, అర్జునుఁడు ద్రుపదునిఁ బట్టితెచ్చి ద్రోణునకు గురుదక్షిణచేసినాఁడని విస్తారముగా నాదిపర్వమందుఁ జెప్పినారు గనుక.

రా. జనులు, తమలోను, అఫల్గున్ = సారవంతుని, "అసారం ఫల్గు" అని అ. ఉన్మదఘన, గురు=విశ్వామిత్త్రునికి, మనువంశమునకు, యోజన సులభము.

వ అంత. 35

సీ. తనయకలుషయత్న ఘనతరనిర్బంధ
మున రాజు వనుచుటయును గపటధు
రావారణావతారచితాతిమంజులా
వాసమయశోభిప్రశస్తధామ
ఘనకేళికలనుండఁగన్యుఁ డాత్మస్వామి
యనియు నిజోచితియును గణించి
యురుతరాదరము సేయుచు భాత్రృయుతముగా
నమ్మనువంశరత్నమ్ముఁ గొంచు
తే. నరిగె సపరిచ్ఛదముగ రాజాన్వయముని
తనదుసుఖదుఃఖవిరహవర్తనలు సరకు
గొనక సమవర్తితనయుండు జనకుఁడేలు
పురమున కరాళగతివాసి పరశసరణి. 36

రా. తన, అకలుష = ధర్మార్థమైన, యత్నముయొక్క, నిర్బంధమునన్ = బలాత్కారముచేత, రాజు=దశరథుఁడు, పనుచుటయును, కపటధురా = కపటభారమును - అధర్మమును, "ఋక్పూరబ్ధూఃపథామానక్షే" అనుసూత్రమున అకారాంతము. వారణా= మాన్పునటువంటి, అవతార = మత్స్యాద్యవతారములచేత, చిత = సంపాదింపఁబడిన, మంజుల = సుందరమైన, అక్షామ = అధికమునైన, యశస్సుచేతను, అభిప్రశస్తమైన, "గృహదేహత్విట్ప్రభావాధామాని" అని అ. ఘనమైన, కేళి ధామ = మహిమచేత, కలనుఁడు=క్రీడావిధిగలవాఁడు, అగణ్యుఁడు = అమేయుఁడైన, ఆత్మస్వామి=పరబ్రహ్మమైనవాఁడు, అనియు గణించి, అమ్మనువంశరత్నమ్మున్=రాముని, భ్రాతృయుతముగాన్ = లక్ష్మణసహితముగా, రాజాన్వయముని = విశ్వామిత్రుఁడు, సపరిచ్ఛదముగన్ = నిజపరిజనముతోఁగూడ, కొంచునరిగెన్ = తోడ్కొని పోయెను, తనదు, సుఖదుఃఖ విరహావర్తనలు, "ద్వంద్వాంతే శ్రూయమాణం పదం ప్రత్యేకమభిసంబధ్యతే" అనున్యాయమున, సుఖవిరహదుఃఖముయొక్కయు విరహసుఖముయొక్కయు వర్తనలను, సరకుగొనక, సమవర్తితన=సమవర్తిత్వమునే, ఉందు, జనకుఁడేలుపురమునకున్=మిథిలకు, అరాళగతివాసి = వక్రమార్గమును బాసి, సరళసరణిన్ = చాయతెరువున, అరిగెనని క్రిందటికన్వయము.

భా. తనయ=దుర్యోధనునియొక్క, కలుషయత్న = పాపయత్నముకొఱకు, ఘనతరమైన నిర్బంధముచేత, రాజు = ధృతరాష్ట్రుఁడు, కపటధురా = కపటభారముచేత, వారణావతమందారచితమైన, అతిమంజు=అతిమనోహరమైన, లాక్షామయ=లత్తుకచేత నిబిడమైనదై, ప్రాచుర్యార్థమున మయట్టు, శోభి=ప్రకాశించుచున్న, ప్రశస్త = యోగ్యములునైన, ధామ=గృహములయందుఁ గల, ఘనకేళికలను = అధికక్రీడలచే, ఉండన్=ఉండెడుకొఱకు, పనుచుటయున్=అంపుటను, ఆత్మస్వామి = తనకుఁగర్తయైన ధృతరాష్ట్రుఁడు, గణ్యుఁడు=ఆదరణీయుఁడు, అనుటను, నిజోచితియున్ = ధార్మికుఁడైన తనకు నుచిత మాటను, గణించి, భ్రాతృయుతముగాన్ = భీమార్జుననకులసహదేవసహితముగా, వంశరత్నమైన, అమ్మన్=కుంతిని, కొంచున్=తోడ్కొంచు, రాజాన్వయముని=రాజర్షి, సమవర్తితనయుఁడు=ధర్మజుఁడు, జనకుఁడేలుపురమునకున్ = పాండురాజేలినవారణావతపట్టణమునకు, పాండురాజు వారణావతము నేలినవాఁడని భారతమందున్నది గనుక, అరాళ గతివాసి = విచారపడక, సరళసరణిన్ = ఋజువర్తనచే, అరిగెను.

తే. పరమమునియతివశతమన్యురతిహేతు
వున మహాశాపహతిఁ జేసి తనువికృతిగ
నున్న నేల యంత వచింపనొగి నరు దని
తత్కథల్ రుచిగొనుచు రాట్తనయులందు. 37

భా. నియతివశత=దైవాధీనత, పరమము = అలంఘ్యమనుట, మన్యు=శోకమును, రతి=వేడుకయుననెడి, హేతువునన్ = కారణముచేతను, మహాశా = పేరాసయొక్క, అపహతిఁజేసి=వ్యర్థతఁజేసియుండియు, తనువికృతిగన్=దేహవైవర్ణ్యముగా, ఉన్నన్ = ఉండినను, ఏల = ఏమిటికి, అరుదని = ఆశ్చర్యమని, అంత వచింపఁగా, అందున్ = ఆమార్గమందు, తత్కథల్ = ఆధర్మరాజుకథలను, రుచిగొనుచున్ = ఆదరింపుచు, రాట్తనయులు = రాజకుమారులు, అరుగునప్పుడని ముందరిపద్యమున కన్వయము.

రా. పరమముని = గౌతమునియొక్క, అతివ = అహల్య, శతమన్యు=ఇంద్రుని యొక్క, రతిహేతువున శాపహతిఁజేసి, తనువికృతిగనున్న=దేహవికారతఁ జెందియున్న, నేల = భూమి, అంత వచింపన్ = అంతటఁ జెప్పఁగా, రాట్తనయులు, అందున్ = ఆభూమియందు, తత్కథల్ = ఆవిశ్వామిత్రుఁడు చెప్పినయహల్యాజారతాప్రసంగములను, రుచిగొనుచు.

సీ. ఆలీల నలరుచు నరుగునప్పుడు తత్పు
రస్ఫూర్తి మిగులఁ జిత్రంబొనర్చ
రమణీయమైనయారామపాదపరాగ
మాశాపవారణ మాచరింప
నాయతివసుశోభ నాకృతియును సర
సీకృతమానస హ్రీకలనయు
ఘనవరత్న కాంచనధామశోభన
వన్యాభరణవైభవస్ఫురితయు
ఆ. విపులతరపయోధరపదవ్యతిక్రమ
కరనవాంశుకాంతవరణనిరతి
శయసమున్నతియును నయి వారలందఱు
గౌరవమునఁ దన్నుఁ గనుఁగొనంగ. 38

రా. అప్పుడు, తత్=వారియొక్క, పురః=ముందట, స్ఫూర్తిన్ = ప్రకాశించుట చేత, ఆరామపాదపరాగము శాపవారణము నాచరింపఁగా, ఆయతివ = అహల్య, సరసీకృతమానసహ్రీకలనయున్ = పచ్చిగాఁ జేయఁబడినమనోలజ్జాస్థితిగలది, రత్నముల యొక్కయు, కాంచన = బంగారుయొక్కయు, ధామ = కాంతివంటికాంతిగలది, పద్మరాగనాత్తికచ్ఛాయగల యధరదంతములును సువర్ణచ్ఛాయగలదేహమును గలది, శోభనములైన, వన్య = వనభవములైన నారచీరలు మొదలయిన, ఆభరణ = అలంకారముయొక్క, "అలంకారస్త్వాభరణ" మని అ. వైభవముచేత స్ఫురితయు, "సరసిజమనువిద్ధం,శైవలేనాపిరమ్యం మలినమపి హిమాంశోర్లక్ష్మలక్ష్మీం తనోతి,ఇయమపిచమనోజ్ఞా

వల్కలేనాపి తన్వీ కిమివహి మధురాణాం మండనం నాకృతీనా" మ్మని కాళిదాసును శాకుంతలమందుఁ జెప్పినాఁడుగనుక, పయోధరపదవ్యతిక్రమకర=కుచస్థలాతిక్రమమును జేయుచున్న - జాఱుచున్నదనుట, నవ=మనోహరమైన, అంశుకాంత = పైఁటయొక్క, వరణ = కప్పుటయందు, నిరతి = ఆసక్తిగల, శయ = హస్తములయొక్క, "పంచశాఖ శ్శయః పాణిః" అని అ. సమున్నతియును = ఉపచారముగలదియు, ఐ, చిత్రం బొనర్చెనని క్రిందటి కన్వయము.

భా. అలరుచుఁ = వికారరహితుఁడై, తత్పుర = ఆవారణాపతముయొక్క, స్ఫూర్తి, ఆరామ=ఉద్యానవనములయందున్న, పాదప = వృక్షములయొక్క, రాగము = వర్ణము, "రాగోనురక్తౌ మాత్సర్యే క్లేశాదౌ లోహితాదిషు" అని వి. ఆశా = దిక్కుల యొక్క, అపవారణము = ఆచ్ఛాదనమును, "అంతర్ధిరపవారణ" మని అ. ఆచరింప, ఆయతి=ఉత్తరకాలఫలముచేతను, వసు = ద్రవ్యములచేతను, శోభనాకృతియు, సరసీ = కొలంకులచేత, కృతమైన, మానస = మానససరస్సుయొక్క, హ్రీకలనయుఁ = లజ్జాస్థితి గలదియు, రత్నకాంచనములయొక్క, ధామ = గృహముయొక్క, శోభఁ = శృంగారముచేత, అవని = భూమికి, ఆభరణములైన వైభవములచేత, స్ఫురితయుఁ, పయోధర పదవీ = మేఘమార్గముయొక్క, అతిక్రమమును, కర=చేయుచున్న, నవాంశువులచేత, కాంత=మనోహరమైన, వరణ=కోటయొక్క, నిరతిశయ, సమున్నతియుఁ = ఔన్నత్యముగలదియుఁ, ఐ, పురస్ఫూర్తిచిత్రంబొనర్చెనని యన్వయము.

తే. హరిపురాభోగవార్తపెంపపుడు వారి
మదిఁ బొడమఁ దలపోసి రట్టిది యటంచుఁ
జెలువసంకోచవిభవవైచిత్రిఁ బరఁగఁ
బరఁగునా నగరంబు గన్పట్టఁజూచి. 39

భా. చెలువు = ఒప్పిదము, పరఁగ, ఆనగరంబునుజూచి, హరిపుర = అమరావతి యొక్క, ఆభోగ = విరివియొక్క, వార్తపెంపు మదిఁబొడమ, "సదృశాదృష్టచింతా ద్యాః స్మృతిబీజస్య బోధకాః" అను న్యాయముగనుక, అట్టిది = అమరావతివంటిది, అటంచుఁ దలపోసిరి.

రా. హరి=ఇంద్రునియొక్క, పురాభోగ = తొంటిసంభోగముయొక్క, వార్త పెంపు, వారి=రామాదులయొక్క, మదిఁబొడమఁగా, రట్టు = పరపురుషసంగతిపల్లనైన దూఱు, ఇది యటంచుఁ జెలువ, సంకోచవిభవ = మిక్కిలికొంకుచేతనైన, వైచిత్రిఁ = వింతలాగుచేత, పరఁగు = ప్రవర్తిల్లుచున్న, ఆన = ఆజ్ఞ, కన్పట్టఁజూచి, నుతిఁచేసిరని ముందటిపద్యమున కన్వయము.

తే. అనిశశివవాస మైనపుణ్యపురమణివ
ఘాపహస్మృతి వనుచు నాయపకలంక
మానసోత్కర్ష యుక్తులనూననుతులు
నేసి యందఱు తత్పురస్థితిని బరఁగ 40

రా. అనిశశివవాసమైన = నిరంతరశుభప్రదమైన, పుణ్యాపురమణివి = పుణ్యాంగనవు, అఘాపహస్మృతివి = పాపహరణమైన స్మరణగలదానవు, "అహల్యా ద్రౌపదీ సీతా" అని స్మృతిగనుక, అనుచు, ఆయప=ఆయమయొక్క, కలంక=కలఁక, మానక్ = మానునట్లుగా, సోత్కర్షయుక్తులచేత, ఊనక్ = మనస్సున స్థిరముగునట్లుగా, నుతులు సేసి, తత్ =ఆయహల్యయొక్క, పురస్థితినిబరఁగక్ =ముందరనుండఁగాను, జనిరి.

భా. శివవాసమైన = రుద్రనివాసమైన, పుణ్యపురమణివి, కాఁగా, అఘాపహస్మృతివి యనుచు, అపకలంక=నిష్కళంకమైన, మానస=హృదయముయొక్క-ఉత్కర్షతోడ, యుక్తులు=కూడినవారు పాండవులు, అనూననుతులు = అధికస్తోత్రములను, చేసి, తత్పురస్థితిని బరఁగక్=ఆపట్టణమున నుండఁగా.

క. చనునెడ శ్రీరాముఁడు పావనినవనిజరూపవైభవశ్రీ నుల్లం
బున నిడి దానవిచిత్రాతనురాగప్రౌఢి వచ్చి తనుఁ బైకొనఁగన్. 41

రా. శ్రీరాముఁడు, పావనిక్=పవిత్రమైనదాని, అవనిజ = సీతయొక్క, రూపవైభవశ్రీని, ఉల్లంబుననిడి, దానక్ = ఆమనస్సుననుంచుటచేత, విచిత్రమైన, అతనుని వల్లనైన, రాగప్రౌఢి = మోహాతిశయము, తనుఁబైకొనఁగా, అనుమతించెనని ముందరి పద్యమునఁ గ్రియ.

భా. శ్రీరాముఁడు = కాంతిచేత నొప్పెడువాఁడు, పావని = భీముఁడు, నవ, నిజ = స్వకీయమైన, శ్రీని, చిత్రమైనయతనురాగప్రౌఢిగలదైన, దానవి = హిడింబ, పైకొనఁగా.

సీ. ఆసమయమున నేమని చెప్ప నరుదెంచి
చూడ నద్భుతతమస్ఫూర్తియగుచుఁ
దజ్ఞాతియమితచేతఃకళంకుండు త
ద్గృహమేధితద్వేషమహిమ పేర్మి
ననలసముద్వృత్తిహారము గావింపంగ
నంచితానఘవిధిసంచితార్థ
సందర్శనుఁడు గామినిందనపెం పెల
ర్పంగఁ జేకొనియె నారాకొమరులు

తే. నతనియాదరక్రియ గాంచియవలఁ జనిరి
స్వీయగురుయుక్తముగఁ దద్విసృష్టు లగుచు
విదురజనదర్శితోచితవివరసరణి
నలఁత యెఱుఁగక దక్షిణానిలజధృతిని. 42

రా. ఆసమయమున, తత్=ఆశాపమోక్షప్రకారమును, జ్ఞ = ఎఱిఁగినవాఁడై, తద్గృహమేధి = ఆయహల్యాపతిగౌతముఁడు, చూడనద్భుతతమస్ఫూర్తియగుచున్ = చూడరానితేజస్సుగలవాఁ డౌచును, అనలస=అధికమైన, ముత్=సంతోషముయొక్క, "ముత్ప్రీతిః ప్రమదో హర్షః" అని అ. వృత్తి, తత్ = ఆయహల్యయందుఁగల, ద్వేష మహిమపేర్మి నిహతముగావింపఁగా, అంచిత = పూజితమైన, అనఘువిధిచేత, సంచిత = సంపాదింపఁబడిన, అర్థసందర్శనుఁడు=తత్త్వజ్ఞానముగలవాఁడు, "అర్థోఽభిధేయరైవస్తు ప్రయోజననివృత్తిషు" అని అ. "దర్శనం నయనస్వప్నబుద్ధిధర్మోపలబ్ధిషు" అని వి. కామినిన్=అహల్యను, చేకొనియెను, రాకొమరులు=రామలక్ష్మణులును, అతని = గౌతమునియొక్క, ఆదరక్రియ = ఆదరణను, కాంచి, స్వీయగురుయుక్తముగన్ = విశ్వామిత్రునితోఁగూడ, తత్ = ఆగౌతమునిచేత, విసృష్టులగుచు, దక్షిణానిలమువల్ల, జ= పుట్టిన, ధృతిన్=సంతోషముచేత, అలఁతయెఱుఁగక, విదురజన=నెళవరులచేత, "జ్ఞాతాతు విదురో విందః" అని అ. దర్శిత=చూపఁబడిన, ఉచితమైన, వి=విశేషించిన, వివర రణిన్=మంచిత్రోవయందు, చనిరి.

భా. ఎంచిచూడనరుదు, ఇది కవివాక్యము. అమితచేతఃకళంకుఁడు, తత్ = ఆ ధర్మజునియొక్క, జ్ఞాతి=దుర్యోధనుఁడు, అద్భుతమైన తమోగుణముయొక్క, స్ఫూర్తి= ఉద్రేకము గలవాఁడు, అగుచు, తత్ = ఆధర్మజునియొక్క, గృహమును, ఏధిత = వృద్ధిఁబొందిన, ద్వేషమహిమయొక్క, పేర్మిన్=ఆధిక్యముచేత, అనల = అగ్నియొక్క, సముద్వృత్తిన్ = దరికొల్పుటచేత, హతముగావింపంగ, అంచి = ఒకమనుష్యుని ననిపి, తాను, అఘువిధిన్ = పాపపువిధిచేత - అగ్రహదాహవిధిచేతననుట, సంచిత= సంపాదింపఁబడిన, అర్థసందర్శనుండు = ప్రయోజనప్రాప్తిగలవాఁడు, కామిన్=కాఱుం డుటచేత, నిందన = అపకీర్తినే, చేకొనియెను, తద్విసృష్టులగుచున్ = ఆయగ్నిభయము చేత విడువఁబడ్డవారై - అగ్నిభయమును దప్పించుకొన్నవారైయనుట, విదురునియొక్క, జన=దూతచేత, దర్శితమైన, వివరసరణిన్ = బిలమార్గమున, "సుషిరం వివరం బిల"మని అ. దక్షిణ=సమర్థుఁడైన, "దక్షిణస్సరళోదారపరచ్ఛందానువృత్తిషు" అని వి. అనిలజ= భీమునియొక్క, ధృతిన్=ధారణముచేత, ఆరాకొమరులు=పాండవులు, అతని=దుర్యోధ నునివల్లనైన, ఆ, దర=భయముయొక్క, "దరోఽస్త్రియాం భయే శ్వభ్రే" అని అ. క్రియను, కాంచి = ఎంచి, స్వీయగురుయుక్తముగన్ = తమతల్లితోఁగూడ, ఆవలచే కొనియె నని ముందరిపద్యమునఁ గ్రియ.

ఆ. తొడగి యపుడు దాని తోఁబుట్టుగురుతర
సంగరసముదీర్ణ సరణిఁ బరఁగ
వాని నంత గెలిచి స్వగురుకథాదర
మమరఁ బ్రమదయుక్తి కనుమతించె. 43

భా. దానితోఁబుట్టుగు=హిడింబుఁడు, ఉరుతర, సంగర=యుద్ధమందు, పరఁగ వానిఁ గెలిచి, స్వగురుకథా = కుంతిధర్మజులమాటమీఁదనైన, ప్రమదయుక్తికి = హిడింబా సంయోగమునకు, అనుమతించెను.

రా. దానితోఁబుట్టు = రాగప్రౌఢితోఁగూడఁబుట్టునట్టి, గురుతర, సంగరసము = ఆపేక్ష, ఉదీర్ణసరణిఁబరఁగ, వానిన్ = ఆమన్మథరాగసంగవాంఛలను, గెలిచి=అణఁచి, స్వగురుకథా = విశ్వామిత్రుని గంగాసంభవాదికథలయందుఁగల, ఆదరము, అమరఁగా, ప్రమద=సంతోషముయొక్క, యుక్తికి ననుమతించెను.

వ. అంత. 44

తే. ఉరుగుణాద్భుతజనకసుతోదయమహి
మాతిశయము సాధించి పుణ్యజన కాంత
సుగుణ యనిపించుకొనిన భాసురపురమణిఁ
జూపుతగులు వహించె నుత్సుకత నతఁడు. 45

రా. ఉరుగుణాద్భుతుఁడైన జనకునికి, సుతా = కొమార్తెయైన సీతయొక్క, ఉదయ = పుట్టుటచేతనైన, మహిమాతిశయమును సాధించి, పుణ్యజన = సుజనులచేత, కాంత = మనోహరమైనది, భాసురపురమణిన్ = పురశ్రేష్ఠమైనమిథిలయందు, అతఁడు= రాముఁడు, చూపుతగులు వహించెను.

భా. ఉరుగుణుఁడైన యద్భుతజనకుఁడైన, సుత=ఘటోత్కచునియొక్క, పుణ్య జనకాంత=రాక్షసస్త్రీ హిడింబ, "యాతుధానః పుణ్యజనః" అని అ. అనిపించుకొనినన్= పోయినను, అతఁడు = భీముఁడు, భాసురపు, రమణిన్ = హిడింబయందు, చూపుతగులు వహించెను=అనురాగము నిలిపెను.

ఉ. అన్న గరంబు ప్రోది దన రారఁగఁ దమ్ములఁ గన్న తల్లి నా
సన్నుతఖేలనుండు వికసన్నయనైకవిలాసగౌరవా
భ్యున్నతిఁ దద్వనాంతమునఁ బ్రోచెఁ గడుం దనశ్రాంతి యాత్మలో
నన్నెఱయం గణింపఁడు మనస్థిరతన్ వివరించుపూనికన్. 46

భా. అన్న=ధర్మరాజు, కరంబు = మిక్కిలియు, తమ్ములను గన్నతల్లిని, ఆసన్నుత ఖేలనుండు=భీముఁడు, నయ=నీతియొక్క, నైక=ఉన్నతిచేత, ప్రోచెను=రక్షించెను. తన,

శ్రాంతి=అలమటను, ఆత్మలోనన్ = మనస్సునందు, నెఱయ, గణింపఁడు = ఎంచఁడు, పూనికన్=యత్నముచేత, మనస్థిరతన్=మనస్స్థైర్యమును, వివరించును, ఆయనపూనికఁ జూచినను మనస్స్థైర్య మేర్పడు చున్నదనుట.

రా. అన్నగరంబు=మిథిలాపురి, ప్రోదిఁదనరారఁగ, తమ్ములఁగన్నతల్లి నాన్=పద్మముల కుత్పత్తిస్థానమనఁగా, సన్నుత=వర్ణితమైన, ఖేలన్ = లీలచేత, ఉండు=ఉండెడి, వికసన్నయన=తెలికన్నులదియొక్క, ఏక=ముఖ్యమైన, విలాసగౌరవ=శృంగారాతిశయము యొక్క, అభ్యున్నతిచేత, తత్=ఆపట్టణముయొక్క, వనాంతమునన్=ఉద్యానవనమందు, ప్రోచెను. పద్మకాంతిగల నయనములచేతఁ బ్రోచెననఁగాఁ గటాక్షించె ననుట. లక్షణాప్రయోగము. "గిరానుజగ్రాహతరాంనరాధిపః" అని నైషధమందు. తన శ్రాంతిని, మనస్థిరతన్విన్=మనస్సున లగ్నమైన స్త్రీని సీతను, వరించుపూనికన్ = వివాహ మగు యత్నమున, శ్రాంతిని గణింపఁడని యన్వయము.

వ. అది యట్లుండె వారలందఱు తత్ప్రకారంబున విపినమార్గవర్తనంబు
నడపి యథోచితగమనంబున. 47

రెంటికి సరి - సులభము.

క. చనిరి పురసవిధమార్గం
బున సద్ద్విజలీలలు నడపుచు మాధుకరా
శన మొనఁగూర్చుచు నపుడుప
వనసంతతి యలరఁ జేసె వారలయాత్మన్. 48

రా. పుర = మిథిలయొక్క, సవిధ=సమీపమైన, "సదేశాభ్యాససవిధసమర్యాదస దేశవ"త్తని అ. మార్గమందుఁ జనిరి. అపుడు, సత్ = లెస్సైన, ద్విజ = పక్షులయొక్క, లీలలను, నడపుచున్=చేయుచును, మాధుకర=భ్రమరసంబంధమైన, "తస్యేద"మ్మని అణ్ప్రత్యయాంతము. అశనము=పూఁదేనెననుట, ఒనఁగూర్చుచు, ఉపవనసంతతి=ఉద్యానవపరంపర, వారల=రామాదులయొక్క, ఆత్మన్=మనస్సును అలరఁజేసెను.

భా. పుర=ఏకచక్రపురముయొక్క, ద్విజలీలలు=బ్రాహ్మణవేషములను మాధుకరాశనము=భైక్షమును, పవనసంతతి=భీముఁడు, కడమ సరి.

ఆ. అందుదారవృత్తి నందితానేకచ
క్రాగ్రహారహితవిహారమహిమఁ
బ్రచురసారసమద బకదర్పహారితఁ
దనరె సరసు లందఱును నుతింప. 49

భా. అందుఁ = ఆవర్తనలందు, ఉదారవృత్తినంది = సాహసవృత్తిని బొంది యనుట. తాను = భీముఁడు, ఏకచక్రాగ్రహారమునకు, హిత = ప్రియమైన, విహారమహిమచేత, ప్రచురసార = అధికబలముగల, "సారో బలే స్థిరాంశేచ" అని అ. సమద=గర్వసహితుఁడైన, బక=బకాసురునియొక్క, దర్పహారితఁ = గర్వాపహారిత్వముచేతఁ జంపుటచేత ననుట, సరసులు=రసికులు, నుతింపఁ దనరెను.

రా. అందుఁ = ఆపట్టణమందు, దారవృత్తి = భార్యావర్తనచేత, నందిత = సంతోషితములైన, అనేక చక్రవాకపక్షులయొక్క, కోకశ్చక్రశ్చక్రవాకః" అని అ. అగ్రహ = కోపముచేత, అరహిత = విరహితమైన, ఔత్సుక్యముగల దనుట, విహారమహిమఁ = సంచారాతిశయముచేతను, సారస = బెగ్గురులయొక్కయు, మదబకముల యొక్కయు, దర్ప=విశృంఖలసంచారముచేతనైన, హారితఁ = మనోహరత్వముచేతను, సరసులు=కొలఁకులు, ఈకారాంతము, తనరెను.

క. జననేత్రచిత్రదారుణ, వనజగతులనిశలసత్త్వవశత నడచుచోఁ
గన నరుదురమారూఢిం, దనరె జితాంగారపర్ణదర్పోదయతన్. 50

రా. ఇంకఁ బురవర్ణన, జననేత్రచిత్రద, అరుణవనజగతులు = కెందామరల ప్రకారములు, అనిశ = ఎల్లప్పుడు, లసత్త్వవశత = శోభావశత్వము, నడచుచోఁ = నడచెడిచోట నాపట్టణమందు, కననరుదు = చూడ నశక్యము, జిత = జయింపఁబడిన, అంగార=అగ్నిశకలములు గల, రక్తవర్ణములు గలవనుట, పర్ణ=రేకులయొక్క, దర్పోదయతఁ=గర్వోన్నతి గలపాటచేత, రమారూఢిఁ, లక్ష్మీప్రాప్తిచేత, తనరెను, అరుణపద్మములు నిత్యశోభావశత వర్తిల్లెడుపట్టున రమారూఢిచేఁ దనరినది గనుకఁ జూడ నద్భుతమనుట.

భా. జననేత్రములకుఁ జిత్రములును, దారుణ = భయంకరములు నైన, వనజగతులఁ = వనభూములయందు, "జగతీ రత్నగర్భా చ" అని అ. నిశలఁ=రాత్రుల యందు. సత్త్వవశతఁ = బలవంతుఁ డౌటచేత, నడచుచోఁ = నడిచెడునప్పుడు, కనఁ = చూచుటకు, నరుదురము=అర్జుననియుద్ధము, జితమైన యంగారపర్ణుఁ డనెడు గంధర్వునియొక్క యహంకారాతిశయము గల దౌటచేతఁ దనరెను.

వ. అంతట వారియంతరంగంబునందు. 51

క. వివిధద్విజాళిభూమా
నవరతసంశ్లాఘితస్వయంవరకల్యా
ణవిధివరద్రుపదసుతా
నవమంజులతాప్రవృత్తినడపెఁ గుతుకమున్. 52

భా. ద్విజాళి = బ్రాహ్మణసమూహములయొక్క, భూమ - బాహుళ్యముచేత, అనవరతమును సంశ్లాఘితమైన స్వయంవరమనెడు కల్యాణవిధిగల, ద్రుపదసుతా = ద్రౌపదియొక్క, నవ=నూతనమైన, మంజులతా = మనోహరత్వముయొక్క, ప్రవృత్తి = వృత్తాంతము, కుతుకమును నడపెను.

రా. వివిధద్విజాళి = పక్షిసమూహములయొక్క, భూమ = బాహుళ్యముచేత, సంశ్లాఘితమైన స్వయంవరకల్యాణవిధిచేత, పర = వరులైన, ద్రు=వృక్షములు, "ద్రు ద్రుమాగమాః" అని అ. పద స్థానముగాఁ గలవియునైన, సుతానవ=మంచికోమలత్వము గల, మంజులతా=రమ్యలతలయొక్క, ప్రవృత్తి, కుతుకమును నడపెన్ = సంతోషమును జేసెను, తీఁగెలు తమంతనె చెట్లఁ బ్రాకినను స్వయంవరమున వరించినట్లుంబలె నుండె ననుట, ద్విజశబ్దమున బ్రాహ్మణధ్వని, ఆవృక్షములఁజూచి వివాహాపేక్ష గల రాముఁడు సంతోషించె నని భావము.

శా. అంతన్ వారలు రామభద్రుపదరాజ్యారూఢిచే నెంతయుం
జింతాతీతవిశేషులై ప్రబలలక్ష్మిన్మించుచంచద్ఘనో
పాంతం దత్పురి గూఢరాజపదవిప్రాకారరేఖన్ శుచి
స్వాంతుల్ సేరిరి తత్పురోహితముఖవ్యాక్షప్తసన్మానులై. 53

రా. వారలు = విశ్వామిత్రాదులు, రామభద్రు = రామునియొక్క, పదరాజి = పాదవిన్యాసపంక్తియొక్క, ఆరూఢిచేన్ = ప్రాప్తిచేత, చింతా=భావనను, అతీత = అతిక్రమించిన, స్యాచ్చింతా స్మృతిరాధ్యాన" మని అ. విశేషులై = వింతగుణములు గలవారై, ప్రబలన్ = ప్రబలునట్లుగా, భావింపశక్యముగాని శృంగారములఁ దగునట్టుగా ననుట, లక్ష్మిన్మించు, గూఢ==ఆవృతమైన, రాజపదవి = చంద్రమార్గముల, రఘువంశ మందు "వైదేహిబంధోర్హృదయం. విదద్రే" అన్నట్లు, ప్రాకారశ్రేణిగలయని, తత్పురిన్ = ఆమిథిలను, తత్ = ఆపట్టణమందున్న, పురోహితుఁడు మొదలైనవారిచేత వ్యాక్షప్తసన్మానులై చేరిరి, జనకునిపురోహితామాత్యు లెదురుగావచ్చి తోడుకొని పోఁగాఁ బోయిరనుట.

భా. రామ = రమ్యమైన, భ = కాంతిగల, "స్త్రియాం పుంవద్భాషిత" అను సూత్రమునఁ బుంవద్భావము. ద్రుపదునియొక్క, రాజ్యముయొక్క యారూఢిచేన్ = రాజత్వప్రాప్తిచేత, చింతాతీత, విశేషులై = తాత్కాలికావస్థగలవారై, "విశేషః కాలికో వస్థా" అని అ. ప్రబలలక్ష్మిన్ = ఉత్కృష్టబలములయొక్క యతిశయముచేత, తత్పురిన్=ఆద్రుపదునిపట్టణమును, గూఢమైన, రాజపద = రాజచిహ్నముగల, "పదం వ్యవసితత్రాణస్థానలక్ష్మాంఘ్రివస్తుషు" అని అ. విప్రాకారరేఖన్=బ్రాహ్మణాకృతిచేత సౌందర్య లీలచేత, శుచిస్వాంతులు? వారలు = ధర్మరాజాదులు, తత్ = అలాగు ప్రసిద్ధ

లయిన, పురః = ముందటికి, హిత = శ్రేయస్కరములైన, ముఖ సంచారములు గల, "ముఖం నిస్సరణేవక్త్రే ప్రారంభోదయయోరపి" అని వి. వి=పక్షులచేత, "వినిర్విఘ్నే చటు పక్షిణి" అని వైజయంతి. ఆక్లిష్ట = మిక్కిలిఁ జేయబడ్డ, సన్మానులై = బహుమానము గలవారై "మానశ్చిత్తసమున్నతిః" అని అ. మంచిశకునము లవుచు నుండఁగా ననుట, చేరిరి. తచ్ఛబ్దము ప్రసిద్ధవాచకమైనందువు, "అనుభవతి శచీత్థం సా ఘృతాచీముఖాభిః" అని నైషధమందు.

ఆ. అందుఁ దన్నృపాలుఁడాత్మజ కిది యుంకు
వంచు నెక్కిడనియమించినట్టి
కార్ముకోత్తమమునుఘనమైనమూర్తిల
క్ష్యంబు సూచి రాన్నృపాత్మభవులు. 54

భా. అందుఁ = పట్టణమందు, ఘనమైన, మైనమూర్తి = మీనసంబంధమైన యాకృతిగల, లక్ష్యంబు = గుఱిని - మత్స్యయంత్రము ననుట, కడమ సులభము.

రా. ఘనమైన, మూర్తి = కాఠిన్యముచేత, "మూర్తిః = కాఠిన్యకాయయోః" అని అ. లక్ష్యంబు = చూడఁదగినదాని, వింటికి విశేషణము, చూచిరి.

వ. అటమున్న సకలదిగ్దేశాగతులైన రాజకుమారులు నిజశక్తితారతమ్యంబునం జేసి దర్శన స్పర్శనచాలనోచ్చాలనాదివ్యాపారపారాహంకారులగుచు శిథిలప్రయత్నులయి తొలంగిపోవం జేవ మిగులు నమ్మహాకోదండంబు గనుంగొనునప్పుడు వారలందు. 55

రా. వ్యాపారములు పారముగాఁ గలయహంకారము గలవారై, వారలందుఁ= రామలక్ష్మణులందు, భారతార్థమునకును నీలాగునే.

చ. అనుపమదివ్యవిక్రమసమగ్రుఁడు రామవిభుండు జిష్ణుఁ డా
యనితరభేద్యరౌద్రధనువశ్రమభంగిగ వంచి బాహులీ
ల నెరసె నభ్రగానిమిషలక్షహృదంబకవృత్తి నుర్వరా
జనహృదయాక్షివర్తనముఁ జాలఁగ నద్భుతవార్ధి ముంచుచున్. 56

రా. జిష్ణుఁడు = జయశీలుఁడు, రామవిభుండు, రౌద్ర = రుద్రసంబంధమైన, ధనువును, ఉకారాంతము. "సోయం ధనుర్జనివక్త్రః" అని నైషధమందుఁ బ్రయోగము. అశ్రమ = అనాయాసముననే, భంగిగఁ=భంగము గలదానిఁగా, వంచి=విఱిచియనుట, అభ్రగ = గగనచరులైన, అనిమిష = దేవతలయొక్క, లక్ష=లక్షసంఖ్యల యొక్క, హృదంబకవృత్తిఁ = హృదయముయొక్కయుఁ గన్నులయొక్కయువ్యాపారమును, అద్భుతవార్ధిని ముంచుచును బాహులీలల నెరపెను.

భా. అభ్రగ = ఆకాశమందుఁ జరించుచున్న, అనిమిష=మత్స్యమనెడి, "సురమత్స్యావనిమిషౌ" అని అ. లక్ష = గుఱిని, "లక్ష్యం లక్షం శరవ్యం చ" అని అ. హృత్ =హరించునట్టి, అంబక=బాణముయొక్క, "అంబకం నేత్రశరయోః" అని వై. వృత్తిక్ = వర్తనచేత - ప్రయోగముచేత ననుట, కడమసరి.

చ. ఉదుటున నట్లు తన్మహిపుఁడొడ్డినయొడ్డు జయించి యేమనం
దదసహకర్ణశల్యసముదగ్రతరప్రధనాశ్రితాధికా
భ్యుదయతఁ జెందె భీమభుజపుష్టిసహాయతఁ దజ్జయార్థులై
కదిసి సమస్తభూపతులుగైకొని రంతకమున్న భంగమున్. 57

భా. అట్లు తన్మహిపుఁడు = ద్రుపదుఁడు, ఒడ్డిన, ఒడ్డు=పందెమును, జయించి, తత్ = ఆజయమును, అసహ = సహింపని, కర్ణశల్యులతోడనగు సముదగ్రతరమైన, ప్రధన = యుద్ధమందు, "ప్రధనం ప్రవిదారణ" మని అ. అధికాభ్యుదయతను = ఉచ్ఛ్రియమును, భీమ = భీమునియొక్క, భుజపుష్టిసహాయతవలనఁ జెందెను, తత్ = ఆయర్జునునియొక్క, జయార్థులై భూపతులు, అంతకమున్న = ఆకర్ణశల్యులయుద్ధముకంటెముందే, భంగముక్ = అపజయమును, కైకొనిరి.

రా. తత్ = ఆవిల్లు విఱుచుటవల్ల, అసహ = ఓర్వనివారియొక్క, కర్ణములకు శల్యమైన, ప్రథక్=ఖ్యాతిచేత, "ప్రథాఖ్యాతౌ" యని యమరసంకీర్ణవర్గులో ఆశ్రితాధిక, అభ్యుదయత = అభ్యుదయముననుట, భీమ=భయంకరమైన, తత్ =ఆవింటియొక్క, కడమ సరి.

ఆ. అతఁడు వీర్యశుల్కయగు రాజసుత నట్లు
దనదుసొమ్ముఁ జేసికొని భృశప్ర
కాశితాత్మవంశుఁడై శోభిలెను మామ
కసదృశప్రమోదమావహిల్ల. 58

రా. అతఁడు = రాముఁడు, వీర్యశుల్కయగు=పరాక్రమమే యుంకువగాఁగల "శుల్కస్త్రీధనేపిచ" అని అ. భృశప్రకాశిత, ఆత్మవంశుఁడై, తనవంశమునకు ఖ్యాతిఁ దెచ్చినవాఁడై శోభిలెను.

భా. అతఁడు=అర్జునుఁడు, భృశ=మిక్కిలియు, ప్రకాశిత = తెలుపఁబడిన, తామును దమవంశమును గలవాఁడై, శోభిలెను.

సీ. అసమానపాండుకీర్తిసమృద్ధిజనకుండు
ధర్మరాజీడితకర్మపరుఁడు
స్వజననియుక్తియు వరగుణవ్యాసము
నీశ్వరాజ్ఞయుఁ దనహృదయగతియు

నేకమై తనుఁ జాల నెచ్చరింప నిజాను
    జులసన్మతిని బిల్చి తెలియఁ జెప్పి
తమకు నందఱకు నుదారభావంబున
    నాచరింపఁగ బాత్ర మగుట యరసి
తే. యునికి నపు డాసుబాహుజ యోపశోభి
తమ్ము లైనకుమారరత్నములకాభు
జద్రవిణశుల్క యనుజల జాతబాంధ
వరుచిఘనహృదబ్జామోద గరిమ నొసఁగె. 59

భా. పాండు = పాండురాజుయొక్క, కీర్తిసమృద్ధికి, జనకుండు=ఉత్పత్తిస్థానమైన వాఁడు, ధర్మరాజు, ఈడిత = స్తోత్రముచేయఁబడిన, "ఈడిత శస్త పణాయిత పనాయిత ప్రణుత ప్రణిత పనితాని" అని అ. కర్మ=ప్రయోజనములయందు, పరుఁడు, స్వజనని = కుంతియొక్క, ఉక్తియున్ = వాక్యమును, వరగుణుండైన వ్యాసమునీశ్వరునియొక్క యాజ్ఞయును, ఎచ్చరింప, నిజానుజులన్=భీమాదులను, తమకు నందఱకును=అయిదుగురికిని, దారభావంబునన్=భార్యాత్వముచేత, ఆ, సుబాహుజయోపశోభితమ్ములైన=భుజశౌర్యశోభితులైన, కుమారరత్నములకు, రత్నశబ్దమునకు విశేషణము గనుక శోభితశబ్దము నపుంసకము, అభుజద్రవిణశుల్క యను = భుజసత్త్వమే=యుంకువగాఁగలద్రౌపదీయనెడి, "ద్రవిణంతురో బలశౌర్యాణి" అని అ. జలజాతబాంధవరుచి=సూర్యదీప్తి, హృత్=హృదయములనెడి, అబ్జ=తామరలకు, ఆమోద=హర్షమనెడిసౌరభ్యముయొక్క. శ్లిష్టరూపకము. "అమోదో హర్షగంధయోః" అని వి. గరిమన్=అతిశయమును, ఒసఁగెను.

రా. అసమానమై, పాండు=శుభ్రమైన, కీర్తి సమృద్ధి గలవాఁడు, జనకుండు, ధర్మరాజి=ధర్మపంక్తిచేత, ఈడిత = స్తోత్రముచేయఁబడిన, స్వజన = తనయాప్తజనులయొక్క, నియుక్తియున్=నియోగమును, వర=వరులయొక్క, గుణవ్యాసము = గుణవిస్తారమును, "విస్తారో విగ్రహో వ్యాసః" అని అ. "శ్రితోరుర్వ్యాసోమహాభారతసర్గయోగ్యః" అని నైషధప్రయోగము. ఈశ్వరాజ్ఞయు, నిజానుజున్=తనతమ్ముఁడైనకుశధ్వజుని, ఉదారభావంబునన్=మహత్త్వముచేత, సుబాహు=సుబాహుఁడనురాక్షసునియొక్క, జయముచేత, ఉపశోభి=ప్రకాశించెడు రామునియొక్క, తమ్ములయిన కుమారరత్నములకున్ = లక్ష్మణభరతశత్రుఘ్నులకు, ఆ, భుజద్రవిణశుల్క=సీతయొక్క, అనుజలన్ = చెల్లెండ్రైనయూర్మిళామాండవీశ్రుతకీర్తులను, జాత=పుట్టిన, బాంధవ=బంధుత్వమునందుఁగల, రుచిన్=అపేక్షచేత, "అభిషంగే స్పృహాయాంచ

గభస్తౌ చరుచిస్త్రీస్త్రియా" మ్మని అ. ఘనహృదబ్జా మోదగరిమచేతను నొసఁగెను, భరత శత్రుఘ్నులును సమీపమున లేకున్నను వారికి నిచ్చెదనని వెళ్లినాడె ననుట.

వ. అంతఁ దత్ప్రవృత్తి యాకర్ణించి. 60

క. తనయులు దాను నపుడు త
జ్జనకుం డరుదెంచి చూచు జనులకు ననుభా
వనిరూఢి మానితానం
తనవోత్సవముగ నొనర్చెఁ దత్పరిణయమున్. 61

రా. తత్ = ఆకుమారరత్నములయొక్క, జనకుండు=దశరథుఁడు, తనయులు= భరతశత్రుఘ్నులును, అనుభావనిరూఢిన్ = ప్రభావమహిమచేత, మానితానంతనవోత్సవ మయియుండఁగా, తత్పరిణయమున్=ఆరామాదులవివాహమును. "తథాపరిణ యోద్వాహోపయామాః పాణిపీడన" మని అ. ఒనర్చెను.

భా. తత్ప్రవృత్తి=ఆధర్మరాజుయొక్క ప్రవర్తనను - పెండ్లియాడవలె ననెడి ప్రయత్నము ననుట, ఆకర్ణించి, తనయులు, ధృష్టద్యుమ్నాదులు, తత్ = ద్రౌపది యొక్క, జనకుండు=ద్రుపదుఁడు, అరుదు, ఎంచి చూచుజనులకు, అను=అరుదనెడి, భావనిరూఢి=తలఁపుయొక్క దార్ఢ్యమును. మాని=చాలించి, తాను, అంత.

వ. అందు 62

అందు=ఆవివాహమందు.

క. త్రిజగద్భూషణ మగుభూ,మిజనాదృతశీలఁ గృష్ణమృగనేత్రఁ బురం
ధ్రిజనులుగయిచేసిరి సొం,పుజనింపవివాహయోగ్యభూషావిధులన్.

భా. భూమిజనాదృతశీలను, కృష్ణన్ = ద్రౌపదిని, కడమ సులభము.

రా. భూమిజను = సీతను, ఆదృతశీలను, కృష్ణమృగనేత్రన్ = హరిణాక్షిని, పురంధ్రిజనులు=ముత్తైదువలు, పురంధ్రిశబ్ద మికారాంతమునకు, "పురంధ్రిభిశ్చక్రమశః ప్రయుక్త" మని కాళిదాసుప్రయోగము. కయిచేసిరి=అలంకరించిరి,

మహాస్రగ్ధర. లలనం బైనేసికాంతల్రమణగృహమహా
లక్ష్మివైయొప్పు మంచుం
గలితాశీర్వాద లైరక్కడమముగురుభా
గ్యస్థితుల్ మీఱ నీదృ
గ్బలవన్మాల్యాంగరాగా భరణవసనసౌ
భాగ్యలక్ష్మీకలై కాం
తలగత్సంసేవలందుం దలఁపు మనుచు ను
త్కంఠఁ బ్రాపించి రందున్. 64

రా. అక్కడమముగురు=ఊర్మిళామాండవీశ్రుతకీర్తులు, ఈదృక్ = ఈసీతాలంకారమువంటి, మాల్యాంగరాగాభరణవసనములయొక్క, సౌభాగ్యలక్ష్మీకలై = సౌభాగ్యాతిశయముగలవారై, కాంత = పతులయందు, లగత్ = తగిలిన, సంసేవలందుఁ= పతిసేవలందనుట, తలఁపు=కోరికను, మనుచు=పోషింపుచున్న, ఉత్కంఠనుబ్రాపించిరి= పతిసేవకు వేగిరించిరనుట.

భా. లలనంగై సేసి రమణులయొక్కగృహములకు, మహాలక్ష్మివై = ఒప్పిదమవై, ఉండుమంచుఁ గృతాశీర్వాదలైరి, ఆకాంతలసెడుమాట, అక్కడఁ = ఆపతిగృహములయందు, మముఁ=మమ్మును, గురుభాగ్య. ఈదృక్ = ఇప్పటిశృంగారమువలెనే, సౌభాగ్యలక్ష్మీకలా=సౌభాగ్యసంపత్సమృద్ధియొక్క, ఏకాంత = మిక్కిలియు, లగత్= తగిలిన-ఆసక్తిగలయట్టివనుట, సంసేవలందుఁ=అనుభవములయందును, ఫలితార్థము, ఇటువంటియలంకారములు ధరియించెడువేళ ననుట, తలఁపుమనుచు నుత్కంఠఁ బ్రాపించిరి.

వ. తద్వధూజనకుండును దత్కాలసముపస్థితం బైనవరసమాగమంబున కత్యంతసంతుష్టుం డగుచు ననంతవిభవసంపదలు వొదల నెదురుకోలు సేయించి తత్ప్రవేశోత్సవంబు నడపునప్పుడు. 65

రెంటికి సరి-సులభము.

సీ. నృపకన్యకలకనిందితనవభ్రమరకా
స్యవిలాసలక్ష్మీనిరస్తపూర్ణ
తారకాధిపతుల కారయఁ దత్పూర్వ
భవసంచితోరుతపఃఫలంబు
లేగురుశుభగుణభోగాంచితులు వీర
లీరీతిఁ దగఁ బతులై రటంచు
లోకరక్షణచతురాకారభాద్దివ్య
విమలతేజోవిలాస మిది యనుచు
తే. నర్థి నేతెంచి చూచెఁ బౌరాళి యత్యు
దారమణిభూషణోజ్వల దాశరథుల
మాంగలికవస్త్రరత్నభూషాంగరాగ
పాండుసూనులఁ గన్నులపండువుగను. 66

భా. అలకనిందితనవభ్రమరకు "అలకాశ్చూర్ణకుంతలాః" అని అ. ఆస్యవిలాసలక్ష్మీచేత, నిరస్త=తిరస్కరింపఁబడిన, తారకాధిపునియొక్క, తులకుఁ = సామ్యముగలదానికి, నృపకన్యకుఁ=ద్రౌపదికి, తత్పూర్వభవ = ఆద్రౌపది పూర్వజన్మమందు,

సంచిత=సంపాదింపఁబడిన, తపస్సుయొక్క-ఫలంబులు, ఏగురుపతులై రటంచును, చతుర=సమర్థములైన, ఆకారములను, భాక్ = పొందిన, దివ్య = ధర్మానిలశక్రాశ్విసులయొక్క, తేజః = అంశలయొక్క మణిభూషణములచేత, ఉజ్జ్వలత్ = ప్రకాశింపుచున్న, ఆశ=దిక్కులుగల, రథులక్ = రథములుగలవారిని, మాంగలిక = శుభార్థములైన, వస్త్రాదులుగల, పాండుసూనులక్=పాండవులను, కన్నులపండువుగఁ బౌరాళి యే తెంచి చూచెనని యన్వయము. ద్రౌపది పూర్వజన్మమందు నీశ్వరునిఁగూర్చి తపస్సుచేసి యైదు గురుపతులవేఁడెనని యాదిపర్వములో విస్తారముగాఁ జెప్పియున్నది.

రా. నృపకన్యకలకు, అనిందిత=నిందింపఁబడని, నవ, భ్రమరక = ముంగురులుగల, "తే లలాటే భ్రమరకాః" అని అ. ఆస్య = ముఖములయొక్క, విలాసలక్ష్మిచేత, నిరస్త=తిరస్కృతుఁడైన, పూర్ణతారకాధిపతిగలవారికి, లోక = భువనములయొక్క, "లోకస్తు భువనే జనే" అని అ, రక్షణార్థమైన, చతుః=నాలుగైన, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, దాశరథులక్=దశరథపుత్త్రులను, అంగరాగ = మైపూఁతలును, పాండు=ధవళములైన, సూనులక్=పుష్పములును గలవారిని, దాశరథులఁ బౌరాళి చూచెను.

చ. అలఘుతరాజవంశమణులై విలసిల్లెడునక్కుమారకుల్
నలుగురురూపవైభవకళల్ గడు మీఱుచు సద్గుణాతిశీ
తలచతురాకృతిన్ మెఱయు తజ్జనకాన్వయభాగ్యలక్ష్మి నా
నలరెడు పెండ్లికూఁతులసదాదర మొప్పఁగ నోలిఁ బెండ్లియై. 67

రా. అలఘుతర, అజ=అజునియొక్క, వంశమునకు, మణులై=అలంకారమైనవారై, విలసిల్లెడు, నలుగురు=రామలక్ష్మణభరతశత్రుఘ్నులు, చతుః=నాల్గైన, ఆకృతిన్=ఆకారములచేత, మెఱయు, తత్=ఆ, జనక=జనకునియొక్క, అన్వయభాగ్యలక్ష్మినా నలరెడు పెండ్లికూఁతుల - జనకునిభాగ్యలక్ష్మి నాలుగాకారములై యున్నవారి నని యుత్ప్రేక్ష. పెండ్లియై, అతులితానందమునఁ బేర్చిరి యని ముందరిపద్యములోఁ గ్రియ.

భా. అలఘుతక్ = అలఘుత్వమున, రాజవంశ=చంద్రవంశమునకు, "రాజా ప్రభౌ నృపే చంద్రే" అని వి. అక్కుమారకులు=పాండవులు, చతురాకృతిన్=మనోహరాకృతిచేత, నలు=నలునియొక్క, గురురూపవైభవకళలను, మీఱుచు, తత్=ఆద్రౌపదియొక్క, జనక, పెండ్లికూఁతు, లసదాదరమొప్పఁగ, కడమ సరి.

తే. అతులితానందమునఁ బేర్చి రంత విదుర
మంత్రిధృతరాష్ట్రుఁ డమ్మహామహులతండ్రి
వినిహతమనోవిచారుఁ డై తనదుపురికిఁ
గొడుకులవధూయుతముగఁ దోడ్కొంచు రాఁగ. 68

భా. విదురమంత్రి=విదురుఁడు మంత్రిగాఁగల, ధృతరాష్ట్రుఁడు, అంత=వివాహ వృత్తాంతమంతయు, విని, హృతమనోవిచారుఁడై, పాండవు లేమైరో యనువిచారమును విడిచి, తనదుపురికి, కొడుకులన్=ధర్మరాజాదులను, వధూయుతముగన్ = ద్రౌపదితోఁ గూడ, తోడ్కొంచురాఁగన్ = తోడితెచ్చుటకు, అనుప నని ముందరిపద్యమున కన్వయము.

రా. అంత, విదుర = వివేకులైన, "జ్ఞాతాతువిదురోవిందః" అని అ. మంత్రి = ప్రధానులచేత, ధృత = ధరింపఁబడిన, రాష్ట్రముగలవాఁడు, వినిహృతమనోవిచారుఁడై, పుత్త్రుల కనుకూలవివాహములాయెను గనుక, రాఁగన్=రాఁగా.

సీ. ప్రౌఢిఁ బేర్చినవారిభావ మెలర్పంగ
    ననుపశాంతాత్మత నరుగుదెంచి
రాకుమారులవైరిలోకాభిగమ్యభు
    జావిజృంభణగుణశ్లాఘనుండు
వీరునర్జునుఁ బరశూరులసత్ప్రతా
    పాన్వితభీమబాహాసహాయుఁ
డై యోర్చినట్టియాహవజయశోభిరా
    ముండని వేడ్కపెంపున వెదకుచుఁ
తే. బఱపె మిక్కిలిఁ జూడ్కులందఱిని గడచి
యవల దాశరథిశ్రేష్ఠుఁ డైనయతని
పైఁ బురస్థితజనకదంబకముచిత్త
ములమహాదరసంభ్రమ మొలయ నపుడు. 69

రా. నవ = నూతనమైన, అరిభావము = శత్రుత్వము, ఎలర్పంగ, అనుపశాంత= శాంతముగాని, ఆత్మతన్ = బుద్ధిగలవాఁడౌటచేత, అరుగుదెంచి, రాకుమారులవైరి, శ్లాఘనముగలవాఁడు, అర్జునున్ = కార్తవీర్యార్జునుని, పరశు = గండ్రగొడ్డలిచేతనగు, ఉరు=అధికమైన, లసత్ప్రతాపముతోడ, అన్విత=కూడిన, బాహా = భుజములు, సహాయముగాఁగలవాఁడై, ఓర్చినట్టి=జయించిన, రాముండు=పరశురాముఁడు, అనిన్ = యుద్ధమందు, పురః=ముందట, స్థితజనకదంబకముయొక్క, చిత్తములను, మహా, దర=భయము వల్లనైన, సంభ్రమము=బెగడుట, ఒలయన్ = వర్తింపఁగా, అతనిపైన్ = రామునిపై, చూడ్కులఁ బఱపెను.

భా. ప్రౌఢిఁబేర్చినవారిని, అనుపన్ = అంపినను, ఆకుమారులరుగుదెంచిరి, ఆవైరిలోకాభిగమ్య = శత్రుజనమునకుఁ బొందరాని, భుజా = బాహువులయొక్క, "దోఃప్రవిష్టోభుజోబాహుర్భుజాసంకథ్యలేబుధైః" అని యా. విజృంభణగుణ,

శ్లాఘః=శ్లాఘనచేత, ఉందుపీరః=అర్జునుని, భీమ=భీమునియొక్క, బాహాసహాయుఁడై పరశూరులః=శత్రువీరులను, ఓర్చినట్టి, ఆహవజ = యుద్ధజన్యమైన, యశః=కీర్తిచేత, అభిరాముండు, అని వెదకుచు, అవలత్=చలింపని, ఆశః = అపేక్షచేత, పుర = పట్టణమందు, స్థితజనకదంబకము, కర్త.

వ. కనుంగొనుజనులు తదనంతరంబ. 70

సీ. ఎంతయు నద్భుతంబీ రామభార్గవ
రామలసత్ప్రౌఢి యేమిచెప్ప
బలవదనేకపతులనానుగుణ్యంబు
జగదుపశ్లోకితంబుగ భజించెఁ
గంటిరే యనువారు గడఁక నేతద్వర
పురుషు లన్యోన్యంబు నొరసి యెవ్వ
రెట్టు గాఁగలవారో యిటమీఁద ననుశంక
మదిఁ బెట్టువారు నక్కాఁదవలేల
తే. యొదవు మనభాగ్యమహిమ కయోనిజాత
మహితనయ కృష్ణమృగనేత్ర మంజుగాత్ర
యైదువతనంబుప్రోక మాయమ్మ యనుచు
సతికిఁ గేల్మోడ్చువారు నై సందడిలిరి. 71

భా. ఈరామ=ద్రౌపది, భార్గ=భర్గసంబంధమైన, వర=వరములయొక్క, అమల=నిర్మలమైన, సత్ప్రౌఢి = మహత్త్వమును, బలవత్ = బలవంతులైన, అనేకపతుః = అయిదుగురుభర్తలను, భజించెను. ఏతత్=ఈద్రౌపదియొక్క, వర=పతులైన, పురుషులు, అన్యోన్యంబునొరసి యెట్టుగాఁగలవారో, జనులు ద్రౌపదితో ననెడుమాట, మనభాగ్యమహిమకు నక్కాఁదవలేలయొదవు, మహితమైన, నయ=నీతిగలదానా, కృష్ణ = ద్రౌపదీ, అనుచు సందడిలిరి.

రా. ఈరామభార్గవరాముల, లసత్ప్రౌఢి, అనేకప=గజములయొక్క, "ద్విరదోనేకపోద్విపః" అని అ. తులః=సామ్యముచేత, ఏతత్=ఈ, వరపురుషులు, మహితనయ, కృష్ణమృగనేత్ర, కడమ సులభము.

వ. మఱియును. 72

చ. చనియెఁ బ్రశాంతమై యనలసత్వరహేతివిహారవృత్తిచే
తన యని వింటి మిట్టియతిధర్మ యమోదయు రాజమానశౌ

సనుఁ గొనివచ్చెఁ దానవరజస్స్ఫురణాఢ్యునిఁజేసి క్రమ్మఱన్
మనపృథగూఢభాగ్యమహిమస్థితి యిట్టిది వో విచిత్రముల్. 73

రా. అనలస=అమందమైన, త్వర=వేగముగల, హేతి=ఖడ్గముయొక్క, "రవే ర్రర్చిశ్చ శస్త్రం చ వహ్నిజ్వాలాచ హేతయః" అని అ. విహారమందు, వృత్తి=వర్తన గల, చేతన=బుద్ధి, "ప్రతిపజ్జ్ఞప్తిచేతనా" అని అ. ప్రశాంతమై చనియె నని వింటిమి. ఇట్టియతిధర్మున్ = మునిధర్మముగలవాని, యమోదయున్ = యమముయొక్క, యుదయము గలవాని, "శరీరసాధనాపేక్షం నిత్యం యత్కర్మ తద్యమః" అని అ. రాజమానశాసనున్ = క్షత్రియగర్వాపహారి యైనపరశురాముని, మన=మనయొక్క, పృథక్=వేఱువిధముగా, ఊఢ = వహింపఁబడిన, భాగ్యమహిమస్థితి, కర్త, క్రమ్మఱ, నవ=నూతనమైన, రజోగుణముయొక్క, స్ఫురణాఢ్యునిఁ జేసికొనివచ్చెను. అని యనేకు లనేకవాక్యములు వలుకనని ముందటిపద్యమున కన్వయము.

భా. గూఢమైన భాగ్యమహిమస్థితిగలది, మనపృథ = కుంతి, అనల = అగ్ని యొక్క, సత్వర=తీవ్రమైన, హేతి = జ్వాలలయొక్క, విహార, వృత్తిచేతన=వర్తన చేతనే, ప్రశాంతమై చనియెనని వింటిమి, అతిధర్ముని, యమోదయున్ = ధర్మజుని, రాజమాన = ప్రకాశింపుచున్న, అపరజ=తమ్ములయొక్క, "యవీయో వరజానుజాః" అని అ. స్ఫురణాఢ్యునిఁ జేసి క్రమ్మఱఁ దాను గొనివచ్చెను.

తే. అని యనేకు లనేకవాక్యములు వలుక
నట్లు చను దెంచినట్టి భీమాగ్రజన్ము
నిజపురస్థాయిగాఁ గాంచి నిఖిలలోకు
లును సముద్వేగవినతులై వినుతిసేయ. 74

భా. సముద్వేగ=సంతోషాతిశయముతోఁ గూడునట్టుగా.

రా. భీమ = భయంకరుఁడైన, అగ్రజన్మున్ = బ్రాహ్మణునిఁ బరశురాముని, "ద్విజాత్యగ్రజన్మభూదేవబాడబాః" అని అ. నిజపురః=తనముందట.

ఉ. పేర్మినివిగ్రహించినను భీమధనంజయలీలఁ బేర్చుత
ద్ధర్మజతేజ మాత్మజుప్రతాపసమృద్ధి నడంచు నంచు నం
తర్మనుఁడై మహీధవుఁడు తత్సమరాజ్యసమర్పణంబుఁ దా
నిర్మలవృత్తిఁ జేయుటయనీతిగ నెంచెఁ గడున్ మనంబునన్. 75

రా. ధనంజయ = అగ్నియొక్క, "వీతిహోత్రో ధనంజయః" అని అ. లీలఁ బేర్చు, తద్ధర్మజతేజము=ఆపరశురాముని వింటివలనఁబుట్టినశౌర్యము, అంతర్మనుఁడై = ఖిన్నమనస్కుఁడై, "దుర్మనా విమనా అంతర్మనాః" అని అ. మహీధవుఁడు = దశ

రఘుఁడు, తత్ = ఆరఘునాథునియొక్క, సమర=యుద్ధమనెడి, ఆజ్యముయొక్కసమర్పణంబుఁ జేయుట, యనీతిగ నెంచెను.

భా. భీమ=భీమునియొక్కయుఁ, ధనంజయ = అర్జునునియొక్కయు, ఆత్మజు= దుర్యోధనునియొక్క, మహీధవుఁడు=ధృతరాష్ట్రుఁడు, తత్=ఆధర్మజునకు, సమ, రాజ్యసమర్పణంబుఁ జేయుటయ, నీతిగ నెంచెను.

సీ. అ ట్లాత్మ నెంచినయర్ధరాజ్యమహిమ
తేజప్రదీప్తుఁ డా రాజు ప్రియము
తో నమర్చి యనుపమానసపర్యాప్తి
నెరపుచు నాదరోన్మేష మొప్ప
సప్రణతిగ నమ్మహీప్రభునానతి
గైకొని నిలక శీఘ్రంబ యరిగి
ప్రథితమహాచలేంద్రప్రస్థపుటభేద
నప్రభువై శిఖోగ్రప్రతాప
తే. కలితుఁ డురుదండనీతిభార్గవుఁడు నిజభు
జైకవశసర్వధరణిపార్థాధ్యుఁ డగుచు
నవరజస్థితిబంధురాజ్యవిరళరతిఁ
బొదలి యభిరామవర్తనంబునఁ జెలంగె. 76

భా. అర్ధరాజ్యమహిమను, అమర్చి=ఇచ్చియనుట, అనుపఁగా, మానసపర్యాప్తిక్ = మనఃపూర్తిని - సంతోషముననుట, సప్రణతిగక్ = నమస్కారసహితముగా, అమ్మహీప్రభుని = ఆధృతరాష్ట్రునియొక్క, ఆనతి = వాక్యమును, కైకొని, ప్రథిత = ప్రసిద్ధమైన, మహ=ఉత్సవములచేత, "మహఉద్ధవఉత్సవః" అని అ. అచల=స్థిరమైన, ఇంద్రప్రస్థమనెడి, పుటభేదన = పట్టణమునకు, "పట్టణం పుటభేదన" మని అ. ప్రభువై, శిఖా = జ్వాలభంగి, "అర్చిర్హేతిశ్శిఖాస్త్రియా" మ్మని అ. ఉగ్రమైన ప్రతాపముతోఁడ, కలితుఁడు = కూడినవాఁడు, ఉరుదండనీతియందు, భార్గవుఁడు = శుక్రునిఁబోలినవాఁడు, ధరణి = భూమిగలవాఁడు, పార్థాధ్యుఁడు = పృథాపుత్త్రజ్యేష్ఠుఁడు. అవరజస్థితిక్ = తమ్ములకూటమిచేతను, బంధురాజి = ఆత్మజనసహాయముయొక్క, అవిరళరతిక్=అధికానురాగముచేతను, చెలంగెను.

రా. అట్లాత్మ నెంచి, నయ=నీతిచేత, ఋద్ధ=వృద్ధిఁబొందింపఁబడిన, "అద్ధుణః" అని సూ. రాజ్యమహిమచేతను, తేజ = ప్రతాపముచేతను, ప్రదీప్తుఁడు, ఆరాజు = దశరథుఁడు, అనుపమాన = అసమానమైన, సపర్యాప్తిక్ = పూజావిధిని, సపర్యా తర్పణం బలిః అని అ. నెరపుచు, సప్రణతిగక్ = సప్రణతిసహితుఁడౌచు నుండఁగా-

ప్రణమిల్లుచుండఁగా ననుట, అమ్మహిప్రభునియొక్క, ఆనతి = ఆనమస్కారమును, కైకొని, నిలక = నిలువక, సేవాదులను జేకొనకయనుట, మహాచలేంద్ర=క్రౌంచ పర్వతముయొక్క, ప్రస్థ = చరిపట్టుయొక్క, "ప్రస్థోస్త్రీ సానుమానయోః" అని అ. పుట = బంధనముయొక్క, భేదనమందు, ప్రభు=సమర్థమైన, వైశిఖ=విశిఖసంబంధమైన, ఉగ్రప్రతాపముతోఁడ, కలితుఁడు, ఉరుదండనీతి, భార్గవుఁడు, నిజభుజైకవశము లైన, ధరణిప = భూపతులయొక్క, అర్థార్థ్యుఁడు, అర్థప్రాణముగలవాఁడు, నవ మైన, రజ = రజోగుణముయొక్క, స్థితిచేతను, బంధుర = సమర్థమైన, ఆజి=యుద్ధ మందుఁగల, అవిరళరతిచేతను, పొదలి, అభిరామ = రామునికెదురైన, వర్తనంబునఁ జెలంగెను.

వ. ఇట్లు ప్రవర్తిల్లుచుండ. 77

క. సత్యైక్యముకతమున వీ
రత్యంతము నిర్విభేదు లయ్యు నతనుమా
యాత్యాజితమైత్రీసా
తత్యతఁ దమలోనఁ బోరెదరొ యనుశంకన్. 78

రా. సత్య = యథార్థమైన, ఐక్యముకతమునన్=ఇద్దఱు నావిష్ణువునవతారము లైన నిమిత్తమున, వీరు = రామభార్గవరాములు, నిర్విభేదులయ్యును, అతనుమాయా= అధికమైన మాయచేత, త్యాజిత = విడిపింపఁబడిన, మైత్రియొక్క, సాతత్యతన్ = ఎడతెగమిగలవాఁ కౌటచేత, పోరెదరొ యనుశంకను, కయ్యంబుల వేడుకకాఁడు వచ్చెనని ముందటిపద్యములోఁ గ్రియ.

భా. సతీ = భార్యయొక్క, ఐక్యముకతమున, వీరు=పాండవులు, నిర్విభేదు లయ్యున్ = బెరకులేనివారయ్యును, అతనుమాయా = మన్మథమాయచేత.

క. కయ్యంబులవేడుకకాఁ, డయ్యున్నతకలహకేళికాకాంక్షుఁడై
నెయ్యమున వచ్చె నారదుఁ, డయ్యెడ దివినుండి వారినభిదర్శింపన్.

భా. కయ్యంబులవేడుకకాఁడయ్యున్ = యుద్ధాపేక్షగలవాఁడై యుండియు, నత = అణఁగినట్టి, కలహకేళికా = కలహక్రీడయందుల, ఆకాంక్షగలవాఁడై, పాండవులమీఁదిదయచేఁ గలహకాంక్ష విడిచి యనుట, దివినుండి=స్వర్గముననుండి, వారిన్ = పాండవులను, అభిదర్శింపన్ = చూచునిమిత్తమై, నారదుఁడు వచ్చెను.

రా. కయ్యంబులవేడుకకాఁడు, అయ్యున్నతకలహకేళికి, ఆకాంక్షుఁడై, వారిన్=రామభార్గవులను, చూచెడికొఱకు.

వ. అప్పుడు. 80

ఉత్సాహ. ఆనరాధిపతికుమారకాగ్రయాయి దమ్ములుం
దాను బరశుభాసమాన ధాముఁడైనమునికిఁ బెం
పూన నర్ఘ్యముఖ్యవిధుల నూనముగ నొనర్ప న
మ్మౌనివరుఁడు నవగణితసమస్తతదుపచారుఁడై. 81

రా. ఆనరాధిపతికుమారకాగ్రయాయి = దశరథునికి జ్యేష్ఠపుత్త్రుఁడైన రాముఁడు, పరశు = గండ్రగొడ్డలిచేత, భాసమాన=ఒప్పుచున్న, ధాముఁడైన=ప్రతాపము కలవాఁడైన, మునికిన్ = పరశురామునికనుట, అమ్మౌనివరుఁడును, అవగణిత=ఎంచఁబడని, తత్=ఆరామునిచేతనగు, ఉపచారములు గలవాఁడై.

భా. ఆనరాధిపతికుమారకాగ్రయాయి=ఆరాజకుమారశ్రేష్ఠుఁడైనధర్మరాజు, పరశుభాసమానధాముఁడైన = పరులకు శుభకరమై యసమానమైన తేజస్సు గలవాఁడైన, మునికిన్ = నారదునికి, అమ్మౌనివరుఁడు, నవ=క్రొత్తవునట్టుగా, గణిత=ఆదరింపఁబడిన, తత్=ఆపాండవులయొక్క, కడమ సరి.

వ. పదంపడి నిజభ్రూచలనదూరనిరస్తసమస్తజనుం డగుచు నతని నుపలక్షించి తదనుజసముక్షంబున. 82

క. అకళంకిత నిట్టనుఁ గొం
చక యేమీమనముసమరసముదారక్రీ
డకు నొండొరుమాఱ్కొనుట దొ
రకు నని వచ్చితి నెఱుంగ రావా కినుకల్ 83

రా. ఇట్టనుక్=పరశురాముఁడు రామునితో ననెడుమాట, ఏమీ, మనము= ఇద్దఱమును, సమర = యుద్ధమనెడి, క్రీడకు మాఱ్కొనుట దొరకునని కొంచక వచ్చితిని, కినుకలు = కలహోద్యోగములు, ఎఱుంగరావా=తెలియఁబడవా, భర్త్సనా వాక్యము.

భా. ఇట్టనుక్ = నారదుఁడనెడుమాట, ఏను, మీమనము = అన్నదమ్ములైన మీమనస్సు, దారక్రీడకుక్ = ద్రౌపదీసంభోగమునకు, సమరసము = సమానరాగమైనది, "శృంగారాదౌ రసే వీర్యే గుణే రాగే ద్రవే రసః" అని వి. అటుగనుక, ఒండొరు మాఱ్కొనుట = మీలోకలోకరితోఁ గలహించుట, దొరకుక్ = సంభవించును, అని, వచ్చితిక్ = ప్రతీకారము సేయవచ్చితి ననుట, ఎఱుంగరావు, ఆకినుకలు = ఆలాగుస్త్రీమూలమైన కోపములు, చెప్పినట్టు రావనుట.

క. చేతశ్చిత్రము గాదె స్వమాతతగుణసార్థసిద్ధిమద్రామమహా
ఖ్యాతిపతివ్రత యిట్లవిఘాతముగ ననేకభర్తృకత నడపు టిలన్.

భా. సమాతత=విస్తృతమైన, గుణసార్థ = గుణసమూహముయొక్క, "సంఘ సార్థా" అని అ. సిద్ధిమత్=సిద్ధిగల, రామ=రమణిద్రౌపది, మహాఖ్యాతి = అధికఖ్యాతి గలది, పతివ్రత, ఇట్లనిఘాతముగ, అనేకభర్తృకత=పెక్కండ్రుభర్తలు గలదౌటను, నడపుట, చేతఃచ్చిత్రముగాదె.

రా. సమాతతగుణముల చేత, సార్థసిద్ధి=అర్థసిద్ధిసహితమైనది, మత్=నాయొక్క, రామ=రాముఁడనెడి, మహాత్=అధికమైన, ఆఖ్యా=నామధేయమనెడి, అతిపతివ్రత, అనేకభర్తృకతన్=అనేకభర్తలు గలదౌటను, నడపుట = అసాధారణముగా నాయందుండెడి రామాఖ్య మఱియొకరియందుండుట, చిత్రముగాదె.

ఆ. ఇదియ నాకు మీకు నితరేతరద్వేష
హేతు వనుచుఁ దోఁచె నేకతన్వి
భూతి నెరపు నేను బుంవ్యక్తులకు నాలి
తనముతో సమాఖ్య మనుచు బెట్టు. 85

రా. ఇదియ=ఈరామశబ్దమే, నాకు మీకును ద్వేషహేతువనుచుఁ దోఁచెను, ఏకతన్=ముఖ్యత్వమున, విభూతి=ఐశ్వర్యమును, నెరపునేను, పుంవ్యక్తులకున్ = పురుషులకు, నాలితనముతోన్ = కొంచెపుతనముతో, సమాఖ్య = సమమైనయాఖ్యను, మనుచుబెట్టు, ఆఁడువారికి రామాఖ్యగాక నామందటఁ బురుషులకు నా యనుట.

భా. ఇదియ=ఏకపత్నీభోగము, మీ కన్యోన్యవైరమూలమనుచు నాకుఁదోఁచుచున్నది, ఏకతన్వి = ఏకమైనకాంత, భూతి నెరపు నేనుబుంవ్యక్తులకున్ = ఐశ్వర్యమును నెరపెడియయిదుగురు పురుషులకును, ఆలితనముతోన్=భార్యయయి, సమాఖ్యమనుచు బెట్టు=కీర్తిచెడకుండ నిర్వహించుటేలాగు.

చ. భవదుపయామకాలమునఁ బర్వినసుద్దులు విన్నవాఁడ నా
భవుపరధర్మ మట్టగుట భావములో నిడి మాకు శంక లె
య్యవి యని యుబ్బు టొప్ప దివి యావరశక్తికి లోనుగా వశ
క్యవిజయముల్ మదీరితమహాశరమణ్యవరుద్ధయుద్ధముల్. 86

భా. భవత్=మీయొక్క, ఉపయామకాలమునన్ = వివాహసమయమందు, పర్వినసుద్దులు = వ్యాసులుచెప్పిన పంచేంద్రోపాఖ్యానము మొదలయినవార్తలను, విన్నవాఁడను, ఆభవు=ఆయీశ్వరునియొక్క, పరధర్మము=పరమురీతి, అట్టగుట=అయిదుగురు పతులనిచ్చుటను, ఇవి=స్త్రీమూలములైన వైరములు, ఆవరశక్తికిన్ = ఈశ్వర వరమాహాత్మ్యమునకు, లోనుగావు, జగడాలుపుట్టకుండ వరము లేదనుట, అటుగనుకనే, అశక్యవిజయముల్ = జయింపరానియట్టివి, మత్=నాచేత, ఈరిత = పలుకఁబడిన, సుందోపసుందోపాఖ్యానమనుట, మహాశ=అధికసురతాపేక్షగల, రమణీ = స్త్రీలచేత,

అవరుద్ధ=నిలుపఁబడిన - కల్పింపఁబడినవనుట, యుద్ధము లశక్యవిజయములని యన్వయము.

రా. సాధవు=నాగురువైన యీశ్వరునియొక్క, వరధర్మము = దొడ్డవిల్లు, అట్టగుట=విఱువఁబడుటను, ఆవరశక్తికిన్ = ఆవిల్లువిఱిచిన సత్త్వమునకు, మత్ = నాచేత, ఈరిత=ప్రయోగింపఁబడిన, మహాశరమణి=మహాస్త్రశ్రేష్ఠములచేత, అవరుద్ధ=నిలుపఁబడ్డ - చేయఁబడ వనుట.

క. విను మంతపనులరాకకు
మునుపుఁగ వచ్చాంతిమార్గముం దెలిపెద నొం
డౌనరింపుము సమయము ధరఁ
గొనసాఁగి తనర్చెద మనుకోర్కి గలిగినన్. 87

రా. సమయము=నొవ్వము, ధరన్ = భూమియందు, కొనసాఁగితనర్చెదము= ఉత్తరోత్తరముగా నుండెదము, అనుకోర్కి=గలిగినను, ఒండు=ఒకటిని, ఒనరింపుమని క్రిందటి కన్వయము.

భా. ఒండు=ఒకటైన, సమయము=సంకేతమును, ఒనరింపుము.

చ. సమరసరూఢిమచ్చరితసాధ్వసమాకృతిఁ బర్వరాజస
త్త్వమదనిరాసివక్త్రమగువం దనధర్మము పూని కొల్వ నే
యు మనుము నీకుఁ దమ్ములకు నొక్కనియొక్కనియింట నేఁడు పూ
ర్ణముగ వసించి సొంపు లమరన్ సమయం బిటుసేయు టొప్పగున్.

భా. సమరసన్ = సమానరాగము గలదాని, రూఢిమచ్చరితను = ప్రసిద్ధిగల చరిత్రముగలదాని, సాధు=సుందరమునై, అసమ = సరిలేని ఆకృతిగలదాని, పర్వరాజ=పున్నమచందురునియొక్క, సత్త్వమద = చారుత్వగర్వమును, నిరాసివక్త్రన్ = తిరస్కరించెడు ముఖముగలదాని, మగువన్=ద్రౌపదిని, తనధర్మముఁపూని = పతివ్రతాధర్మముఁబూని, ఒక్కనియొక్కనియింటను, ఏఁడు = వత్సరము, పూర్ణముగ నమరఁ గొల్వ సేయుమనుము.

రా. సమర=యుద్ధమందు, సరూఢి=ప్రసిద్ధితోఁగూడిన, మత్ = నాయొక్క, చరిత=చరిత్రమువల్లనైన, సాధ్వసము=భయము, ఆకృతిఁబర్వన్ = ఆకారమునఁ గానరాఁగా, రాజసత్వ = రజోగుణముచేతనైన, మద = మదమును, నిరాసి = విడిచిన, వక్త్రమగు = ముఖముగల - ఆరంభముగలదైనయనుట. వందనధర్మముఁబూని కొలువ సేయుఁము, మనుమః=బ్రతుకుము, నీకుఁదమ్ములకు నొక్కనియొక్కనియింట, నేఁడు= ఈప్రొద్దు, నేఁడనియర్థబిందువున్నందుకు, ఉ. 'వాఁడిమయూఖము ల్గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువు, ల్నేఁ డిట వచ్చె' నని నన్నయభట్టు ప్రయోగము. సొం

పులు = విలాసములు, అమరన్ = అమరుటకు, సమయంబు=వేళ, ఇటు సేయుటొప్పగున్ = వందనము సేయునది మేలు.

వ. మఱియు నొక్కనియమం బెఱింగించెద. 89

క. విను రామ యొరుని శాంతం
బున సేవయొనర్చుకాలమున నెవ్వఁడు దాఁ
జను దండకార్యగతి నా
యన వర్షాచరితతీర్థయాత్రుఁడుగఁ దగున్. 90

రా. రామ = సంబుద్ధి, శాంతంబునన్ = శాంతిచేత, "కర్తరిక్తః" సేవ యొనర్చుకాలమున, ఒరుని, దండకార్యగతిన్ = దండోపాయమున, ఎవ్వఁడు, చనున్ = ప్రవర్తించును, ఆయన, వర్ష=వర్షాకాలమందు, ఆచరిత=చేయఁబడిన, తీర్థయాత్రగలవాఁడు గాఁదగును. "వర్షాకాలే ప్రయాణ" మ్మని యతిక్లేశము గనుక.

భా. రామ = ద్రౌపది, ఒరు = ఒకరియొక్క, నిశాంతంబునన్=గృహమందు, "నిశాంతవస్త్యసదన" మని అ. దండకున్=సమీపమునకు, ఎవ్వఁడు దాఁజనును, ఆయన, ఆర్యగతిన్ = సన్మార్గమున, వర్ష = సంవత్సరమెల్ల.

క. అని శమదమహిమవర్తనుఁ
డనిపించుకొని చనియెను సహస్రకరుఁడు నా
యనలసమానౌజస్సృష్
ష్టిని జిత్రపతంగలీలఁ జెందెఁ జను నెడన్. 91

భా. అని = పూర్వోక్తప్రకారమునఁజెప్పి, శమ అంతరింద్రియనిగ్రహము చేతను, దమ = బహిరింద్రియనిగ్రహముచేతను, హిమ=చల్లనైన, "తుషారశ్శీతలశ్శీతో హిమః" అని అ. వర్తనముగలనారదుఁడు, అనిపించుకొని = అంపించుకొని, చనియెను, చను నెడన్ = నారదుఁ డాకాశగమనమునఁ బోవునప్పుడు, సహస్రకరుఁడును = వేయికిరణములు గలసూర్యుఁడును, ఆయనయొక్క, లసమాన = ఒప్పుచున్న, ఓజస్సృష్టిని=తేజస్సృర్ణచేత, చిత్రపతంగ=చిత్రరువుసూర్యునియొక్క, "పతంగః పక్షిసూర్యయోః" అని అ. లీలఁ జెందెను.

రా. అనిశ=ఎల్లప్పుడును, మదమహిమ=గర్వాతిశయముచేత నగు, వర్తనగలవాఁడు, అనిపించుకొని = ఖ్యాతిగని - ఎంచఁబడినవాఁడై యనుట, సహస్రకరుఁడు= కార్తవీర్యుఁడు, చనియెను = నొచ్చెను, నాఁ=నాయొక్క, అనల=అగ్నికి, సమానమైన, ఓజ = తేజస్సుయొక్క, సృష్టిచేత, చను నెడన్ = నొచ్చునపుడు, చిత్ర = అద్భుతమైన, పతంగ = మిడుతయొక్క, "సమా పతంగశలభౌ" అని అ. లీలన్ = సామ్య

మును, చెందెను, ప్రియము చెప్పనందువలన నాప్రతాపాగ్నియందుఁ గార్తవీర్యుఁడు మిడుతవలెనే పడ్డది వినియుండవా యనుట.

ఉత్సాహ. అంతరహితసమయవృత్తినర్జునుండు ధర్మ రా
జాంతికమున కరిగె దృఢనిజాయుధగ్రహేచ్ఛన
త్యంతము గురుధేనుదస్యుతాపితాతిమన్యుమ
త్స్వాంతబాడబప్రశాంతిసలుపనేర కొండుమైన్. 92

రా. ఇంకరెండుపద్యములఁ గార్తవీర్యార్జునుని భంగములె యుత్ప్రేక్షించుచున్నాఁడు. అంత రహిత = అంతశ్శత్రువులయొక్క, సమయవృత్తిక్ = సమష్టి వ్యాపారముచేత, అర్జునుండు = కార్తవీర్యార్జునుఁడు, దృఢమైన, నిజాయుధగ్రహేచ్ఛక్ = తనయాయుధగ్రహణమును మానకయనుట, గురు = తమతండ్రి జమదగ్నియొక్క, ధేనువుయొక్క, దస్యుతా = చౌర్యముచేత, ఆపిత = పొందఁబడిన, అతిమన్యు = మిక్కిలికోపముగల, మత్ = నాయొక్క, స్వాంతమనెడి బడబాగ్నికిఁ బ్రశాంతిని, ఒండుమైక్ = ఉపాయాంతరమున, చలుపనేరక, ధర్మరాజ = యముని యొక్క, అంతికమునకు నరిగెను. మా కాగ్రహమును బుట్టించి మఱి భూలోకమున నిలువఁగూడదుగనుక ననుట.

భా. అంతక్=అంతటు, రహిత=విడువఁబడిన, సమయ = సంకేతముగల, "సమయాశ్శపథాచారకాలసిద్ధాంతసంవిదః" అని అ. వృత్తిక్ = వర్తనచేత, అర్జునుండు, గురు = పూజ్యములైన, ధేను=పాడియావులయొక్క, "ధేనుస్స్యాన్నవసూతికా" అని అ. దస్యు=దొంగలచేత, "దస్యుతస్కరమోషకాః" అని అ. తాపిత = తపింపఁజేయఁబడ్డట్టియు, అతిమన్యుమత్ = మిక్కిలిశోకవంతమైన, స్వాంతముగల, బాడబ= బ్రాహ్మణునికి, "ద్విజాత్యగ్రజన్మభూదేవబాడబాః" అని అ. ప్రశాంతిక్=చిత్తశాంతిని, కడమ సులభము.

క. ఉదుటున నట్లరిగి యతం
డది ప్రాయశ్చిత్తతీర్థయాత్రాలీలక్
వదలక పూతము సేయక్
సదమలగతి పూనె వృథగయె సత్సంగరముల్. 93

భా. అతండు = అర్జునుఁడు, అది=పడకింటిలోని ధర్మరాజువద్దికిఁబోయిన ప్రతిజ్ఞాభంగదోషమును, తే. 'ప్రాణిపదములు వెలిగాఁగఁ బ్రథమలెల్ల, నరయ నొక్కొక్కచో ద్వితీయార్థ మిచ్చు' పూతముసేయక్ = పరిశుద్ధముచేయ, గతి=గమనమును, పూనెను, సత్సంగరముల్=సత్పురుషుల ప్రతిజ్ఞలు, "ప్రతిజ్ఞాజిసువిదాపత్సు సంగరః" అని అ. వృథగయె = వ్యర్థముగాదు, అని యర్థాంతరన్యాసాలంకారము.

రా. అతండు = కార్తవీర్యుఁడు, అది = ధేనుచౌర్యదోషమును, పూతము సేయ, ప్రాయశ్చిత్త = పాపపరిహారకర్మమునకు, తీర్థ = రేవైన - ప్రవేశాస్పద మైనదనుట. "యోనౌ జలావతారేచ మంత్రాద్యష్టాదశస్వపి, పుణ్యక్షేత్రే తథా పాత్రే తీర్థం స్యాచ్చ" అని హలాయుధము. యాత్రా=యుద్ధయాత్రయొక్క, లీలచేత, సదమలగతి = సద్గతిని, పూనెను. సత్సంగరముల్ = లెస్సయుద్ధములు, వృథయె, ఎంతపాపాత్ముఁడేనియు యుద్ధమందుఁబడినను సద్గతిని బొందును గనుక, ఇందుకు స్మృతి. "ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః" ఇట నఁగాఁ బ్రియముఁ జెప్పవలె లేదా లెస్సగాఁ బోట్లాడవలె ననుట.

వ. అందు. 94

తే. అతనురణరసభోగికన్యార్థపరతఁ
దా నిలావంతుఁ డనుమహాద్రవిణనిధిని
సుతుల సద్వృత్తిఁ బడసెద మితయశస్స్వ
లీల సుఖియింతు నను చింత లే దెపుడును. 95

రా. అతనురణరసభోగికిన్ = అనల్పమైనయుద్ధము చవియెఱిఁగినవానికి, అన్యమైన, అర్థ=ప్రయోజనము మీఁదిదైన, పరతన్ = తాత్పర్యముచేత, తాను, ఇలావంతుఁడను = భూమిగలవాఁడను, "గౌరిలా కుంభినీ క్షమా" అని అ. ద్రవిణనిధిని = ధనవంతుఁడను, "ద్రవిణం తు ధనం బల" మ్మని అ. సుతులను సద్వృత్తిఁబడసెదను, మితమైన, యశః = కీర్తిగల, స్వలీలన్ = తనవిలాసముచేత, సుఖియింతు నను చింత లేదు, యుద్ధప్రియునకు జయతృప్తి లేదనుట.

భా. అతను = మన్మథునియొక్క, రణ = యుద్ధమందు, రస = వేడుకగల, భోగికన్యా = నాగకన్యయైన ఉలూచియొక్క, అర్థపరతన్ = ప్రయోజనవశతచేత, తాను, ఇలావంతుఁడనెడు, ద్రవిణనిధిని = బలాఢ్యుని, లసద్వృత్తిని సుతుఁ బడసెను, దమిత = అణఁపఁబడ్డ, యశః = కీర్తిగల, స్వలీలన్ = తన క్రీడచేత, సుఖియింతు నను చింత లేదు, కీర్తివిడిచి తీర్థయాత్రకునడుమ స్త్రీభోగముకు గోరఁడని భావము.

సీ. తీర్థయాత్రాసమాప్తిఁ గరంబు దనరి రా
జోపభోగ్యం బైనయుద్ధవసుధ
నతిసరస మగుచిత్రాంగదానామల
తాంగీకృతసురతావాప్తిఁ జేసి
భాసురనందనప్రసవభూషితవర
వర్ణినీగురుచిత్రవాహనుండు

తదదూరదేశసిద్ధసరసీపుణ్యతీ
ర్థోపసేవల మహాశాపకలుష
తే. నైకనిర్ఝరీధృతమకరీకలాప
రూపలోపకృజ్జలవిహారుఁడును దివ్య
ధామకలితుండు నై శూరతరుఁ డగునరుఁ
డొప్పెసగురుచిరయశోమహోదయతను. 96

భా. తీర్థయాత్రాసమాప్తిన్=వత్సరపరిపూర్తిచేత, ఉద్ధవసుధన్ = ఉత్సవామృతముచే, చిత్రాంగద యనెడినామముగల, లతాంగీ = స్త్రీయందు, కృతమైన, సురత = సంభోగముయొక్క ఆవాప్తిచేత, నందన = పుత్త్రుఁడైన బభ్రువాహనునియొక్క, ప్రసవ=పుట్టుకచేత, భూషిత=అలంకరింపఁబడిన, వర్ణి నీగురు= చిత్రాంగదాజనకుఁడైన, చిత్రవాహనుఁ డనెడిరాజుగలవాఁడు, చిత్రాంగదకుఁబుట్టినవానిఁ జిత్రవాహనునికి నర్జునుం డిచ్చెద నన్నాఁడని యాదిపర్వమందుఁ జెప్పియున్నదిగనుక, తత్ = ఆచిత్రవాహనునిపట్టణమునకు, అదూరదేశ = సమీపదేశమందు, సిద్ధమైన = కలిగిన, సరసియొక్క, పుణ్య=మనోహరమైన, తీర్థ = రేవుల, ఉపసేవలన్ = స్నానములచేత, మహాశాపకలుషమైన, నైకనిర్ఝరీ = అనేకదేవతాస్త్రీలచేత, ధృత = ధరింపఁబడిన, మకరీకలాపరూప=మకరీసమూహదేహములయొక్క, లోపకృత్ = నాశమును జేసినట్టి, జలవిహారము గలవాఁడు, వారిమకరీరూపశాపమోక్షమును జేసియనుట, దివ్య=మనోహరమైన, ధామ=తేజస్సుతోడ, కలితుండు = కూడినవాఁడు, నరుఁడు = అర్జునుండు, సగురుచిరయశోమహోదయతన్ = ఘనమైన చిరకీర్త్యతిశయముతోడఁ గూడినవాఁడౌటచేత, ఒప్పెను.

రా. తీర్థయాత్రకు, సమ=సమానమైన, ఆప్తిన్ = వ్యాప్తిచేత, యుద్ధవసుధన్= రణభూమియందు, అతిసరసమగు = మిక్కిలిప్రియమైన, చిత్ర = ఆశ్చర్యమైన, అంగదాన = శరీరచ్ఛేదమువల్లనైన, "దో అవఖండనే" అనుధాతువున నిష్పాంతశబ్దము. అమలతా=నిష్కల్మషత్వముచేత, అంగీకృతమైన, సురతా=దేవత్వముయొక్క, అవాప్తిఁజేసి = ప్రాప్తిచేత, శూరతరుఁడైన, నరుఁడు = పురుషుఁడు, నందన = నందన వనముయొక్క, ప్రసవ = పుష్పములచేత, భూషితములునై, వరవర్ణినీ = ఉత్తమస్త్రీలచేత, గురు = శ్రేష్ఠమైన, చిత్రవాహనుండు = చిత్తరువుతోఁగూడిన విమానములు గలవాఁడు, తత్=ఆనందనవనములకు, అదూరదేశ = సమీపదేశమందున్న, సిద్ధసరసీ = ఆకాశగంగయొక్క, మహాశ = అధికాశగలవారైన, అపకలుష, మకరీకలాప = మకరికాపత్రాలంకారముచేతనైన, " కలాపో భూషణే బర్హే తూణీరే సంహతావపి" అని అ. రూప =

సౌందర్యముయొక్క, "రూపం స్వరూపే సౌందర్యే" అని అ. దివ్యధామ = దివ్య గృహములయందు, ఒప్పెసగుక్ = క్రియ, కడమ సులభము.

తే. అంత శౌర్యాశ్రయం బైన యట్టిమేటి
వీడు నాకాహవస్పృహాన్వితధామ
కాంతిఁ జూచిపోయెద నని కదలి వచ్చి
నాఁడ నెఱి సూపుమదనుగుణక్రమమున. 97

రా. అంతమైన, శౌర్యాశ్రయంబైనయట్టిమేటివి, ఈడునాకు = నాకు సరి యైనవాఁడవు, ఆహవస్పృహ = యుద్ధవాంఛతోడ, అన్విత = కూడిన, శౌర్యముతోఁ గూడినదనుట, ధామ = ప్రతాపముయొక్క, కాంతిక్ = స్ఫురణచేత, ఈడైన వాఁడవని క్రిందటి కన్వయము, కాంతిపదము. కము కాంతౌ - అన్న యుదాహరణ మున నిచ్ఛాపరమైన నవును. యుద్ధవాంఛను బ్రతాపవాంఛను నీడైనవాఁడవు. అటు గనుకనే వచ్చినాఁడను, మత్ = నాకు, అనుగుణక్రమమున, నెఱిసూపు = ఎది రింపుమా.

భా. అంతట, శౌరి = కృష్ణునికి, ఆశ్రయంబైనయట్టిమేటివీడు = ద్వారకను. నాక=స్వర్గముతోడనగు, ఆహవ=యుద్ధముయొక్క, స్పృహ = కోరికతోడ, సామ్యము తోడననుట, అన్విత=కూడిన, ధామ=గృహములయొక్క, కాంతిగలదాని, చూచి పోయెదనని వచ్చి, నాఁడ = నాఁడే, మదనునియొక్క, గుణక్రమమునక్=గుణాను సారమున, చేరి యని ముందటిపద్యమున కన్వయము.

క తెరలక మనము సుభద్రా
కరనాళీకగ్రహేచ్ఛ గప్పఁగఁ జనునా
దొర యదుపురిఁ జేరి జనవి
సరముల కెఱుకపడనీక శౌర్యతనుఘృణన్. 98

భా. మనము=మనస్సును, సుభద్రా = సుభద్రయొక్క, కరనాళీకగ్రహేచ్ఛ = హస్తపద్మగ్రహణవాంఛ, వివాహేచ్ఛయనుట, కప్పఁగఁక్ = ఆక్రమింపుచుండఁగా, చనునాదొర=చనుచున్నయర్జునుఁడు, యదుపురిక్=ద్వారకను, శౌరి = కృష్ణుని యొక్క, అతను = అనల్పమైన, ఘృణక్ = దయను, "ఘృణా జుగుప్సాకృపయోః" అని వి. ఎఱుకపడనీక, తిరంబై పోయె నని ముందటిపద్యములోఁ గ్రియ.

రా. మనము=ఇద్దఱమును, సుభద్రాకర = శుభాస్పదమైన, నాళీకగ్రహేచ్ఛ = శరగ్రహేచ్ఛను - యుద్ధవాంఛననుట, "నాళీకం శరపద్మయోః" అని. వి. కప్పఁగఁ జనునా=అణఁపవచ్చునా, నీకు, అశౌర్యతక్ = శౌర్యహీనత్వముచేతను, ఘృణక్ =

జుగుప్సచేతను, పురిన్=అయోధ్యను, చేరి జనవిసరములకు, యెఱుకపడన్ = కనుపట్టునట్టుగా, దొరయదు=యుక్తముగాదు.

మ. అనయంబున్ మదనామితాస్త్రకలనాత్యంతార్తి రాకుండఁ జ
య్యన మౌనిత్వకృతేష్టసిద్ధితఁ దిరంబై పోయె దేదీప్యమా
ననిరూఢిం బయిఁబడ్డయాదవులనానావీరధర్మప్రవృ
త్తినిరర్థం బనిపించి యాత్మపురికిం దేవేరితోఁ గూడఁగన్. 99

రా. మత్=నాయొక్క, అనామిత = అణఁపఁబడని, అస్త్రకలన = బాణప్రయోగముచేతనైన, అత్యంతార్తిరాకుండ, మౌనిత్వ=నిరుత్తరత్వముచేత, కృత=చేయఁబడ్డ, ఇష్టసిద్ధితన్ = అభీష్టసిద్ధిగలుగుటచేత, దీప్యమాననిరూఢిచేత, పయిఁబడ్డ=ఆరోపితమైన, ఆ, దవుల = దూరములనున్న, నానావీరధర్మప్రవృత్తి = వార్త, ఆత్మపురికి, పోయెదే=పోయెదవా.

భా. మదన=మన్మథునియొక్క, అమితమైన, అస్త్రకలనా = బాణవిద్యచేతనగు, మౌనిత్వ=మునిత్వముచేత, కృతేష్టసిద్ధితను, సన్న్యాసివేషమున సుభద్రను వరించినవాఁడై యనుట, దేదీప్యమాననిరూఢింబయిఁబడ్డ, యాదవులయొక్క, దేవేరితోన్ = భార్యతోఁగూడ, పోయెను.

చ. అనికృతధర్మవీక్షుఁ డయి యావరవర్ణి నికామసంభ్రమం
బు నడపుచుం గరం బమరపూజ్యసమిజ్జయశోభిమన్యునా
మునిసుతుఁ గాంచి లక్ష్మణుఁ డముద్రితదీప్తిధనంజయుండు నే
ర్పె నయగభీరవీరసమపేక్ష్యతరోచ్చరణప్రగల్భతన్. 100

భా. అనికృత=తిరస్కరింపఁబడని, ధర్మవీక్షుఁడయి = ధర్మదృష్టిగలవాఁడై, ఆ వరవర్ణిని=సుభద్రయందు, కామసంభ్రమంబునడపుచును, అమరపూజ్య = దేవతాశ్లాఘనీయమైన, సమిజ్జ=యుద్ధమందుఁబుట్టిన, యశ = కీర్తిగల, అభిమన్యుఁ డనునామముగలవాని, సుతున్=పుత్త్రుని, కాంచి, లక్ష్మణుఁడు = లక్ష్మీవంతుఁడు, "లక్ష్మీవాన్ లక్ష్మణః శ్రీలః" అని అ. అముద్రితదీప్తి = అనర్గళమైనదీప్తిగలవాఁడు, ధనంజయుండు= అర్జునుఁడు, నయ=నీతిచేత, గభీరమునై, వీరులచేత, సమపేక్ష్యతర=మిక్కిలి నాశింపఁదగిన, ఉచ్చ=ఉన్నతమైన, రణమందుఁగల, ప్రగల్భతన్=ప్రౌఢిమను, నేర్పెన్ = ఉపదేశించెను.

రా. అని=ఈలాగునఁబలికి, కృతమైన, ధర్మవీక్షుఁడయి = వింటియందు దృష్టిగలవాఁడై, విల్లెక్కుఁబెట్టనిశ్చయించినవాఁడై యనుట, ఆవరవర్ణి = ఆనైష్ఠికబ్రహ్మచారి పరశురాముఁడు, "వర్ణినో బ్రహ్మచారిణః" అని అ. నికామ=అత్యంతము, సంభ్రమంబునడపుచును, కరంబు=మిక్కిలి, అమరఁగా, అముద్రితదీప్తిచేత, ధనంజయుండు=

అగ్నినిబోలినవాఁడు, లక్ష్మణుఁడు, పూజ్య=శ్లాఘ్యమైన, సమిజ్జయ=యుద్ధజయములచేత, శోభి = ఒప్పుచున్న, మన్యున్ = క్రోధముగలవాని, ఆమునిసుతున్ = పరశురాముని, నేర్పునయన్ = చాతుర్యయుక్తముగా, ఉచ్చరణప్రగల్భతన్ = ఉచ్చారణశక్తిచేత, ఇట్లనునని ముందటిపద్యమునఁ గ్రియ.

తే. కొసర నిట్లనుభావంబు పస నెరపుచు
నమ్మహాత్ముతో జిష్ణుతేజోతిశయము
మిక్కిలిఁ బ్రకాశముగ భ్రాతృమిత్రబంధు
సచివులసమాదృతిని జూపి రుచితసరణి. 101

రా. జిష్ణు = జయశీలమైన, సమాదృతిన్ = అత్యాదరమున, రుచిత = ఒప్పెడి, సరణిచేత.

భా. ఇట్లు, అనుభావంబు, అమ్మహాత్ముతోన్ = అభిమన్యునితోఁ గూడి, జిష్ణు = అర్జునునియొక్క, ప్రకాశముగన్ = ప్రకటముకాఁగా, సచివులు, అసమ=అతులమైన, ఆదృతిన్=ఆదరమును, చూపిరి, ఉచితసరణిన్=తగినరీతిని.

క. మగలయిలువరుస గలపెను
దగ వరు లొకఁడొకడొకొక్క తనయు రుచిరశౌ
ర్యగతినుతిఁ జెంద ఘనకీ
ర్తిగ నలరంగలరు ద్రోవది వరక్రమతన్. 102

భా. ఘనకీర్తిగ, అల, రంగలరు=రంగుమీఱు, ద్రోవది=ద్రౌపది, తద్భవపదము. ఉ. 'ద్రోవదిబంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవీడ్చి వెండ్రుకల్, దావలకేలఁబూని యసితచ్ఛవిఁ బొల్చుమహాభుజంగియో, నావిలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగ విషాద రోషముల్, గావగలేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గునలేచి యార్తయై' అని యుద్యోగపర్వమందుఁ బ్రయోగము. తగ, వరులు = పతులు, రుచిర = ప్రకాశించుచున్న, శౌర్యగతి=శౌర్యవర్తనచేతనైన, నుతి=స్తుతిగలవాని, ఒకొక్క, తనయున్ = కుమారుని, చెందఁగా, వరక్రమతన్=పెద్దపిన్నవరుసను, లేక, వర=శ్రేష్ఠమైన, క్రమతన్=మర్యాదగలదౌటచేత, మగలయిలువరుస గలపెను.

రా. మగలయిలువరుసగల = వంశానుగపౌరుషముగల, పెనుదగవరులు=మంచినేర్పరులు, ఒకఁడొకఁడు = ఒక్కొక్కపురుషుఁడే, ఒకొక్క = ఒకానొకటైన, వింతైనదనుట. ఉరు=అధికమైన, చిర=స్థిరమైన, శౌర్యగతి = శౌర్యవర్తనము, నుతిఁజెందన్ = ప్రసిద్ధమగునట్టుగా, అలరంగలరు=ప్రకాశింపఁగలరు, అక్రమతన్ = క్రమము దప్పి, త్రోవదివరు,

సీ. అంత శౌర్యాప్తిచే నధికప్రవర్షసం
పన్నత దగఁ గాంచియున్న తమగు
దండితనమున వీరుండ నేనస్ఫుట
పటుశక్తి విజయుండ బాలిశుండ
నీకాభిముఖ్యంబు గైకొని సుమనోబ
లంబుతోఁ దగ నుత్తరంబుఁ జెప్పఁ
జతురుండ నాతపస్థితివనాదృతవివి
ధవిహారభోగవర్తనల నొనరి
తే. తనరునచ్యుతయోగశోభనత నుండ
వనికిఁ బనివడి విప్రుఁడై యనలుఁ డేగు
దెంచె ననవరదీప్తి నేతెంచి యిట్లు
పలికె దీవనలసగర్వకళ నెరపుచు. 103

రా. అంతైన=పూర్వోక్తమైన, దండితనమున, వీరుండఁగ = ఈబంధుమిత్రాదులుండఁగా, నేను, అస్ఫుట = వ్యక్తముగాని, పటుశక్తియుఁ విజయము గలవాఁడను, బాలిశుండను = బాలకుండను, నీకు, ఆభిముఖ్యంబు గైకొని, సు=లెస్సైన, మనోబలంబుతోఁగ=బుద్ధిబలముతో, ఉత్తరంబుఁ జెప్పఁ జతురుండనా, తపస్థిస్థితివి = తపస్సునందు నిలుకడగలవాఁడవు, అనాదృత = ఆదరింపఁబడని, వివిధవిహారభోగములు గలవర్తనలనొనరి తనరెడి, అచ్యుత = నిలుకడైన, యోగ = అష్టాంగయోగముచేత, శోభనమైన, తనుండవు = మేనుగలవాఁడవు, అనికిఁ బనివడి విప్రుడై యనలుఁ డేగుదెంచె నన, ఈవు, అనలస = అమందమైన, గర్వకళఁగ = గర్వప్రాప్తిని, నెఱపుచుఁ బలికెదవు.

భా. అంతట, శౌరి=కృష్ణునియొక్క, ఆప్తిచేఁగ = ఆగమనముచేత, వీరుండు, అనేన=పాపరహితమైన, "కలుషం వృజినైనోఘ" మని అ. స్ఫుటమైనపటుశక్తిగలవాఁడు, అబాలిశుండు=బుద్ధిమంతుఁడు, విజయుండు=అర్జునుఁడు, అనీక=యుద్ధమునకు, "సమరానీకరణాః" అని అ. సుమనోబలంబుతోఁగ = దేవబలముతోడ, చతురుండు, అనాతపస్థితి=ఆతపస్థితిలేని, వన=వనమందు, ఆదృత=ఆదరింపఁబడి, తనరు=ఒప్పుచున్న, అచ్యుతయోగ = కృష్ణసఖ్యముచేతనైన, శోభనతను = శోభనత్వమున, ఉండఁగా, అనవర=శ్రేష్ఠమైన, దీప్తిచేత, అసగర్వ=గర్వయుక్తముగాని, కళఁగ = వర్తనచేత, దీవనలను, నెరపుచుఁగ=ఇచ్చుచు, పలికెను.

క. విను విజయశక్తిమీరిరితి
ననుగాఢాహామిక చెల్లునా మదిలో నెం

దును బహుతరాశనుండఁ
జనునే మి మ్మడుగవలయుసకలార్థంబుల్. 104

భా. విజయ=సంబుద్ధి, తినన్=భక్షించునట్లుగా, గాఢాహామిక, నామదిలో, చెల్లున్ = చెలంగుచున్నది, బహుతరాశనుండన్=బహ్వాశనుండను, నే=నేను, వలయు=వలసినట్టి, సకలార్థములను మిమ్మడుగ, చనున్=తగుదుననుట.

రా. విను=విజయశక్తిమీరితిని, అను=అనెడి, గాఢాహామికచెల్లునా, ఇక్కడ-ప్లుతయతి. మదిలో, బహుతరాశన్=అధికాపేక్షచేత, ఉండఁజనునే, సకలార్థంబులు=సకలప్రయోజనములు, మిమ్మడుగవలయున్=మిమ్ము నడిగి తెలిసికోవలెను.

మ. అని వాలాయముగా నభీష్టతమమౌ నన్నం బొసంగన్ స్వనీ
తిని ము న్నెంతయు నియ్యకొల్పి మఱియు ద్వృత్తిం బ్రవర్తిల్లుము
జ్జనితోల్లాసముతోడఁ బల్కె సముదంచత్ఖాండవాస్వాదవ
ర్తన మిష్టం బని రాజపుత్త్రునకు శస్తం బౌశుచిత్వంబునన్. 105

రా. అని=యుద్ధము, అభీష్టతమమౌను, అన్నన్=అన్నట్టాయెనా, స్వనీతిన్=బ్రాహ్మణధర్మమును, పొసంగన్, ప్రవర్తిల్లుము, ఉజ్జనితోల్లాసముతోడ, పల్కె=భాషణమె, సముదంచత్=ప్రకాశించుచున్న, ఖాండ = ఖండశర్కరాసంబంధమైన, "స్యాత్ఖండశ్శకలే చేక్షువికారమణిదోషయోః" అని వి. "తస్యేద" మ్మని అణ్ప్రత్యయాంతము. వాః=ఉదకముయొక్క, "వార్వారి సలిలం కమలం జల" మ్మని అ. స్వాద=రుచివంటిరుచిగల, వర్తనము=వర్తనగలది, శస్తంబౌ, శుచిత్వంబునన్=అప్రతిహతుఁడౌటచేత, "శుచిశ్శుద్ధేనుపహతే శృంగారాషాఢయోరపి, గ్రీష్మే హుతవహేపి స్యా" త్తని వి. అని=యుద్ధము, ఇష్టంబు=ప్రియమైనది, రాజపుత్రునికి వాఙ్మాధుర్యమును యుద్ధకార్కశ్యమును స్వతస్సిద్ధమైనదిగాదా యనుట.

భా. అని=ఇటని, అన్నంబును, ఒసంగన్ = ఇచ్చెడికొఱకు, అన్నశబ్దము-అద .భక్షణే, అనుధాతువున నిష్పన్నము గనుక ఆహారవాచకము. స్వనీతిన్=తనబ్రాహ్మణాకృతిధర్మముననే, ఇయ్యకొల్పి=అలాగుననే ఇచ్చెదమనిపించి, మఱి=అనుపించుకొన్నపిమ్మట, ముత్=సంతోషముచేత, జనిత=పుట్టిన, ఉల్లాసముతోడ, శస్తంబౌ=చెప్పఁబడిన, శుచిత్వంబునన్=అగ్నిత్వముగలవాఁడై, పల్కెన్=పలికెను.

ఉత్సాహ. ఈవిధమునఁ బల్కి మఱియు నిట్టులనియె నట్టికాం
తావిధి నొకవిఘ్న మిపుడు గలదు నిన్ను నారయం
గా వినుమునివారణాధికారమునకు దగుదువే
తావదర్థగతియు మున్ను దలఁచినాఁడ నామదిన్. 106

భా. అట్టికాంతావిధికిన్ = ఆఖాండవవనభక్షణవాంఛకు, నిన్ను నారయంగా వినుము, నివారణాధికారమునకున్=ఆవిఘ్నముమాన్పెడుపనికి, తగుదువు, ఏతావదర్థగతియున్=ఇంతపూనికను, మున్ను=మును పె, తలఁచినాఁడను.

రా. విను, మునివి, ఆరణాధికారమునకు, తగుదువే=తగుదువా, తావదర్థగతియున్=అంతైనకార్యరీతిని, మునీశ్వరుఁడవని తాళుకొన్నాఁడ నని తాత్పర్యము.

తే వఱలునచ్యుతసఖ్యాతివర్ణితాతు
లప్రదీప్తి నిట్లలరు నీ విప్ప్రభావ
మెందుఁ బెట్టనికోటగా నెసఁగుచుఁ గడ
చేర్తువస్మన్మహాశరాజితనిరూఢి. 107

రా. అచ్యుత=స్థిరమైనయోగముచేత, సఖ్యాతి=ఖ్యాతిసహితమైన, వర్ణితా = బ్రహ్మచారిత్వముయొక్క, అతులప్రదీప్తిన్=అత్యంతప్రసిద్ధిచేత, నీ, విప్రభావము=విప్రత్వము, అస్మత్=మాయొక్క, శర=బాణములయొక్క, అజితనిరూఢిన్ = అప్రతిహతమైన శక్తిని, కడచేర్తువు=అతిక్రమింతువు, నీవు బ్రాహ్మణుఁడవు గాఁబట్టి కొంకుచున్నామనుట.

భా. వఱలు=ఒప్పెడి, అచ్యుత=కృష్ణునియొక్క, సఖ్యముచేత, నతివర్ణితమైన, యతులమైన ప్రదీప్తిన్=తేజస్సుచేత, ఇట్లలరునీవు, ఇది కృష్ణునిసాంగత్యమును జూచి చెప్పెడిమాట, ఇప్ప్రభావము=ఈమహిమ, రాజితనిరూఢిన్=మంచి యస్త్రాభ్యాసమందలి నేర్పుచేత, అస్మత్=మాయొక్క, పూజాబహువచనము, మహాశన్ = అధికాపేక్షను, కడచేర్తువు=సఫలము చేతువు.

ఉత్సాహ. ఎన్న నేవరించువరసమిన్మహావనంబులో
నన్నగారి గినిసినను ఘనాతిచండకాండవృ
ష్టి న్నలంప వచ్చు జగదజేయదండ నుండుమా
యన్న బ్రాహ్మణునకు విరచితాంజలి యగుభక్తితోన్. 108

భా. ఎన్న, నేవరించు=నేనుగోరెడి, వర=శ్రేష్ఠమైన, సమిత్=సమిధలుగల, 'ఇధ్మమేధస్సమిత్ స్త్రియా" మ్మని అ. మహావనంబులోను, అన్నగారి=ఆయింద్రుఁడు, కినిసి, నన్=నన్ను, ఘన=మేఘములయొక్క, అతిచండ=మిక్కిలి నుగ్రమైన, కాండవృష్టిన్=ఉదకవర్షముచేత, "కాండో స్త్రీ దండబాణార్వవర్గావసరవారిషు" అని అ. నలంపవచ్చున్ = నలగించెడికొఱకు వచ్చును, జగదజేయ-సంబుద్ధి, దండనుండుమా, అన్నన్ = అనినను, బ్రాహ్మణునకున్ = బ్రాహ్మణాకృతి యైనయగ్నికి, విరచితమైనయంజలిగలదైన, పంచమీబహువ్రీహి, భక్తితో, ఇట్లనునని ముందరఁ గ్రియ.

రా. ఎన్నసే=ప్రసిద్ధమగునట్లుగానే, వరించు = స్వీకరించు, వరసమిత్ = మహాయుద్ధమనెడి, మహ=ఉత్సవముయొక్క, "సమిత్యాజిసమిద్యుధః మహస్తూత్సవతేజసోః" అని అ. అవనంబులోనన్=రక్షణములోపల, నగారిగినిసినన్=ఇంద్రుఁ డెదిరించినప్పటికిని, కాండవృష్టిన్ = శరవర్షముచేత, జగదజేయదండనుండు = జగములకు నతిక్రమింపరాని యాజ్ఞగలవాఁడు, మాయన్న = రఘురాముఁడు, నలంపవచ్చున్ = అణఁచుయత్నము చేయును, అట్లైనను దాళినందునకు హేతువు, బ్రాహ్మణునకు విరచితాంజలి యగును, "గవాగ్రజన్మనామగ్రే న శూరో రోషవానయ" మ్మని రామవాక్యము గనుక.

స్రగ్ధర. ఆరాజన్యోత్తముం డిట్లనుదితరభసుండై భవత్సత్వరవ్యా
హారంబిట్లోర్చియుంటన్యముగఁగొనకుమాత్మాంగనాశుల్కతాదృ
క్సారోగ్రేష్వాస మిట్లశ్రమజిత మగుటెంచంగ నాచేతికాఁటం
గ్రూరేష్వాసంబు లేదొక్కఁడు గలుగునె తద్ఘోరయుద్ధంబుసైఁపన్.

రా. ఆరాజన్యోత్తముండు = రాముఁడు, ఇట్లు, అనుదితరభసుండై = పుట్టనట్టి యాగ్రహము గలవాఁడై, భవత్=నీయొక్క, సత్వర=తీవ్రమైన, వ్యాహారంబు=వాక్యమును, "వ్యాహారఉక్తిర్లపిత" మ్మని అ. ఓర్చియుంట నన్యముగ, కొనకుము=ఎంచకుమా, తాదృక్సార=అట్టిచేవగల, ఉగ్రేష్వాసము=ఈశ్వరునివిల్లు, ఎంచంగ, ఆచేతికిన్=ఆరఘునాథునిహస్తమునకు, అఁటన్=తాళినట్టుగా, క్రూరేష్వాసంబు=దురుసైనవిల్లు, శరాసనమనినట్టు, లేదు, ఒక్కఁడు=ఒకపురుషుఁడు, ఒకఁడు, ఒకొఁడు అని రెండు ప్రయోగములు గలవు గనుక, తత్=అట్టిరఘునాథునియొక్క, కలుగునె క్రియ.

భా. ఆరాజన్యోత్తముండు=అర్జునుఁడు, ఇట్లను, దిత=ఖండితమైన, రభసుండై=వేగముగలవాఁడై, త్వరపడకయనుట, ఓర్చియుంట=వించున్నయునికి, నాచేతికి, క్రూరేష్వాసంబు=గట్టివిల్లు, ఒక్కఁడు=ఒకటి, ఉ. 'ఇప్పుడేను రాకుండ నొకండు వచ్చి మఱియొండునె' అని పెద్దిరాజు ప్రయోగము. తత్=ఆయింద్రునియొక్క, కలఁగునె=కలిగెడినా, అని క్రియ. నాచేతికిఁ దగినవి ల్లొకటియిచ్చినను నింద్రునితో యుద్ధము సేయఁగల ననుట.

సీ. అనుటయు నాతఁ డారాజనాథ వరకుమా
రాగ్రణిఁ జూచి నీయాత్మయందు
నిటువంటితలఁపున్న నిదిగో మహాబలో
ద్దామంబు కమలేశదత్త మయ్యొ

నాకీశచాపంబునకు నెక్కుడిది గాండి
వం బనుభారతీవరుధనుర్మ
తల్లిక శేషోగ్రతరగుణప్రౌఢి న
త్యధికంబు క్రమమున నన్యదేవ
తే. ధృతములైనవానిని గణుతింపనేల
దీని నెక్కుడి నీభుజస్థేమఘనవి
జృంభణముఁ జూపు మని తనచేతివిల్లు
దృఢరణస్థితి నరదంబుఁ దెచ్చి యిచ్చె. 110

భా. కమలేశ=జలాధిపతియైనవరుణునిచేత, దత్తమయ్యెను=ఇవ్వఁబడెను, నాకీశ=దేవేంద్రునియొక్క, చాపంబునకు నెక్కుడు, గాండివంబను = గాండివమనెడి, ధనుర్మతల్లిక=ధనుశ్శ్రేష్ఠమైనది, "మతల్లికా మచర్చికా ప్రకాండముద్ధతల్లజౌ ప్రశస్తవాచకాని" అని అ. శేషునిభంగి నుగ్రతరమైన, గుణ=నారియొక్క, "మౌర్వీ జ్యాశింజినీగుణః" అని అ. ప్రౌఢిచేత నత్యధికంబు, అన్యదేవ=బ్రహ్మాదులచేత, ధృతములైనన్=ధరించుటలు గలిగినను, వానిన్=ఆధారణములను, గణుతింపనేల, అని. తనచేతివింటిని, దృఢమైనరణమందుల, స్థితిన్=ఉనికిగలదాని, అప్రతిహతమైనదానిననుట, అరదంబును=రథమును, తెచ్చి యిచ్చెను.

రా. ఆతఁడు = పరశురాముఁడు, జననాథవరకుమారాగ్రణిన్ = దశరథకుమారజ్యేష్ఠుఁడైనరాముని, చూచి, అనుమాట, నాకు, కమలేశదత్తమయ్యెన్=ప్రీతిచేత నియ్యఁబడెను. ఈశచాపంబునకు నెక్కుడిది, ధనుర్మతల్లికన్=ధనుశ్శ్రేష్ఠమునకును, అశేషోగ్రతరగుణప్రౌఢిచేత నత్యధికంబు, దృఢరణస్థితి=దృఢమైనరణస్థితిగల, నర=పురుషులను, ద=ఖండించుదాని, "దోఅవఖండనే, ఆతోనుపసర్గే కః" అని కప్రత్యయాంతము. తన చేతివింటినిచ్చెను.

మ. నుతశక్తిన్ నృపసూనుఁ డట్టిధనువున్ మోపెట్టి యైంద్రాయుధో
ద్ధతిపాథోదనిరాసి యయ్యె నపు డాతండున్ సముద్వేగయు
క్తతఁ గీర్తించి కృతావృథాగ్రహతదస్త్రక్రామితస్వర్గప
ద్ధతియై యిష్టమహావనీచరతఁ జెందం గాంచి పొంగెన్ మదిన్. 111

రా. ఐంద్రాయుధోద్ధతిపాథోదనిరాసియగుట్యన్=ఇంద్రధనుస్సుతోఁగూడిన యున్నతిగల మేఘమును దిరస్కరించినవాఁడాయెను. నీలమేఘశ్యాముఁడు గనుక, ఆతండున్=పరశురాముఁడును, సముద్వేగయుక్తతన్ = భయయోగముచేత, కృతమైన, అవృథా=వ్యర్థముగాని, గ్రహ=గ్రహణముగల - ఎక్కుఁబెట్టుటగల, తదస్త్ర=ఆరామునిబాణము

చేత, క్రామిత=ఆక్రమింపఁబడ్డ, పోఁగొట్టఁబడ్డదనుట, స్వర్గముయొక్క, పద్ధతి=మార్గము గలవాఁడై, ఇష్టమైన, మహా, అవనీచరతన్=భూసంచారమును, చెందంగాంచి మదిని, పొంగెన్=సంతసిల్లెను.

భా. నృపసూనుఁడు=అర్జునుఁడు, అట్టిధనువున్=గాండీవమును,ఐంద్రాయుధోద్ధతి=ఇంద్రుని మాయాయుధములయొక్క యుద్ధతితోఁగూడిన, పాథోద=మేఘములను, నిరాసియయ్యెన్ = పోఁగొట్టినవాఁడాయెను. ఇంద్రునివజ్రము మొదలైనమాయాయుధములను మేఘములను బోఁగొట్టెననుట. సముత్=సంతోషముతోగూడిన, వేగ=సంభ్రమముతోడనైన, "సమా సంవేగసంభ్రమా" అని అ. యుక్తతన్ = కూటమిచేత, అతండున్ = ఆయగ్నియు, కీర్తించి, కృతమైన, అవృథా=వ్యర్థముగాని, ఆగ్రహ=చలముగల, తత్=ఆయర్జునునియొక్క, అస్త్రములచేత, క్రామితస్వర్గ పద్ధతియై=కప్పబడ్డయాకాశమార్గము గలవాఁడై, అర్జునుఁడు శరపంజరము గట్టెఁ గనుక, ఇష్టమైన, మహా, వనీ=వనముయొక్క, చరతన్=భక్షణమును.

తే. తనకనలుచేష్ట లంతభీతిని ఘటింప
మగిడి శరణన్నఁ దన్మహి మయుఁ దదాత్త
తన్మహాదైన్యము గణించి దయ దలిర్పఁ
గాచె నేమన నప్పాండురాచపట్టి, 112

భా. తనకు, అనలుచేష్టలు, అంతభీతిన్=నాశభయమును, ఘటింప, శరణన్నన్=శరణువేఁడినను, తన్మహిన్=ఆఖాండవవనభూమియందు, మయున్=మయుఁడనువాని, తదా=తత్కాలమందు, ఆత్త=పొందఁబడిన, తత్=ఆమయునియొక్క, మహాదైన్యమును గణించి, ఆరాచపట్టి=అర్జునుఁడు, కాచెన్=రక్షించెను.

రా. తనయొక్క, కనలుచేష్టలు=కోపచేష్టలు, అంతైన, తత్=ఆపరశురాముని యొక్క, మహిమయున్=మహిమను, కడమ సరి.

ఉ. స్రుక్కఁక భూమిభృత్కులవిరోధి కడంక నడంచి యిమ్మెయిం
దక్కక హేతిధారి కుచితం బగుకార్యము నిర్వహించి పెం
పెక్కుడుగాఁగ నాత్మపురి కేఁగె హరిన్నుతకీర్తిఁ గూడి న
ల్దిక్కులఁ బిక్కటిల్లుచుఁ దలిర్చుప్రతాపవిజృంభణంబునన్. 113

రా. భూమిభృత్కులవిరోధియైన పరశురామునియొక్క, కడంకన్=గర్వమును, హేతిధారికిన్=శస్త్రధారునకు, "రవేరర్చిశ్చ శస్త్రంచ వహ్ని జ్వాలా చ హేతయః" అని అ. హరిత్=దిక్కులయందు, "ఆశాశ్చ హరితశ్చ తాః" అని అ. నుతమైన, ఏఁగెను=క్రియ, కడమ సులభము.

భా. భూమిభృత్కుల=పర్వతసమూహములకు, "భూభృద్భూమిధరే నృపే" అని అ. విరోధియైనయింద్రునియొక్క, హేతిధారికిన్=జ్వాలావహుఁడైనయగ్నికి, నుత కీర్తిని, హరిన్=కృష్ణుని, కూడి, ఆత్మపురికిన్=ఇంద్రప్రస్థపురమునకు, ఏఁగెను.

సీ. సర్వేశ్వరుఁడు కృష్ణు సఖ్యాతిమహిమకు
నెంత పెంపును దగు నేమిచెప్ప
దక్షుఁ డానరుఁ డట్లు దనర రాక్షసకుల
తక్షకుం డతివిచిత్రతరశక్తి
మయుఁ డతిక్రాంతవాఙ్మానసభావిశే
షంబు వైవస్వతసంతతికిని
దనదులీలోదయంబునను సంపాదించి
పెట్టె నత్యంతంబు పెంపుసొంపు
తే. సంఘటిల మరుచ్ఛతమఖసంతతుల క
తఁడు గదాదండమును సమిద్ధజయనాది
కంబువరము నిచ్చెను హరికిం బడరఁగఁ
బలుదెఱంగుల నార్యులుఁ బ్రస్తుతింప. 111

భా. సర్వేశ్వరుఁడగు కృష్ణునియొక్క సఖ్యముచేతనైన యతిమహిమకు, దక్షుఁడు, ఆనరుఁడు = ఆయర్జునుఁడు, అట్లుదనరన్ = ఆలాగుననొప్పుచుండఁగా, రాక్షసకులము యొక్క, తక్షకుండు, విశ్వకర్మ, "తక్షకో నాగవర్ధక్యోః" అని అ. అతివిచిత్రతరమైన శక్తిగలవాఁడు, మయుఁడు, అతిక్రాంత = అతిక్రమింపఁబడిన, వాక్కులయొక్క, మాన = పరిమాణముగల, వాగగోచరమనుట. సభావిశేషంబును, వైవస్వతసంతతికిన్ = ధర్మజునకు, తనదు, లీలోదయంబునన్=క్రియాచాతుర్యముచేత, సంపాదించిపెట్టెను, మరుచ్ఛతమఖసంతతులకున్ = వాయువుయొక్కయు నింద్రునియొక్కయుఁ బుత్రుల-భీమార్జునులకు, అతఁడు, మయుఁడు, గదాదండమును, సమిద్ధ=ప్రకాశింపుచున్న, జయ= జయముగలుగునట్టుగా, నాది= మ్రోసెడి, కంబువరమును=శంఖశ్రేష్ఠమును, "శంఖస్స్యాత్కంబురస్త్రియా" మ్మని అ. హరికిన్=శ్రీకృష్ణునికి, ఇంబడరఁగన్ = ఇంపగునట్టుగా, "ఇంబడరఁగా భజసనంబు" లని యనంతుని ఛందశ్ప్రయోగము.

రా. కృష్ణ=విష్ణువుయొక్క, సఖ్యాతి=ఖ్యాతితోఁగూడిన, దక్షుఁడానరుఁడు, తక్షకుండు = శాసకుఁడు, శక్తిమయుఁడు, అతిక్రమింపఁబడిన, వాఙ్మానస = వాక్కును మానసమునుగల, అవాఙ్మానసగోచరమనుట. భావిశేషంబు=కాంతివిశేషమును, వైవస్వత సంతతికిన్ = వైవస్వతమనువుయొక్క వంశమునకు, తనదు = తనయొక్క, లీలా=విలా

సార్థమైన, ఉదయంబునన్ = అవతారముచేత, మరుచ్ఛత = దేవతాశతములకును, మఖ సంతతులకున్=యాగసమూహములకును, అతఁడుగదా=అవిష్ణువుగదా, దండ=ఆధారము, మును = పూర్వమందు, జయన = జయము, "జయనే జయః" అని అ. ఆదికంబు= ఆదిగాఁగల, వరమును, హరికిన్=ఇంద్రునకు, ఇచ్చెను. రఘునాథునిమహిమను వర్ణింప శక్యముగాదనుట.

చ. అది యటులుండె నట్టిసభయానతశత్రుదయాళుఁ డాజిదీ
వ్యదరిహృదంతవహ్ని సమవర్తిసుతుం డతిలోకభాగ్యసం
పద లమరంగఁ జేకొని శుభస్థితిఁ దమ్ములు దాను నెంతయుం
బొదల శుచిత్వశాలి యజపుత్త్రుఁడు మిక్కిలి సంతసిల్లుచున్. 115

రా. సభయ=భయసహితమానట్టుగా, ఆనత=నమ్రులైన, శత్రువులందు దయాళుఁడు, ఆజి = యుద్ధమందు, దీవ్యత్ = ప్రకాశింపుచున్న, అరి = శత్రువులయొక్క, హృత్ = హృదయములయందు, అంతవహ్నిసమ = ప్రళయాగ్నికి సమమానట్టుగా, వర్తించుచున్నవాఁడు, సుతుండు=రఘునాథుఁడు, అతిలోక=లోకముల నతిక్రమించిన, "అత్యాదయః క్రాంతాద్యర్థే ద్వితీయయా" అని ద్వితీయాసమాసము. భాగ్యసంపదలచేతఁ బొదలఁగా, అజపుత్రుఁడు = దశరథుండు, పెంపొందెనని ముందరిపద్యమునఁ క్రియ.

భా. అది యటులుండె, అట్టిసభయందు, ఆనతశత్రుదయాళుఁడు, అంత వహ్ని యయినవాఁడు, సమవర్తిసుతుండు=ధర్మజుఁడు, శుచిత్వ=ధావళ్యముచేత, శాలి=ఒప్పెడి వాఁడు, అజపుత్త్రుఁడు=బ్రహ్మపుత్త్రుడైననారదుఁడు, చనుదెంచి యని ముందటిపద్యమునకు నన్వయము.

క. చనుదెంచి సర్వదిగ్వ
ర్తనఁ దేజము మెఱయఁ దత్పురస్థితిఁ బెంపొం
దె నతం డనుజులు దానుం
బొనరించుమహోపచారముల రంజిలుచున్. 116

భా. సర్వదిగ్వర్తనను దేజము మెఱయగా, తత్=అధర్మజునియొక్క, పురః= అభిముఖమందు, స్థితిన్=ఉనికిచేత, పెంపొందెను.

రా. తత్పురస్థితిన్ = అపట్టణస్థితిచేత, అతండు=రాముఁడు, అనుజులు దానును పొనరించునుపచారములచేత, దశరథుండు, రంజిలుచును పెంపొందెన్ = సుఖమున నుండెను.

శా. మాహానాథవిహారవాహన కృపామాహాత్మ్యసాహాయ్యకో
త్సాహశ్లక్ష్ణకటాక్షవిక్షపితభక్తవ్రాతసంసార శ్రీ

బాహుళ్యప్రదపాదసంస్మరణ పంపాహేమకూటాద్రిఖే
లాహేవాకవిపాకవిస్మరితకైలాసాదికేళీరసా. 117

మాహానాథ=గోరాజైనవృషభమే, "మాహేయీ సౌరభేయీ గౌరుస్రా మాహాచ శృంగిణీ" అని అ. విహారార్థమైనవాహనముగలవాఁడా, కృపా మాహాత్మ్యమనెడి, సాహాయ్యక = సహాయముచేత, ఉత్సాహి = ఉప్పొంగిన, శ్లక్ష్ణకటాక్ష=కటాక్షలేశముచేత, "శ్లక్ష్ణం దభ్రం కృశం" 'అని అ. "కటాక్షోపాంగదర్శనే" అని అ. విక్షిపిత=చెదరమీటఁబడిన, భక్తవ్రాతముయొక్క, సంసార = జన్మాదిబంధముగలవాఁడా, భక్తుల నిత్యులఁజేసెడివాఁడనుట, శ్రీబాహుళ్య = ఐశ్వర్యపరంపరను, ప్రద = చాలాఇచ్చెడి, పాదసంస్మరణముగలవాఁడా, పాదారవిందస్మరణమువల్ల సంపదను, ప్రసన్నతవల్ల మోక్షము నిచ్చెడివాఁడుగనుక, పంపానదియందుఁగల, హేమకూటాద్రియందుఁగల, ఖేలా=విహారముయొక్క, "క్రీడా ఖేలా చకుర్దన" మని అ. హేవాక=హృదయంగమమైన, విపాక=పరిచయముచేత, విస్మరిత=మఱువఁజేయఁబడిన, కైలాసాది = కైలాసగంగలయొక్క, కేళీరసా=విహారాపేక్షగలవాఁడా, హేమకూట పంపానదులు కైలాసగంగలకంటె శ్రేష్ఠములనుట.

క. పెదవేంకటాద్రిహృదయా, స్పదపదవిన్యాసతుంగభద్రావీచీ
మృదుశీకరవిరచితనిజ, సదనాంగణరంగవల్లిసౌభాగ్యకళా. 118

రంగవల్లి=ముగ్గులయొక్క.

స్రగ్విణి. బ్రధ్నకోటీసమభ్రాజితేజోఘనా
బుధ్నభావాప్తిసంపుష్టసృష్టిద్రుమా
బుధ్నవద్బోధసంహృష్యదృష్యర్చితా
గృధ్నుతాపూర్వకాకృష్టశిష్టార్చనా. 119

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతంబైన రాఘవపాండవీయంబునందు ద్వితీయాశ్వాసము.

బ్రధ్నకోటీసమ = కోటిసూర్య సమమానట్టుగా, భ్రాజి = ప్రకాశింపుచున్న, తేజస్సుచేత ఘనమైనవాఁడా, బుధ్నభావ=మూలమాటయొక్క, "మూలం బుధ్నోంఘ్రినామకః" అని అ. ఆప్తి=ప్రాప్తిచేత, సంపుష్ట = పోషింపఁబడిన, సృష్టియనెడి, ద్రుమా=వృక్షముగలవాఁడా, బుధ్నవత్ = వృద్ధిఁబొందుచున్న, బోధ = జ్ఞానముచేత,

సంహృష్యత్ = సంతోషించుచున్న, ఋషులచేత, అర్చితా = పూజింపఁబడ్డవాఁడా, గృధ్నుతా = అపేక్షచేత, "గృధ్నుస్తు గర్ధనః - లుబ్ధోభిలాషుక స్తృష్ణ" క్కని అ. అపూర్వకమానట్టుగా, ఆకృష్ట=అంగీకరింపఁబడిన, శిష్టులచేతియర్చనలుగలవాఁడా.

గద్యము. ఇది శ్రీమన్మదనగోపాలకృపాకటాక్షసంప్రాప్తసారసారస్వత సంపదానంద నందవరకులక్షీరపారావార తారకాసుధాధామముద్ద రాజు గణపయామాత్య పెదరామధీమణిప్రదర్శితం బైన రాఘవ పాండవీయాదర్శంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# రాఘవపాండవీయము.

## తృతీయాశ్వాసము.



మద్ధారీపరమ
ప్రేమాస్పద యాకువీటి పెదవేంకటధీ
ధామ సదాలసదసదృ
గ్భూమ విరూపాక్ష హేమకూటాధ్యక్షా! 1

సదా = ఎల్లప్పుడును, లసత్=ఒప్పుచున్న, అసదృక్=సరిలేని, భూమ=మహిమ గలవాఁడా, "పృథ్వాదిభ్యఇమనిచ్ బహోర్లోపోభూచబహోః" అనుసూత్రములచే ఇమనచ్ప్రత్యయముయొక్క యికారమునకు లోపమును బహుశబ్దమునకు భూ అనునాదేశమును.

వ. అవధరింపుమట్లు రంజిల్లుచున్న యయ్యతీంద్రసామ్రాజ్యధౌరేయుండు.

రా. అతీంద్ర = ఇంద్రునతిక్రమించిన, సామ్రాజ్యధౌరేయుండు=దశరథుఁడు.

భా. యతీంద్రసామ్రాజ్యధౌరేయుండు = మునీశ్వరోత్తముఁడైన నారదుఁడు.

తే. అతిశుభార్థసంపత్పదంబై నవసుధ
మహిమ నేలుచు వాత్సల్యమధురిమమున
నతని నలరింపుచును బ్రియంబగుసభాజ
నప్రధానహితోక్తిబృందమున నంత. 3

వ. ఇట్లనియె. 4

భా. అతిశుభ = మిక్కిలియుఁనింపైన, అర్థసంపత్ = భావపుష్టిగల, పదంబై= వాక్యములుగలవాఁడై, నవ=నూతనమైన, సుధ=అమృతముయొక్క, మహిమను, ఏలుచుఁ = అతిక్రమించుచును, అతనిఁ=ధర్మరాజును, అలరింపుచును, ప్రియంబగు= ప్రియమైన, సభాజన = సన్మానమే, "ఆనందనసభాజనే" అని అ. ప్రధానముగాఁ గలహితోక్తిబృందముచేతను.

రా. అతిశుభమైన, అర్థసంపత్, ద్రవ్యసమృద్ధికి, పదంబైన=స్థానమైన, వసుధ= భూమిని, ఏలుచు, వాత్సల్య = నెనరుచేతనైన, మధురిమమునఁ = ప్రేమముచేతను,

“స్వాదుప్రియా తుమధురౌ” అని అ. సభా=సభయందుఁగల, జనులయొక్కయు, ప్రధాన = సుమంత్రాదిమంత్రులయొక్కయు, హితోక్తిబృందమునన్ = ప్రియ వాక్యముచేతను, అతనిన్ = ఆరాముని, అలరింపుచు, ఇట్లనియె నని ముందరి కన్వ యము.

క. క్రమమున ధరణీభరణ, క్షమ మగుతద్ధర్మనీతి చాతుర్యవిశే
 ష మశేషమరసి యధిక,ప్రమదుఁ డయిప్రసంగవశతరప్పించి తగన్. 5

రా. తత్=ఆరామునియొక్క, ధర్మనీతి, ప్రసంగవశతచేత, రప్పించి=రాముని రప్పించి.

భా. తద్ధర్మ=ఆధర్మరాజుయొక్క, ప్రసంగవశతను రప్పించి=ప్రసంగమును దెప్పించి యనుట.

సీ. బంధురంజనరామభద్ర ధర్మాత్మజ
 యైశ్వర్యశోభిత యన్వయైక
 పావన పాండురాజీవరమాధుర్య
 శోభననయనవసుప్రతాప
 నిర్మలప్రౌఢివినీతత్వవిజ్ఞాన
 సౌశీల్యశౌర్యాది సద్గుణములు
 విని యుబ్బుచున్న వాఁ డనుమోదగరిమఁ ద
 త్ప్రేరణఁ జేసి యేఁ దివిరి నిన్నుఁ
తే. బనిచెద సమస్తమహిరాజ్యపాలనముగ
 రంబునుతికెక్కఁజేయుము రాజసూయ
 మానచంద్రికాస్ఫూర్తియుఁ బోనికీర్తి
 మున్ను గాఁబర్వి కకుబంతములఁ దలిర్ప 6

భా. బంధురంజనముచే, రామ=ఒప్పెడి, భద్ర = శుభములుగలవాఁడా, “స్వశ్రే యసం శివం భద్ర” మ్మని అ. ధర్మాత్మజ, ఐశ్వర్యశోభిత, పాండురాజు, ఈ = నీయొక్క, వరమాధుర్య, శోభననయ, నవసుప్రతాప, నిర్మలప్రౌఢి, వినీతత్వ, విజ్ఞాన, సౌశీల్య, శౌర్యాదిసద్గుణములు విని యుబ్బుచున్నవాఁడు, అనుమోదగరిమచేత, తత్ = ఆపాండురాజుయొక్క, ప్రేరణఁజేసి = పనుపుటచేత, రాజ్యపాలనము నుతి కెక్క, ఆన = ఆజ్ఞ, తద్భవపదము, కీర్తిమున్నుగా = కీర్తికంటె ముందరఁగా, తలిర్ప, రాజసూయము చేయుమని యన్వయము.

రా. బంధురరంజన, రామభద్ర, ధర్మాత్మ, జయైశ్వర్యశోభిత, అన్వయైకపావన, పాండురాజీవ = తెల్లదామరభంగి, రమాధుర్య=లక్ష్మిని వహించినవై, శోభనములయిన, నయన=కన్నులుగలవాఁడా, వసు = అష్టవసువులయొక్క, ప్రతాపమువంటిప్రతాపము గలవాఁడా, ఇవి సంబోధనలు. నిర్మలప్రౌఢివి = కళంకములేని ప్రజ్ఞగలవాఁడవు. నీ = నీయొక్క, తత్త్వ = సిద్ధాంతమైన, విజ్ఞాన=శాస్త్రజ్ఞానమును, "మోక్షే ధీర్జ్ఞానమన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః," అని అ. సౌశీల్య=సద్వర్తనయు, శౌర్యము నాదిగాఁగల సద్గుణములను విని, మోదగరిమౕ=సంతోషాతిశయముచేత, ఉబ్బుచున్నవాఁడను, తత్ = ఆయా మోదగరిమయొక్క, ప్రేరణచేత, ఏనుబనిచెద, రాజ=చంద్రునిచేత, "రాజా ప్రభౌ నృపే చంద్రే"అని వి. సూయమాన=సృజింపఁబడుచున్న, కీర్తైనదనుట, చంద్రికాస్ఫూర్తియుంబోని = వెన్నెల నిగ్గుగలిగిన, కీర్తి, కకుబంతములౕ = దిగంతములయందు, "దిశస్తు కకుభః కాష్ఠాః" అని అ. తలిర్పౕ=ప్రకాశించునట్లుగా, రాజ్యపాలనము చేయుము.

క. అనుటయు ముకుళితకరుఁడై
యనఘా మరి నవధరింపు మంతటికొక్కుం
డనె యే నొండొకపని నా
కనుగ్రహింపు మన మఱియు నతఁ డిట్లనియెన్. 7

రా. భా. రెంటికి సమము సులభము.

చ. జనకునియాజ్ఞ యన్న నవిచార్యము మున్నిది యెన్నిచూడుమా
యనయమసన్నిధిౕ నిను సమర్థతరుం డని నిశ్చయించి పం
చినపని దీనినీవు దగఁ జేయ సదాత్తసుధర్మతౕ సుఖం
బున హరికొల్వొనర్తు నని పూనినవాఁడనయంబు బుద్ధిలోన్. 8

భా. జనకునియాజ్ఞ, అన్న, ఎన్నిచూడుము, ఆయన = పాండురాజు, యమసన్నిధిౕ=యమునిసమ్ముఖమందు, పంచినపనిని దీనిౕ=యాగమును, చేయౕ=చేసినను, సదా=ఎల్లప్పుడును, ఆత్త=పొందఁబడిన, సుధర్మతౕ = దేవసభగలవాఁ డౌటచేత, పూనినవాఁడు=తలఁచినవాఁ డనుట.

రా. జనకునియాజ్ఞ, అన్నౕ=అనినను, అవిచార్య మెన్ని చూడుమా, అనయము=ఎప్పుడును, సన్నిధిౕ=సత్పురుషులకు నిధివైన, నిన్ను, సదా, ఆత్త=స్వీకరింపఁబడిన, సుధర్మతౕ = లెస్సధర్మముగలవాఁడనై, హరికొల్వు = శ్రీహరిసేవను, ఒనర్తు నని బుద్ధిలో నయంబును బూనినవాఁ డనుట.

క. జను లందఱు నీయంద
త్యనురాగముకలిమి నెరపెదరు సత్త్వమహ
త్త్వనిరూఢిఁ బొల్పెసఁగునీ
యనుజులు భవదీయశాసనైకాయత్తుల్. 9

రెంటికి సమము-సులభము.

వ. కావున నమ్మహాకార్యంబు నిర్వహింప. 10

ఆ. అనఘ నీవె తగుదు వనివారితనయాద
రౌచితిఁ గడు నొప్ప నాయతిశుభ
గుణవశు డనిపించుకొని నిజేచ్ఛఁ జనని
యత్యుదారుఁ డఖిలకృత్యవిదుఁడు. 11

రా. దశరథుఁడు రఘునాథునికి నీతి యుపదేశించెడిప్రకారము, అనఘ, అని వారితమైన, నయ=నీతియొక్క, అదర=అమితమైన, ఔచితిన్ = ఔచిత్యముచేత, "ఈషదర్థే దరం స్మృత" మ్మని అ. కడు, ఒప్పన్=ఒప్పుటచే, నీవె తగుదువు, ఆయతి=ఉత్తరకాలఫలముచేత, శుభములైన, గుణములకు = నిత్యత్వాదిగుణములకు, వశుఁ డనిపించుకొని, నిజేచ్ఛఁజనని=తనఇచ్ఛను నడవనటువంటి, అత్యుదారుఁడు = అతిసమర్థుఁ డయినవాఁడు, అఖలకృత్యవిదుఁడు = సర్వకార్యజ్ఞుఁడు, నీవు నీచెప్పినగుణములుగల వాఁడవు గనుక సకలకార్యములను నెఱుఁగుదు వనుట.

భా. అనఘ, నీవె తగుదువు, అని=పలికి, వారి=పాండవులయొక్కయు, తన యొక్కయు, ఆదరౌచితికడునొప్పఁగా, శుభగుణ = సద్గుణవంతులకు, వశుఁడు=విధేయుఁడు, ఆయతి=నారదుఁడు, అనిపించుకొని = అంపించుకొని, చనన్ = పోఁగా, నియతి=నియమముచేత, "నియతిర్నియమే దైవే" అని వి. ఉదారుఁడు, అఖిలకృత్యవిదుఁడు, అవనివరేణ్యుఁడని ముందరిపద్యమున కన్వయము.

ఆ. ఆయవనివరేణ్యుఁ డాయాగమవ్యయా
గమసముచితధర్మగతి నడపుట
కై జయింపవలయు నాశల నన్నింటి
నని కృతిజనగోష్ఠినాకళించి. 12

భా. ఆ, అవనివరేణ్యుఁడు=ధర్మరాజు, అవ్యయ = నాశములేని, ఆగమసముచిత=వేదోచితమైన, ధర్మగతిన్=ధర్మవర్తనచేత, ఆ, యాగమును, నడపుటకై = చేసెడికొఱకు, ఆశలన్ = దిక్కులను, జయింపవలయునని, కృతిజనగోష్ఠిన్ = విద్వజ్జనులతోడి ప్రసంగముచేత, ఆకళించి = తెలిసి, రిపులనేలఁగలిపె ననుపర్యంతము కుళకము.

రా. అవనివరేణ్యుఁడు, ఆయాగమ = ఆదాయప్రాప్తికిని, వ్యయాగమ=వ్యయప్రాప్తికిని, సముచిత=తగిన, ధర్మగతిన్ = ధర్మవర్తనను, నడపుటకై, 'సీ. ఆయంబునందు నాలవభాగమొండె మూఁడవభాగమొండె నందర్ధమొండెఁ, గానివ్యయముసేయరాదు నరపతికిని' అని సభాపర్వములోఁ జెప్పినాఁడుగనుక, ఆశలన్ = వాంఛలను, ఆశలను జయింపనివానికి నుచితధర్మమునడవదు గనుక, అనికృతి=శఠత్వములేని-కపటములేనివా రనుట, జనులతోడి=గోష్ఠిచేత, ఆకళించి = తెలిసి, ఆయవ్యయౌచిత్యమును, ఆశాజయోపాయమును దెలిసి నడపు మనుట.

తే. సత్త్వధర్మకళావిరాజత్ప్రతాప
ఘనుఁడు రాజులలోఁ బెద్ద యనఁగఁ జనుఁ బ్ర
కృష్టతనుజరాసంధుండు కేవలముని
జేష్టకర్మాక్షముం డని యెన్ను మదిని. 13

రా. సత్త్వ=బలిమిచేతను, ధర్మకళా = ధర్మశాస్త్రముచేతను, విరాజత్ = ఒప్పుచున్న, ప్రతాపముచేతను, ఘనుఁడు=అధికుఁడైనవాఁడు, పెద్దయనఁగ, చనున్=తగును, ప్రకృష్ట=అధికమైన, తను=శరీరముయొక్క, జరా=ముదిమియొక్క, సంధుండు = సంధానముగలవాఁడైనను, ముదిసినవాఁడైననుట, నిజ = తనకు, ఇష్టమైన, కర్మ=ప్రయోజనమందు, అక్షముండు = అసమర్థుఁడు, తనముదిమిచేత నాచారలోపమేకాని పెద్దతనము కలిగియుఁ నియమములేక యుండును, అని=ఇటని, మదిన్=మనస్సున, ఎన్నుము, తాను ముదివాఁడు గనుక రాజ్యపాలనమునకు నీవె తగుదువని తాత్పర్యము.

భా. సత్త్వ=బలిమిచేతను, ధర్మకళా = ధనుర్విద్యచేతను, ప్రకృష్టతన్=అధిక్యమున, జరాసంధుండు, నిజ = స్వకీయమైన, ఇష్టకర్మ = యాగకర్మమందు, "ఇష్టం యాగాదికర్మస్యా" త్తని అ. కరికలభవత్ప్రయోగము. అక్షముండు = ఓర్పులేనివాఁడు, అని, ఎన్నుమదిన్ = ఎంచెడిమనస్సుచేత.

తే. విహితసన్మంత్రుఁ డగుచు వివేకఘనుఁడు
విహతి లేకొప్పునచ్యుతవిజయసంయు
తప్రహితభీమసేనోద్ధతిప్రవృద్ధి
చేత రిపు నేలఁగలపెను సిరులు గొనుచు. 14

భా. విహిత = చేయఁబడిన, సన్మంత్రుఁడగుచు = మంచియాలోచన గలవాఁడై కొంచును, వివేకఘనుఁడు=ధర్మరాజు, ఒప్పుచున్న, అచ్యుతవిజయసంయుత = కృష్ణార్జునసహితముగా, ప్రహిత=అంపఁబడిన, భీమసేనునియొక్క, ఉద్ధతి=ప్రహారములయొక్క, ప్రవృద్ధిచేత, రిపున్ = శత్రుఁడైనజరాసంధుని, నేలఁగలపెన్ = సంహరించెను.

రా. విహితసన్మంత్రుఁడగుచున్=మంచివారితో నాలోచనచేసినవాఁడై, వివేకఘనుఁడైన జనుఁడు, అచ్యుత = జాఱని, విజయముతోడ సంయుతమైన, ప్రహిత=అత్యంతవిహితమైన, భీమ = శత్రుభయంకరమునైన, సేనయొక్క, ఉద్ధతి=ఔద్ధత్యముయొక్క, ప్రవృద్ధిచేత, రిపునేలఁగల=శత్రువుయొక్కభూమియందుఁ గలిగిన, పెనుసిరులు=అధికసంపదలను, కొనుచు, ఒప్పునని క్రియ.

మ. స్వనిదేశోన్నతి నంతటన్ నెఱయుచున్ శక్తిం జతుర్దిఙ్నరేం
ద్రనికాయంబును గెల్చి తమ్ము లసమానప్రాప్తవిత్తార్పణం
బునఁ దన్వ న్వశులైనబ్రాహ్మణులతోఁ బూర్ణాధ్వరారంభుఁడై
యనఘుశ్రీఁ బృథివీశుఁ డొప్పెసగురూఢాపూర్వసత్కీర్తితోన్. 15

రా. స్వనిదేశోన్నతిన్ = స్వాజ్ఞామహిమచేత, అంతటన్ = అన్నిచోటులను, చతుర్దిక్కులందుల, గెల్చి, తమ్ము, లసమాన=ఒప్పునట్లుగా, ప్రాప్తమైన = ధర్మార్జితమైనదనుట, విత్త=ధనముయొక్క, అర్పణంబునన్=దానముచేత, తన్వన్=తనియింపఁగా, తమ్ముఁ దన్పఁగా ననుట, వశులైన=విధేయులైన, బ్రాహ్మణులతోఁగూడ, రూఢ=ప్రసిద్ధమైన, అపూర్వ=వింతైన, సత్కీర్తితోడ, పృథివీశుఁడు, ఒప్పెసగున్, క్రియ.

భా. అంతటను, తమ్ములు=భీమాదులు, అసమానమానట్టుగా, పూర్ణ=ఈడేఱిన, అధ్వర = యాగముయొక్క, ఆరంభముగలఁవాఁడై, సగురు = తండ్రితోఁగూడునట్లుగా, ఊఢ=వహింపఁబడిన, పృథివీశుఁడు = ధర్మరాజు, ఒప్పెన్=క్రియ.

ఉ. క్లిష్టత యించుకంతయును లేక మనఃప్రమదంబుతోడ నా
యిష్టము నిర్వహించి పృథివీశులలోపల నర్హభీష్మసం
సిష్టిమెయిం గరం బొనరిచెందుదనుత్తమపూజ చక్రికు
త్కృష్టత నుర్విలోనసమతేజుఁడవీవని పల్కె నెమ్మితోన్. 16

భా. ఆయిష్టము=ఆయజ్ఞమును, నిర్వహించి=చేసి, అర్హమైన, భీష్మునియొక్క, సంసిష్టిమెయిన్=అనుజ్ఞచేత, తుదన్=యజ్ఞసమాప్తియందు, అసమతేజుఁడవు, ఈవు, అని, చక్రికిన్=కృష్ణునికి, ఉత్తమపూజ నొనరించెను.

రా. నాయిష్టము=నాకోరికను, అర్హ=తగుమైన, భీష్మ=భయంకరమైన, సంసిష్టిమెయిన్ = సమ్యగాజ్ఞచేత, అనుత్తమపూజ = అత్యుత్తమపూజను, చెందుదు=పొందుచున్నాఁడవు, చక్రికిన్ = విష్ణువునకు, సమ=సమానమైన, తేజుఁడవు, అని, పల్కె, నడపెనని ముందరిపద్యమునఁ గ్రియ.

తే. మఱియుఁ దగుమాటలాడి యమర్త్యకార్య
నియత లీలావతారు నన్నీలవర్ణు

గడు నంతఁ దెలివొంది కటకటా వీఁ డింత
చేయునే యే నిదె చెండివైతు
వెస వీని నత్యంత విశ్రుతినాసత్వ
మును జెందునట్లుగా ననుచు రేసి
సరభసోత్థానుఁ డై కరములసద్దశ
నమ్ములనైపుణి ముమ్మరముగఁ
ఆ. దనతలఁచినయట్లు దనుజశార్దూలున
వార్యమన్యువికృత వదనుఁ గాఁగ
నవయవములు వ్రచ్చి యభ్రమ్మునకుఁ బాఱ
నడఁచె వాఁడు పిడుగు నట్లమ్రోయ. 200

భా. అనిషేధనీయ=మాన నశక్యముగాని, మానుండై = అభిమానముగలవాఁడై, వివస్వత్తనూభవుండు = కర్ణుఁడు, తెలివొంది = ధైర్యముఁదెచ్చుకొని, అత్యంతవిశ్రుతి= అత్యంతప్రసిద్ధి, నా, సత్త్వమును = బలిమిని, చెందునట్లుగా, నాశౌర్యమునకుఁ గీర్తివచ్చునట్లుగాననుట. వీనిఁజెండివైతుననుచు, సరభసమైన, ఉత్థాన = ఉత్సాహము గలవాఁడై, కరము = మిక్కిలి, లసత్ = ఒప్పుచున్న, దశన్ = అవస్థను-భంగిననుట. అమ్ములనైపుణి = బాణచాతుర్యము, ముమ్మరముగ, దనుజశార్దూలున్ = ఘటోత్కచుని, మన్యు = క్రోధముచేత, వికృతవదనుఁగాఁగ, అభ్రమ్మునకున్ = ఆకాశమునకు, పాఱ నడఁచెన్=పాఱఁగొట్టెను.

రా. అనిషేధ=అడ్డపెట్టుటలేకుండునట్లుగా, నీయమానుండై =కొంపోఁబడుచున్న వాఁడై, వివస్వత్తనూభవుండు = సుగ్రీవుఁడు, తెలివొంది = మూర్ఛఁదెలిసి, అత్యంత మును, విశ్రుతినాసత్వమును = విగతములైన కర్ణనాసికములుఁకలవాఁడౌటను, చెందునట్లుగా, సరభస = వేగముతోఁగూడిన, ఉత్థాన = ఎగయుటకలవాఁడై, కరములన్= హస్తములచేతను, సద్దశనమ్ములన్ = వాఁడిపండ్లచేతను, అవార్యమైన, మన్యున్=కోపము గల, దనుజశార్దూలున్ = కుంభకర్ణుని, వికృతవదనుఁగాఁగ, వ్రచ్చి, అభ్రమ్మునకు, పాఱన్ = ఎగయఁగా, వాఁడు=ఆకుంభకర్ణుడు, అడఁచెను=గ్రుద్దెను.

వ. అప్పు డప్పద్మబంధునందనుండు. 201

తే. ఈతెఱంగున ఘనదైత్యు చేత నొవ్వఁ
బొడువఁబడియునుఁ గ్రమ్మఱఁ బొడువనీక
చనియె ననిభృతప్రీతితో వినుతి సేయఁ
దనబలము గూడ దనుజుండు గనలె మిగుల. 202

రా. క్రమ్మఱంబోదువనీక = మఱేంబట్టువడక, అనిభృత=వ్యక్తమైన, ప్రీతితో, తనబలము, కూడఁ = కూడునట్టుగా, చనియెను, దనుజుండు = కుంభకర్ణుఁడు, కనలెను.

భా. క్రమ్మఱంబోదువఁ = తిరుగవానిజయించుటకు, నీకచనియె = నీకొఱకునికే చెల్లెను. అని=ఇట్లని, భృత=భరింపఁబడిన ప్రీతితో, వినుతిసేయఁ = స్తోత్రముచేయఁగా, తనబలము=తనసేనను, కూడఁగా, దనుజుండు=ఘటోత్కచుఁడు, కనలెను.

ఉత్సాహ. కనలి యసుర ప్రళయకాలు కరణిఁ బేర్చి పగఱ బ
ల్మోనల కుఱికి యుఱికి గదియ మోది యాశుభక్షణం
బున మదించుతనకు జడిసి పోటుదొరలు దెరలఁగా
వనజమిత్రసంతతి నన వద్యుఁ జేరెఁ బోరికిన్ 203

భా. ఆ, శుభలక్షణంబునఁ = శుభమైనయుత్సవముననే, "నిర్వ్యాపారస్థితౌ కాలవిశేషోత్సవయోః క్షణః" అని అ. శూరునికి యుద్ధమే యుత్సవము గనుక, వనజ మిత్రసంతతిఁ=కర్ణుని, చేరెను.

రా. కనలి, అసుర=కుంభకర్ణుఁడు, ఆశు = శీఘ్రమైన, భక్షణంబున, వనజమిత్ర సంతతిఁ=సూర్యవంశముగల, అనవద్యుఁ=రాముని, చేరెను. కడమ సరి.

వ. చేరి యి ట్లనియె. 204

సీ. విను నీవు వాంద్రవీం ద్రను జయించితి నని
క్రొవ్వకు మిచట న క్కొఱఁదిఁబోఁడు
భూరిప్రతాపసిం దూరయశశ్చామ
రాత్యలంకృతకకుబంతదంతి
కుంభకర్ణుఁడు రణ క్రూరుండు భీమసు
తుండాహుతత్వదుద్దండబలుఁడు
బలురక్కసుఁడు పోరఁ బ్రబ్బినాఁ డిట్టిన
న్నెఱిఁగి మార్కొను మిప్పు డేఁ బృథురణ
తే. వైభవాలంబసదనుజ వధవిధి నిను
గలఁచి యిదె మ్రింగఁ గదిసితి నిలునిలు మని
ప్రౌఢి గనుటకుఁ దగ దాశరథివరేణ్య
కర్ణ కఠినముల్ నీశౌర్య కథలు సభల. 205

రా. కుంభకర్ణుఁడు రామునితోననెడుమాట. భూరిప్రతాపమనెడిసిందూరము చేతను. యశః=కీర్తియనెడి, చామరములచేతను, అత్యలంకృత = మిక్కిలి నలంకరింపఁ

బడిన, కకుబంత = దిగంతములయందున్న, దంతి = గజములుగలవాఁడు, భీమ=భయంకర మైన, సు = లెస్సైన, తుండ = ముఖముంచు, "వక్త్రాస్యేవదనంతుండ" మ్మని అ. హుత = వ్రేల్వఁబడిన, త్వత్ = నీయొక్క, ఉద్దండబలముగలవాఁడు, పృథు = అధిక మైన, రణవైభవమునకు, ఆలంబ = అవలంబమైన, సత్=లెస్సైన, అనుజ=నీతమ్ముఁడైన లక్ష్మణునియొక్క, వధవిధిచేత, అని=యుద్ధమందుఁగల, ప్రౌఢిగనుటకు, తగక్ = తగు నట్టుగా, నిను మ్రింగఁగదిసితిని, దాశరథివరేణ్య-సంబుద్ధి. నీశౌర్యకథలు సభలను, కర్ణ కఠినములు=వినఁగూడకున్నవి.

భా. కర్ణునితో ఘటోత్కచుఁ డనెడుమాట. అత్యలంకృతములైన దిగంతదంతుల యొక్క, కుంభకర్ణ = కుంభస్థలములును జెవులునుగలవాఁడు, క్రమముననే యలంకార మిది, భీమసుతుండు = భీమునికుమారుఁడు, ఆహుత = భస్మముసేయఁబడిన, త్వత్ = నీయొక్క, ఉద్దండబలములుగలవాఁడు, పృథు = అధికమైన, రణవైభవముగల, అలంబుస దనుజునియొక్క వధవిధిచేత నినుఁగలఁచి మ్రింగఁగదిసితిని = ఆలంబాసురుని జంపితిని, నిన్నును మ్రింగఁగదిసితిననుట. నిలునిలుము, అని=ఇటని, ప్రౌఢిగనుటకు, ఆశ తగదు, తొల్లింటివలె రణప్రౌఢి నాముందరఁ జెల్లదనుట. రథివరేణ్య = కర్ణ-సంబుద్ధి. నీశౌర్య కథలు=పంతములు, ఇవి చెల్లవని తాత్పర్యము.

క. అని చూపఱ కద్భుతముగ
దనుజుఁడు యుద్ధంబు చేసి తచ్ఛక్తిఁ దుదక్
దనువుతగు లుడుపుకొనియెం
దనవారలు గలఁగఁ బగఱ దళములు సెలఁగన్. 206

భా. తత్=ఆకర్ణునియొక్క, శక్తిక్=ఇంద్రదత్తశక్తిచేత.

రా. తత్=ఆరామునియొక్క, శక్తిక్=బలిమిచేత, కడమ సులభము.

తే. అంత నత్యుగ్ర మగుపోరు గొంత జరుగ
నశ్రముఁ డతికాయాభిఖ్యుఁ డఖిలరణక
ళాధికారి గాంభీర్యతోయధిఘటోద్భ
వుండు ద్రుపదముఖ్యులఁ బలువుర వధించె. 207

రా. అఖిలరణకళాధికులైన, అరి = శత్రువులయొక్క, గాంభీర్యమనెడి, తోయధి = సముద్రమునకు, ఘటోద్భవుండు = అగస్త్యుఁడైనవాఁడు, అతికాయాభి ఖ్యుఁడు = అతికాయుఁడనువాఁడు, ద్రుపదముఖ్యులక్ = వనచరశ్రేష్ఠులను - వానర ముఖ్యుల ననుట. వధించెను.

భా. అంతక్ = ఘటోత్కచుండు నొచ్చినతరువాత, అతి = అత్యంతమును, కాయాభిఖ్య = దేహకాంతిగలవాఁడు, "అభిఖ్యా నామశోభయోః" అని వి. అశ్ర

ముఁడు గనుక దేహకాంతితఱుఁగదనుట. రణకళాధికారి, గాంభీర్యతోయధి, ఘటోద్భవుండు = ద్రోణుఁడు, ద్రుపదముఖ్యులన్ = ద్రుపదుఁడు మొదలయిన వారిని, వధించెను.

మ. అనివార్యుం డతఁ డంతటం దనయమిథ్యామృత్యువార్తాప్రవ
ర్తనచేతం గురుమానసార్పితవిషాదగ్లాని యయ్యెం దనుం
దనునిర్ముక్తునిఁ జేయుచున్ విశిఖసంధానాతివేగప్రపం
చనసౌమిత్రి యనేక యుద్ధకృతిధృష్టద్యుమ్నుఁ డేపారఁగన్. 208

భా. అతఁడు = ద్రోణుఁడు, అంతటను, తనయ = కుమారునియొక్క - అశ్వత్థామయొక్క, మిథ్యా=అసత్యమైన, మృత్యువార్తా ప్రవర్తనచేత, తను, తనునిర్ముక్తునిన్= దేహనిర్ముక్తునిఁగా, చేయుచున్ - తనకుఁదానే దేహము విడుచుచు ననుట. విశిఖ= బాణములయొక్క, సంధానమందు నతివేగమైన, ప్రపంచన = ప్రయోగమందును, సౌమిత్రి=లక్ష్మణుండైనవాఁడు, అనేకయుద్ధములయందు, కృతి = నేర్పరియైనవాఁడు, ధృష్టద్యుమ్నుఁడు, ఏపారఁగా, గురు = అధికమానట్టుగా, పెద్దలయొక్కయనికాని, మానసమందు, అర్పిత= పెట్టఁబడిన, విషాదము చేతిగ్లానిగలవాఁడయ్యెను.

రా. అతఁడు = అతికాయుఁడు, తన = తనయొక్క, విశిఖసంధానమందలి యతివేగముయొక్క, ప్రపంచనన్ = విస్తరించుటచేత, "పచివిస్తారే" అని ధాతువు. సౌమిత్రి=లక్ష్మణుఁడు, యుద్ధకృతి = యుద్ధక్రియయందు, ధృష్ట=దృఢమైన, ద్యుమ్న= సత్త్వముగలవాఁడు, "ద్యుమ్నం స్యాచ్చ బలే ధనే" అని వి. ఏపారఁగా, తనున్= తన్ను, తనునిర్ముక్తునిఁ జేయుచు, తనయొక్క, అమిథ్యా = సత్యమైన, మృత్యువార్త యొక్క, ప్రవర్తనచేతన్ = వినిపించుటచే, గురు=తండ్రియైనరావణునియొక్క, మానసమందర్పితవిషాదగ్లానియయ్యె నని యన్వయము. అతికాయుఁడు నొచ్చెను, ఆవార్త విని రావణుఁడు కష్టిపడెననుట.

వ. అంత. 209

సీ. గురుదివ్యబాణచాతురిని మిాఱినవాని
గారాపుఁబట్టి నఖండవిక్ర
మోగ్రు నెంతయును దుర్యోధనుం డని గెల్పుఁ
దనకొనర్పఁగజాలు నని గణించి
యాతీవ్రబలుబహుభ్రాతృనాశకఘోర
తరమన్యుదళముఖుఁ డరివధమున

కత్యాదరతఁ బంచె నస్త్రనైపుణిఁ జూపె
నతఁడును బ్రతివీరు లపగతరణ
తే. చేష్టులైరి తద్బ్రహ్మాస్త్రవిజృంభణమున
కెదురు లేక మూర్ఛన్మానమదము లడఁగఁ
దత్ప్రతివిధానకుశలాచ్యుతప్రయత్న
మున బిరుసు డింప కపుడొప్పె ననిలసుతుఁడు. 210

రా. గురు=అధికమైన, దుర్యోధనుండని = యుద్ధముసేయ శక్యముగానివాఁడని, బహుభ్రాతృనాశముచేతఁ గఠోరతరములైన, మన్యుక్ = శోకక్రోధములుగలవాని, దశముఖుఁడు = రావణుఁడు, పంచెను=అంపెను. తత్ =అయింద్రజిత్తుయొక్క, బ్రహ్మాస్త్రవిజృంభణమున కెదురులేక, మూర్ఛక్ = మూర్ఛచేత, మానమదము లడఁగఁగా, ప్రతివీరులు = రామాదులు, అపగతరణచేష్టులైరి, తత్ = ఆబ్రహ్మాస్త్రముయొక్క, ప్రతివిధాన=ప్రతిక్రియకు, కుశల=సమర్థములై, అచ్యుత=స్థిరమైన, ప్రయత్నముచేత.

భా. గురుక్ = ద్రోణుని, మిాఱినవాని, ద్రోణునియొక్క గారాపుబట్టని, ఉగ్రుఁడైనవాని, అతీవ్రబలుని, ఇవి యశ్వత్థామకు విశేషణములు. దుర్యోధనుండు, అనిక్=యుద్ధమందు, గెల్చును, ఒనర్పఁగజాలునని, బహుభ్రాతృనాశముచేతఁ గఠోరతరమైన మన్యుదశగల ముఖముగలవాఁడు-ఇది దుర్యోధనునికి విశేషణము. అరివధమునకుఁ బంచెను. తద్బ్రహ్మ=ఆబ్రాహ్మణునియొక్క, అస్త్రవిజృంభణమునకు, మూర్ఛత్= వ్యాపించుచున్న, "మూర్ఛా మోహసముచ్ఛ్రయయోః" అని ధాతువు. మానమును మదము నడఁగఁగా, తత్ = ఆబ్రాహ్మణునిబాణముయొక్క, ప్రతివిధానమునకు, కుశల = సమర్థుఁడైన, అచ్యుత = కృష్ణునియొక్క, ప్రయత్నమున, ప్రతివీరులు, అపగత = విడువఁబడిన, రణచేష్టగలవారలైరి యని క్రిందటికన్వయము. కృష్ణునిమాటవలన నాయుధములు పడవైచి యానారాయణాస్త్రమునకు నమస్కరించి రనుట. అపుడు, అనిలసుతుఁడు=భీముఁడు, బిరుసుడింపకయొప్పెను = నమస్కరించక యుండెననుట.

వ. అంత. 211

ఆ. అతఁడు సకలసైన్య వితతిని సంజీవ,నౌషధీసమాన యనవిహితపు
నఃప్రతిష్ఠగా నొనర్చి వర్ణనకెక్కె, శౌర్యవిక్రమనయ చర్య [illegible]పె.

భా. అతఁడుక్ = భీముఁడును, సంజీవనౌషధీసమాన, అనక్ = అనఁగాను, సైన్యవితతిని, విహిత = చేయఁబడిన, పునఃప్రతిష్ఠ గలదానిగా నొనర్చి వర్ణనకెక్కెఁడి, శౌరి=కృష్ణునియొక్క, అవిక్రమ = క్రమరహితమైన, నయచర్యక్ = నీతిమార్గమును, నడపెను. కృష్ణునియొక్క సంజీవనివంటినీతిచేత భీముఁడు నాయుధమును విడిచెననుట,

రా. అతఁడు = హనుమంతుఁడు, సకలసైన్యవితతిని, సంజీవనౌషధులయొక్క, సమానయన = తెచ్చుటచేత, విహితమైన, పునఃప్రతిష్ఠగాన్ = తిరుగ బ్రతుకుట గలదానిఁగా, ఒనర్చి, శౌర్యముయొక్కయు, విక్రమ = అధికసామర్థ్యముయొక్కయు, నయ=నీతియొక్కయు, చర్యను నడపెను.

తే. అపుడు మనుజేంద్రముఖ్యు లాహరి నుతించి
రనఘ నీదుమహత్త్వ మేమని పొగడఁగ
వచ్చు నారాయణమహాస్త్ర వైభవ మిటు
లఫలముగఁ జేసి రిపులఁ గ్రొవ్వడఁచి తనుచు. 213

రా. హరిన్ = హనుమంతుని, నారాయణ - ఆశ్చర్యవాక్యము, మహాస్త్ర = బ్రహ్మాస్త్రముయొక్క.

భా. మనుజేంద్రముఖ్యులు=ధర్మరాజాదులు, రెంటికి సరి. కడమ సులభము.

చ. అలఘువిపన్మహార్ణవము నట్లు తరించి పునర్మహోద్ధతిన్
వెలిగెడువారిఁ దద్రజని వేగ భయంకరలీలఁ దాఁకి పెం
పలరఁగఁ బోరె వైరిచయ మర్కజుఁ డందు వహించె మిక్కిలిన్
బలిమిఁ బ్రకంపితస్వావృత నాపరిపాలనకార్యభారమున్. 214

భా. తద్రజని=ఆరాత్రి, వేగన్=వేగఁగా, అందు=ఆయుద్ధమందు.

రా. తద్రజనిన్ = ఆరాత్రియందు.

మ. రవిపుత్త్రుం డని కిట్లు పూని ప్రతిగర్జద్వీరసంహారక్ల
ప్తివిరాజచ్ఛరభీష్మకుంభజయశోభివ్యాప్తి మీఱెన్ మను
ష్యవిభుం డుబ్బఁగ నంత నాప్రబలదోషాచారితోఁబుట్టుగున్
భువిఁగూల్చెన్ బవనాత్మజుండు బలిమిన్ దుశ్శాసనాభిఖ్యునిన్. 215

రా. రవిపుత్త్రుండు = సుగ్రీవుఁడు, ప్రతిగర్జత్ = మాఱుమలయుచున్న, వీర=శత్రువులయొక్క, సంహారముయొక్క, క్లప్తి = చేఁతచే, విరాజత్ = ప్రకాశింపుచున్న, భీష్మ = భయంకరుఁడైన, కుంభ = కుంభుఁడనెడి కుంభకర్ణునికుమారునియొక్క, జయముచేత, శోభి = ఒప్పుచున్న, వ్యాప్తిన్ = వ్యాపారముచేత, మనుష్యవిభుండు = రాముఁడు, ఉబ్బఁగ, మీఱెను. ఆప్రబలదోషాచారి = ఆప్రబలుఁడైన నక్తంచరుని యొక్క, "దోషానక్తంచరజనీ" అని వి. తోఁబుట్టుగున్ = తమ్ముఁడైన నికుంభుని, దుశ్శాసన=అణఁపరాని, అభిఖ్యునిన్ = కాంతిగలవాని, "అభిఖ్యా నామశోభయోః" అని అ. పవనాత్మజుండు కూల్చెను.

భా. రవిపుత్త్రుండు = కర్ణుఁడు, విరాజచ్ఛరములుగల భీష్మునియొక్క, కుంభజ = ద్రోణునియొక్కయు, యశోభివ్యాప్తిని, మనుష్యవిభుండు = దుర్యోధనుఁడు,

ఉబ్బఁగ మీఱెన్ = భీష్మద్రోణులకంటెను లెస్సగా జగడముచేసెననుట. ఆప్రబల దోషాచారి=మిక్కిలి దురాచారియైన దుర్యోధనునియొక్క తోఁబుట్టుగును, దుశ్శాసనాభిఖ్యునిన్=దుశ్శాసనుఁడనెడు పేరుగలవాని, పవనాత్మజుండు కూల్చెను.

వ. అంత. 216

సీ. ఆహవమహిమకరాక్షయాతులసత్ప్రి
   తాప మత్యంతమ్ము దనరఁ గనలి
సూర్యసంతతినరవర్యుండు సాహసో
   ద్ధత్యశౌర్యాదిదుర్దాంతవృత్తిఁ
బ్రబలువానిని ధర్మరాజువీడు సొరంగఁ
   దఱిమె బాణముల నెంతయుఁ గలంచి
తద్భ్రాతృభంగ మంతయు నప్పు డరసి వా
   సవినిర్గతుం డయి సరభసమున
ఆ. స్వశ్రితనికురుంబవనశిఖి మేఘనా
దాభిధానుఁ డాబలాఢ్యుమీఁద
నడచి దుర మొనర్చె నభమున నుండి ని
ర్జరులు బెగడ నిగుడు సాయకముల. 217

భా. ఆహవ = యుద్ధముయొక్క, మహిమకర = ప్రభావమును జేయుచున్న, అక్షయ=అక్షయమునయి, అతుల=సరిలేని, సత్ప్రతాపము తనరునట్టుగా, సూర్యసంతతి నరవర్యుండు=కర్ణుఁడు, వృత్తిచేతఁ బ్రబలువాని ధర్మరాజును వీడుఁజొరఁగఁదఱిమెను. తత్=ఆ, భ్రాతృభంగమంతయు నప్పుడరసి, వాసవి=అర్జునుఁడు, స్వశ్రిత=నిజాశ్రితులనెడు, వనశిఖి=అడవి నెమళ్లకు, "శిఖావళశ్శిఖీ కేకీ" అని అ. మేఘనాదమువంటి, అభిధాన = పేరుగలవాఁడు, అర్జునునికి విశేషణము. ఆబలాఢ్యుమీఁదనడచి, సాయకములన్=బాణములచేత, నభముననుండి = ఆకాశమందుండి, నిర్జరులుబెగడునట్టుగా దుర మొనర్చెను.

రా. ఆహవమహిన్ = యుద్ధభూమియందు, మకరాక్షయాతు=మకరాక్షుఁ డను ఖరాసురుని పుత్త్రునియొక్క, "నైరృతో యాతురక్షసీ" అని అ. లసత్ప్రతాపమత్యంతమ్ము తనరుచుండఁగాఁగనలి, సూర్యసంతతినరవర్యుండు = రాముఁడు, వృత్తిచేతఁ బ్రబలెడువానిని=ఆమకరాక్షుని, ధర్మరాజువీడు = యమలోకమును, చొరంగఁదఱిమెన్ = చంపెననుట. తద్భ్రాతృభంగము = ఆమకరాక్షునిమరణమును, అరసి, వాస=గృహము వల్లనుండి, వినిర్గతుండయి, స్వశ్రిత = దేవతలనెడి, వనమునకు, శిఖి=అగ్నివంటివాఁడు,

మేఘనాదాభిధానుఁడు = ఇంద్రజిత్తు, అబలాఢ్యుమీఁదన్ =సేనతోఁగూడిన రామునిమీఁద, నడచి నభముననుండి దురమొనర్చెను. 218

వ. ఇట్లు పోరిపోరి.

ఉత్సాహ. వెరవు నేపుఁ జూపెడుప్రతివీరువిక్రమక్రియా
గరిమమును సహింపలేక కలను దొలఁగిపోయి తాఁ
దిరిగి వచ్చె నీతఁ డింకఁ దెగువ మిగుల నెరప కె
ట్లరుగు ననుచు నహితబలము లలఁగి కలఁగఁ జెలఁగుచున్. 219

రా. గరిమ=మహత్త్వమును, మును=మునుపు.

భా. గరిమమును=అతిశయమును. కడమ సరి.

మ. బలదీప్తాశుగసంతతిప్రబలితస్ఫారప్రతాపోదయో
జ్జ్వలసంయద్రభసంబురుద్రుమఖసంచారక్రియన్ మీఱఁగా
నలఁగించెం బ్రతివీరునట్టియెడ నానాకీశసంతాన మ
య్యలఘుస్థేముఁడు దత్ప్రతాపశిఖ మాయంజేసి యార్చెం దగన్.

భా. బలదీప్తమయిన, ఆశుగసంతతి = బాణజాలముచేత, ప్రబలితమైన, స్ఫార=ప్రకాశింపుచున్న, ప్రతాపోదయముచేత నుజ్జ్వలమయిన, సంయత్ = యుద్ధమందుఁగల, "సంయత్సమిత్యాజిసమిద్యుద్ధ" మని అ. రభసంబు=ఆటోపము, రుద్రునియొక్క, మఖసంచారక్రియన్=దక్షాధ్వరక్రీడను, మీఱఁగా నట్టియెడను, ఆనాకీశసంతానము=అర్జునుఁడు, ప్రతివీరుని = కర్ణుని, నలఁగించెను. అయ్యలఘుస్థేముఁడున్ = కర్ణుఁడును, తత్ = ఆయర్జునునియొక్క, ప్రతాపశిఖన్ = ప్రతాపాగ్నిని, మాయంజేసి యార్చెను.

రా. బలదీప్తుఁడైన, ఆశుగసంతతి = హనుమంతునిచేత, ప్రబలిత=ప్రబలముగాఁ జేయఁబడిన, స్ఫారప్రతాపోదయముచేత నుజ్జ్వలమైన, సంయత్ = యుద్ధముయొక్క, రభసంబు=వేగము, ఉరు=అధికమైన, ద్రుమ=వృక్షములయొక్క, ఖసంచారక్రియన్ = ఆకసమునవిసిరివ్రేయుటచేత, మీఱఁగాన్=మిక్కిలియుఁ నొప్పఁగా, నానా, కీశసంతానము=వానరసమూహము, ప్రతివీరున్ = ఇంద్రజిత్తును, నలఁగించెను, అయ్యలఘుస్థేముఁడున్ = అధికస్థైర్యముగల యాయింద్రజిత్తును, మాయంజేసి=మాయచేత, తత్ = ఆవానరసమూహముయొక్క, ప్రతాపశిఖని, ఆర్చెన్=చల్లార్చెను. 221

వ. అంత.

క. మానవిధి జిష్ణుఁడు సుమి
త్రానందనుఁ డన్నపను పుదంచితవృత్తిన్

మానసధృతిఁ బెనుపఁగ నరి
పై నడరి శరోగ్రవృష్టిఁ బఱఁగించె వడిన్. 222

రా. జిష్ణుఁడు=జయశీలుఁడు, సుమిత్రానందనుఁడు=లక్ష్మణుఁడు.

భా. సుమిత్ర=బంధువులను, ఆనందనుఁడు = సంతోషపెట్టెడువాఁడు. మానస మందుఁగల, ధృతిన్=సంతోషమును, కడమ సరి.

క. శరవర్ష మిట్లు గురియుచుఁ
బరఁగుమహాబలజయానుభావస్థైర్య
స్ఫురణాఢ్యు నతని నతఁడున్
సరభసనారాచవృష్టి సంవృతుఁ జేసెన్. 223

భా. మహత్ = అధికమైన, బలజయములయొక్క, అనుభావస్థైర్యస్ఫురణచేత నాఢ్యుని, అతనిన్=అర్జునుని, అతఁడున్ = కర్ణుఁడును, నారాచవృష్టిచేత, సంవృతుఁ జేసెన్ = ఆవరింపఁబడ్డవానిఁగాఁ జేసెను.

రా. మహాబలజ = హనుమంతుఁడు, యానున్ = వాహనముగాఁగలవాని, అతనిన్ = లక్ష్మణుని, అతఁడున్=ఇంద్రజిత్తును, చేసెను, కడమ సులభము.

వ. ఇట్లు దలపడి. 224

ఆ. సరిగఁ బోరి రక్కసపుజోదు లిరువురుఁ
గరియుఁ గరియుఁ బోలెఁ గడిఁదిలావు
గిరియు గిరియుఁ బోలె గెంటనితాల్మియు
హరియు హరియుఁ బోలె నదటు వొదల. 225

రెంటికి సరి సులభము.

సీ. ఒండొరులసరోషహుంకృతిఁ గెరలుచుఁ
గెరలితూపులవాన గురిసి కురిసి
శరవృష్టిఁ బ్రత్యస్త్రసమితిచే నఱుకుచు
నఱికి పై నమ్ములు పఱపి పఱపి
సాధనవికలత సాధించి మించుచు
మించి నెమ్మేనులు నొంచి నొంచి
దివ్యాస్త్రములు సాలఁ దెగువమై నేయుచు
నేసి నిష్ఫలమైన రేసి రేసి
తే. లలి నాకౌకళ్లకడఁకల లక్ష్మణేంద్ర
జిత్తులాభీలశౌర్యులై చిత్రరణము

సలిపి రొక్కకొంతతడవు వాసవవిరోచ
నాత్మజులసామ్యవిస్ఫూర్తి యావహిల్ల. 226

రా. లక్ష్మణేంద్రజిత్తులు, ఆభీలశౌర్యులై, వాసవ = ఇంద్రునియొక్కయు, విరోచనాత్మజ = బలియొక్కయు, సామ్యవిస్ఫూర్తి యావహిల్లఁ జిత్రరణమును జలిపిరి.

భా. లక్ష్మణునియొక్కయు, ఇంద్రజిత్ = మేఘనాదునియొక్కయు, తుల్యసామ్యముచేత, ఆభీల=భయంకరమైన, శౌర్యముగలవారై, వాసవవిరోచన = ఇంద్రసూర్యులయొక్క,ఆత్మజులు అర్జునకర్ణులు, "ద్వంద్వాంతే శ్రూయమాణం పదం ప్రత్యేకమభిసంబధ్యతే" అను న్యాయమువల్ల వాసవాత్మజుఁడును విరోచనాత్మజుఁడు ననుట.

వ. అంత. 227

ఆ. చతురశల్యరచితసారథ్యయోగాధి
గతమదాతిశయు నఖండధైర్యుఁ
బ్రతిభటుని వధించెఁ బ్రథితాజివిజయుండు
రాముతమ్ముఁడు సురరాజు మెచ్చ. 228

భా. చతురుఁడైనశల్యునిచేత రచితమైన సారథ్యయోగమువల్ల, అధిగత = పొందఁబడిన, మదాతిశయముగలవాని, ప్రతిభటునిన్ = కర్ణుని, వధించెను, విజయుండు, రాముతమ్ముఁడు, కృష్ణుఁడును.

రా. చతుర, శల్య=బాణములచేత, 'శల్యంవంశశలాకాయాంశంకుతోమరయోరపి, శల్యశ్శశ్చిన్మహీపాల శ్శ్వావిన్మదనపాదపః' అని రత్నమాల. రచితమైన సారథియొక్క, అయోగ = వియోగముచేతనయిన, ఆధి = మనోవ్యథచేత, గత = పోయిన, మదాతిశయముగలవాని, ప్రతిభటునిన్ = ఇంద్రజిత్తును, ప్రథితమైనట్టి యాజివిజయముగలవాఁడు, రాముతమ్ముఁడు=లక్ష్మణుఁడు, వధించెను.

సీ. అతిదుర్జయుం డైన ప్రతివీరు నిట్లు రూ
పణఁచి యబ్బలుమగం డన్నకడకుఁ
జని మ్రొక్క నన్న రేశ్వరుఁ డెత్తి కౌఁగిటఁ
జేర్చి యానందవిజృంభణమునఁ
బరఁగె నామఱునాఁడు ప్రౌఢిమ ద్రవిభుండు
ప్రదళితబహువైరిపంక్తిగళుఁడు
సేనాని యైనను శివుఁ డైనఁ గేశవుఁ
డైన నెదిర్చి నా యస్త్రములకుఁ

తే. బ్రాణములు వెచ్చవెట్టక బ్రతికి పోవ
లేఁ డకట నాకు నరుఁ డేమిలెక్క యనుచుఁ
దనకురుబలౌఘరక్షావిధానమహిమ
గడఁకఁ బెనుపంగ నతనిపై నడచి పోరె. 229

రా. ఆమఱునాఁడు, ప్రోఢిమత్ = ప్రకాశముగల, రవి=సూర్యునియొక్క, భ=కాంతివంటికాంతిగలవాఁడు, ప్రదళిత, బహువైరి, పంక్తిగళుఁడు = రావణుఁడు, నాకు, నరుఁడు=మనుష్యుఁడు, ఏమిలెక్కయనుచుఁ దనకు, ఉరుబలౌఘ = అధికసేనాసమూహముయొక్క, రక్షావిధానమహిమ, కడఁకన్=రోషమును, పెనుపంగ, అతనిపైన్=రామునిమీఁద.

భా. ప్రోఢిచేత, ప్రదళితములైన బహువైరిపంక్తులయొక్క గళములు గలవాఁడు, మద్రవిభుండు=శల్యుఁడు, సేనానియై = దళవాయియై, తనయొక్క కురుబలౌఘముయొక్కయు, అతనిపైన్=ధర్మరాజుమీఁద, పోరెను, కడమ సులభము.

వ. అప్పుడు. 230

తే. ఆనృపతి సైన్యమును గదనాతిలోలు
భానుజులసద్భుజాశక్తి బ్రాపుగఁ గొని
యాఁగెఁ దచ్ఛల్యతేజంబు నతని నొంచె
నని విరూపాక్షుఁ డనఁ బర్వినతఁడు మెఱసి. 231

భా. ఆనృపతి=ధర్మరాజు, కదన = యుద్ధమందు, అతిలోలుభ = అతిప్రియులైన, "లోలుపో లోలుభో లోలః" అని అ. అనుజుల=తమ్ములయొక్క, సద్భుజాశక్తిని బ్రాపుగఁగొని, తత్=ఆశల్యునియొక్క, తేజంబునాఁగెను. అనిన్ = యుద్ధమందు, విరూపాక్షుఁడనన్=రుద్రుఁడనఁగా, పర్వి=ఒప్పెడి, అతఁడు=శల్యుఁడు, అతనిన్ = ధర్మరాజును, నొంచెన్=నొప్పించెను.

రా. ఆనృపతి=రాముఁడు, సైన్యమును, కదనాతిలోలుఁడైన, భానుజున్ = సుగ్రీవునిని, లసద్భుజాశక్తినిఁ బ్రాపుగఁగొని, తత్=ఆరావణునియొక్క, శల్య = బాణములయొక్క, తేజంబునాఁగెను, అతనిన్=సుగ్రీవుని, విరూపాక్షుఁడనఁబర్వినతఁడు=విరూపాక్షుఁడనెడురాక్షసుఁడు, మెఱసి నొంచెను.

వ. ఇట్లు నొప్పించిన నిప్పులు గురియుకోపంబునం జూపు దీపింప నాసమర
శూరు నాలోకించి. 232

రెంటికి సరి సులభము.

ఆ. ఇతఁడు మామకాజి చతురతఁ దెగకపోఁ
డింక ననుచు నాప్తులెల్లఁ జెలఁగ
మిపులఁ గినుకఁ గెరలు రవిసూనునందను
భావ మపుడు వింత యై వెలింగె. 233

రా. ఇతఁడు=విరూపాక్షుఁడు, మామక=నాసంబంధమైన, ఆజిచతురతన్ = యుద్ధచాతుర్యముచేత, తెగకపోఁడు, అనుచు, కినుకఁగెరలు = కోపోద్రిక్తుఁడైన, రవిసూనునందన్=సుగ్రీవునియందు, అనుభావము=ప్రభావము, వెలింగెను.

భా. ఇతఁడు=ధర్మరాజు, మామకున్ = శల్యునిపట్లను, ఆజిచతురతన్ = ఆజిచాతుర్యముచేత, తెగకపోఁడు = ఆగ్రహింపకమానఁడు, అనుచు నాప్తులెల్లఁజెలఁగ, రవిసూనునందను=ధర్మజునియొక్క, భావము వింతయై వెలింగెను.

వ. అవ్వీరశార్దూలంబు పెద్దయుంబ్రొద్దు దద్దయు నుద్దీప్తశౌర్యుండై.

రెంటికిని సరి.

క. అని నేసి చేసి యంతట
మనమునఁ గడుఁ గెరలి యుద్ధ మహిమాతులునిన్
ఘనుఁ బ్రతివీరు విరూపా
క్షునిశక్తిప్రౌఢిచేతఁ గూల్చి చెలంగెన్. 235

భా. యుద్ధమహియందు, మాతులునిన్ = మేనమామయైనశల్యుని, "మాతుర్భ్రాతామాతులః" అని అ. విరూపాక్షునిశక్తిప్రౌఢిచేతన్ = రుద్రుఁడిచ్చినశక్తిమహిమచేత, కూల్చి=చంపి, చెలంగెన్=సంతోషమున నుప్పొంగెను.

రా. యుద్ధమహిమచేత, అతులునిన్ = సరిలేనివాని, విరూపాక్షుని, శక్తి = సత్త్వముయొక్క, ప్రౌఢిచేతఁ గూల్చి చెలంగెను.

క. పరదుస్సహశల్యమహో, దరనాశన మాచరించి తమసైనికులన్
గరమలరించినశౌర్య, స్ఫురితునతనిఁబొగడిరుబ్బుచున్ హరిముఖ్యుల్.

రా. పర=శత్రువులకు, దుస్సహములైన, శల్య=బాణములుగల, "శల్యం వంశశలాకాయాం శంకుతోమరయోరపి, శల్యఃకశ్చిన్మహీపాలః" అని నిఘ. మహోదర=మహోదరుఁడనెడురాక్షసునియొక్క, నాశనము నాచరించి, అలరించిన, అతనిన్ = సుగ్రీవుని, హరిముఖ్యులు=కపిశ్రేష్ఠులు, నుతించిరి=పొగడిరి.

భా. పరదుస్సహమైన, శల్యమహః=శల్యునిపరాక్రమమువల్లనైన, దర=భయముయొక్క, "దరోస్త్రియాం భయే శ్వభ్రే" అని అ. అతనిన్=ధర్మరాజును, హరిముఖ్యులు=కృష్ణాదులు, పొగడిరి, కడమ సరి.

తే. అంతఁ దద్భ్రాతృపుత్త్ర బలాతిశయము
దను మహాపార్శ్వబలనాశమున నలచఁగ
నుడుకుచున్న దుర్యోధను నుగ్రమన్యు
దశముఖు నులూకశకునిపాతము గలంచె. 237

భా. అంత, తత్=ఆధర్మరాజుయొక్క, భ్రాతృ=తమ్ములైనభీమాదులయొక్కయు, పుత్త్ర = ప్రతివింధ్యాది ద్రౌపదేయులయొక్కయు, బల = ధృష్టద్యుమ్నాదిబలము యొక్కయు, అతిశయము, తనుక్=తన్ను,మహత్=అధికమైన, పార్శ్వబల=పరివారము యొక్క, నాశమునక్=హానిచేత, ఉడుకుచున్నదుర్యోధనుని, ఉగ్రములైన, మన్యు= శోకరోషములయొక్క, దశ=అవస్థగల, ముఖుక్ = ముఖముగలవాని, దుర్యోధనునికి విశేషణము, ఉలూకునియొక్కయు, శకునియొక్కయు, పాతము = నాశనము, కలంచెక్=వ్యాకులపడఁజేసెను.

రా. అంత, తత్=ఆసుగ్రీవునియొక్క, భ్రాతృపుత్త్రుఁడైన యంగదునియొక్క బలాతిశయము, మహాపార్శ్వ=మహాపార్శ్వుఁడనెడు రాక్షసునియొక్క, బలనాశమునక్=కూల్చుటచేననుట, తనుక్=తన్ను, నలచఁగ, దుర్యోధనుక్ = యుద్ధముసేయ శక్యముగానివాని, దశముఖుక్=రావణుని, ఉలూక = గూబలనెడి, శకుని = పక్షుల యొక్క, "ఉలూకస్తు వాయసారాతి పేచకౌ" అని అ. పాతము=పాటు, కలంచెను, అపశకునమాయె ననుట.

సీ. ఆదుష్టవర్తనుఁ డప్పటితుదకు ని
జానుజపుత్త్రమిత్త్రాదు లొకఁడు
మిడివోక కలనిలో మడియుట యూహించి
వగచుచు నప్పుడు వైరినృపతి
ననుజవిభీషణో దగ్రవిక్రమసహా
యతవిజృంభించుమహాప్రతాపుఁ
దలపడఁ జాలని తాంతధైర్యంబుతో
నరిగి ద్వైపాయన హ్రదమతల్లి
తే. కాగతిని దన్నుప్రతిబల శ్రీ గలంగ
నరిగి మునిఁగెఁ దత్కాండచయంబులోన
మునిఁగి యాఁగెను దనమేను మోయకుండ
దానిదిరమైన వాస్తస్తంభ ధర్మపటిమ. 238

రా. ఆదుష్టవర్తనుఁడు=రావణుఁడు, వగచుచు, వైరినృపతిని, అనుజుఁడైనలక్ష్మణునియొక్కయు విభీషణునియొక్కయు నుదగ్రవిక్రమసహాయత్వముచేత విజృంభించు మహాప్రతాపునిన్=రఘునాయకుని, తలపడన్=మార్కొనుటకు, చాలన్=మిక్కిలి, నితాంత=అధికమయిన, ధైర్యంబుతో, ద్వైప=ద్వీపసంబంధమైన, అయన=మార్గమందుఁ గల, హ్రదమతల్లికా=హ్రదశ్రేష్ఠముయొక్క-మంచిమడుగుయొక్క యనుట, గతిని=ప్రకారమున, తన్నృపతి=ఆరామునియొక్క, బల=సేనలయొక్క, శ్రీ=శృంగారము, కలంగఁగా, అరిగెనని క్రిందటికన్వయము. అరిగి=ఈలాగునడచి, తత్ = ఆరాముని యొక్క, కాండచయంబులోనన్ = బాణసమూహములోను, మునిఁగెను, మునిఁగి=ఈలాగుమునిఁగి, దానిన్=ఆబాణసమూహమును, తిరమై, నవమైన, అస్తంభ=జాడ్యము లేని-ప్రకాశించుచున్నదనుట, ధర్మ=వింటియొక్క, పటిమన్=సామర్థ్యముచేత, మేను మోయకుండ, ఆఁగెను=అస్త్రములకుఁ బ్రత్యస్త్రములనేసెను.

భా. ఆదుష్టవర్తనుఁడు=దుర్యోధనుఁడు, అనుజ=తమ్ములయొక్క, విభీషణ=భయంకరమునయి, ఉదగ్ర=అధికమైన, విక్రమసహాయత్వముచేత, మహాప్రతాపుని, వైరినృపతిన్=ధర్మరాజును, తలపడఁజాలని=ఎదిరింపలేని, తాంత=తగ్గిన, ధైర్యంబుతో ద్వైపాయనమనెడి, హ్రదమతల్లికిన్=హ్రదశ్రేష్ఠమునకు, ఆగతిని=ఆప్రకారమున-ఒంటికాఁడై యనుట, తన్నృపతి=ఆదుర్యోధనుఁడు, అరిగెను, తత్=ఆమడుగుయొక్క, కాండచయంబులోనన్=నీళ్లలోపల, మునిఁగి, తిరమైన, వాఃస్తంభనయొక్క ధర్మగుణము యొక్క పటిమచేత, దానిన్=ఆయుదకమును, మేను మోయకుండనాఁగెను, జలస్తంభన విద్యకలదు గనుక.

వ. అట్టిసమయంబున. 239

చ. అయమితభీమశక్తివిహితానుజపాతనుఁడై కృశించుచు
న్నయహతశోకుఁడమ్మనుజనాథుఁడు భీము మహావిపత్తు నెం
తయును విముక్తవిగ్రహు నొనర్చి సహోదరపీడ కేఁ బ్రతి
క్రియ యొనరించు టెట్టొ యనుఖేదమునం దురటిల్లె మిక్కిలిన్.240

భా. అయమిత=అణఁపఁబడని, భీమునియొక్క, శక్తి=బలిమిచేత, విహిత=చేయఁబడిన, అనుజపాతనుఁడై=దుశ్శాసనాదినాశముగలవాఁడై, అహత=అడఁగని, శోకము గలవాఁడు, మనుజనాథుఁడు=దుర్యోధనుఁడు, భీముని, విముక్తవిగ్రహున్=శరీరరహితుని గా, అను=అనెడి, ఖేదమున, దురటిల్లెన్=కెరలెను.

రా. అయమిత=అడ్డపెట్టఁబడని, భీమమైన శక్తిచేత విహితమైన, అనుజ=లక్ష్మణునియొక్క, పాతనముగలవాఁడై కృశించుచు, నయ=నీతిచేత - ఇది శోకసమయము గాదనునీతిచేత నసుట, హతశోకుఁడమ్మనుజనాథుఁడు = రాముఁడు, భీమున్ =

భయంకరమైనవాని, మహావిపక్షున్ = రావణుని, విముక్తమైన, విగ్రహ = యుద్ధము గలవానింగా, ఒనర్చి=పొంఱద్రోలి యనుట, దురటిల్లెను, కడమ సమము.

సీ. అంతలావునఁ జేర్చి యనిలజుండు నిజాను
జప్రాణదానంబు సలిపి తనదు
మదిలోనమోదసంపదలు నింపుచు నుండ
నానృపాలుఁ డిటని యాత్మ నెంచె
ఘనశౌర్యధైర్యవిఖ్యాతి మిక్కిలిని వ
ర్తిలుచుండ బ్రతుకుమందులనగమును
మానుగ వినివారితోనతాదోషస
త్త్వారూఢినిసమానుఁ డగుచుఁ దెచ్చె
తే. వంశమున కెల్లఁ గీర్త్యభావంబు మిగుల
నీతఁ డీతనిఁ దల్లి దానెట్టివేళఁ
గనియెనో యని జగతిలో ననుజనౌఘ
మెల్ల నవగుణాధికునిఁగా నెన్న కున్నె. 241

రా. అంతన్=అంతటను, అనిలజుండు=హనుమంతుఁడు, నిజానుజ = లక్ష్మణుని యొక్క, ప్రాణదానంబు=బ్రతికించుటను, చలిపి, మోదసంపదలు = సంతోషాతిశయములను, నింపుచునుండఁగా, ఆనృపాలుఁడు = రాముఁడు, ఎంచినప్రకారము చెప్పుచున్నాఁడు, ఈతఁడు=హనుమంతుఁడు, బ్రతుకుమందుల=సంజీవనౌషధులయొక్క, నగమును, వినివారిత=మిక్కిలివారింపఁబడిన, ఊనతాదోష=న్యూనత్వదోషముగల, సత్త్వారూఢిచేత, సమానుఁడగుచు, మానసహితుఁడై, కీర్త్య = కీర్తనీయమైన, భావంబు=వర్తన, మిగులఁగా, తెచ్చెనని క్రిందికన్వయము. జగతిలోనను, జనౌఘము=జనసమూహము, నవగుణ=మనోహరగుణముల చేత, అధికునిఁగా నెన్నకున్నె.

భా. అంత=అంతైన, లావునన్=బలిమి చేత, అనిలజుండు=భీముఁడు, నిజానుజ=దుశ్శాసనునియొక్క, ప్రాణదానంబు=ప్రాణఖండనమును, చలిపి, తనదుమదిలో, అమోదసంపదలు = ఖేదాతిశయములను, నింపుచునుండ, ఆనృపాలుఁడు=దుర్యోధనుఁడు, ఎంచెను, ఖ్యాతిమిక్కిలి, నివర్తిలుచుండన్=పోవుచుండఁగా, బ్రతుకు = బ్రతుకుచున్న, మందుల = నిర్భాగ్యులను, "మూఢాల్పపటునిర్భాగ్యమందాః" అని అ. నగన్=నవ్వఁగా, మును=ముందర, మానుగ, విని=వినియుండియు, వారితోన=వారితో నట్టె, తాన్=తాను, దోషముయొక్క, సత్త్వ=బలిమియొక్క, ఆరూఢిని = ప్రసిద్ధిచేత, సమానుఁడగుచున్ = సరియైనవాఁడై, వంశమునకెల్లకీర్తియొక్కయభావంబును,

తెచ్చెనని క్రిందికన్వయము, ఈతఁడు అనిజగతిఁగో, ననుఁ = నన్ను, అవగుణాధిప నిఁగాఁ=అవివేకిఁగా, ఎన్నకున్నె=ఎంచునేయనుట.

ఉ. ఎంతయు నిబ్బరం బయిన యీహానుమద్బలయుక్తిఁ జేసి యేఁ
బంతము మీఱ ఘోరపరిపంథులఁ ద్రుంచుట యెప్పు డింక నా
ర్జింతునొకో సమీరసుతుచేతకు నీడుగఁ జేసి మేలు దు
స్స్వాంతుఁడు గాఁ డితం డనుయశస్స్ఫురణంబు జగంబులోపలన్.

భా. ఈహను=కోరికను, మద్బలయుక్తిన్=నాబలిమిచేత, పరిపంథులన్=శత్రువులను, త్రుంచుటయెప్పుడు-ఇది యుత్సాహవాక్యము. సమీరసుతు = భీమునియొక్క, చేతకునీడుగఁజేసి యశఃస్ఫురణంబును, ఆర్జింతునొకోయని యన్వయము.

రా. ఈ, హనుమత్=హనుమంతునియొక్క, బలయుక్తిఁజేసి=బలయోగముచేత, ఏన్ = నేను, పరిపంథుల, త్రుంచుట = సంహరించితిఁగదా, సమీరసుతు = హనుమంతునియొక్క, చేతకున్=ఉపకారమునకు, ఈడుగఁజేసి=ప్రత్యుపకారముఁజేసి, యశఃస్ఫురణంబును, ఆర్జింతునొకో=కాకుస్వరము.

వ. అని తలపోయుచు రిపుజయప్రయతమానమానసుం డయ్యె నంత.

సీ. చలపట్టి తనుఁ జంప నముదితోపాయప
ద్ధతి వెదకుచుఁ గని ధర్మరాజు
వెడలఁ ద్రోయఁగ నొండు వెరవులు చాలించి
తనవారినిర్గమోద్ధతిపగఱకు
వెరఁ గొనర్పఁగలంక విడిచి బెట్టిదపుబీ
రమ్మునఁ బఱతెంచి రాజరాజు
సయిదోడుసూడుబంటయి మదనుజఘాతి
నిను మున్ను దెగటార్తు నని నరవరు
తే. భీముఁడాఁకె నపూర్వసం భృతరణరస
భారులై యొండొరులఁ దాఁక వారు గదల
బిరుసు నెరప మండలగతిఁ దిరుగగదుమ
నారదున కబ్బె వేర్వేఱ నయనతుష్టి. 244

రా. ధర్మరాజు=యముఁడు, వెడలఁద్రోయఁగ, తనవారి=తనమూఁకలయొక్క, నిర్గమోద్ధతి వెరఁగొనర్పఁగ, లంకవిడిచి, రాజరాజుసయిదోడు = కుబేరునితమ్ముఁడురావణుఁడు, సూడుబంటయి=పగదీర్చుకొనువాఁడై, మదనుజఘాతినిన్ = కుంభకర్ణునిఁజంపిన, నరవరున్=రాముని, తాఁకెను, వారు=రామరావణులు, కదలన్=చలింపఁగాను, బిరుసు

నెరపన్=శౌర్యముచూపఁగాను, మండలగతిఁదిరుగ, గదుమన్ = పీఁగనొత్తఁగాను, నారదునకు నయనతుష్టి యబ్బెను.

భా. చలపట్టివెదకుచు, ధర్మరాజు=పాండవజ్యేష్ఠుఁడు, వెడలఁద్రోయఁగన్ = వెళ్లఁదీయఁగా, తన=తనయొక్క, వారి=నీళ్లలోనుండి, నిర్గమోద్ధతి = వచ్చెడుపడి, వెరఁగొనర్ప, కలంకవిడిచి, రాజరాజు=దుర్యోధనుఁడు, సయిదోడుసూడుబంటయి = తమ్ములపగదీర్చుకొనువాఁడై, నరవరుని భీమునిఁదాఁకెను. వారు=ఆభీమదుర్యోధనులు, గదలన్=గుదియలచేత, బిరుసునెరప, అబ్బెను. క్రియ.

తే. పొసఁగ నేఁడు గదారణ భుక్తి దొరకె
నాకుఁ గను దనియఁగ నని నారదుండు
సమ్మదముఁ జెందఁ దిర మైనయమ్ములపస
నొండొరుల మించి పోరి రయ్యోధవరులు. 245

భా. గదారణభుక్తి=గదాయుద్ధానుభవము, తిరమై, నయమ్ములపస=నేర్పుపసను.

రా. పొసఁగ, నేఁడుగదా, తిరమైన, అమ్ములపసన్ = అస్త్రకౌశలముచేత, కడమ సులభము.

వ. ఇట్లు గడంగి మహాయుద్ధంబు సేయునంత. 246

ఉ. అంచితనైపుణిం బరఁగు నంబకఘోరతరప్రయుక్తిచే
మించుగదానవోద్ధతిసమృద్ధి గనంబడుచుండఁ బోరు సా
గించుచునుండ మానగుణకీర్తితు రాజులతేనిఁ జూచి శం
కించిరి నమ్మరాదు మనకెల్పనుచున్ హరిముఖ్యు లెంతయున్. 247

రా. అంబక = బాణములయొక్క, ఘోరతరమైన, ప్రయుక్తిచేన్=ప్రయోగముచేత, మించుగ, దానవోద్ధతి=రావణౌద్ధత్యము, కనంబడుచుండ, రాజులతేనిన్= రాముని, చూచి, హరిముఖ్యులు=వానరశ్రేష్ఠులు, శంకించిరి.

భా. అంచితనైపుణిని, అంబక=నేత్రములకు, ఘోరతరమైన, ప్రయుక్తిచేన్ = వ్యాపారముచేత, మించు, గదా = గుదియలయొక్క, నవ = వింతైన, ఉద్ధతి=ప్రహారములయొక్క, సమృద్ధి = అతిశయము, కనంబడుచుండ, రాజులతేనిన్ = దుర్యోధనుని, చూచి, హరిముఖ్యులు=కృష్ణాదులు, శంకించిరి, కడమ సమము.

వ. తదనంతరంబ. 248

క. చేవ చెదరి భీమాశుగ
దావహతికృతోరుభంగ తాపజ్జ్వలితుం

డై విమతుఁ డడఁగ జయమున
వైవస్వతసంతతినృపవర్యుఁడు మించెన్. 249

భా. భీమునియొక్క, ఆశు=తీవ్రమైన, గదా = గుదియయొక్క, అవహతి = మొత్తుటచేత, కృతమైన, ఊరుభంగతా=తొడలువిఱుగుటగలవాఁడౌటయనెడి, ఆపత్ = ఆపదలచేత, జ్వలితుండై = మండుచున్నవాఁడై, విమతుఁడు = దుర్యోధనుఁడు, అడఁగఁగా, వైవస్వతసంతతి=యమపుత్త్రుఁడైన, నృపవరుఁడు=ధర్మరాజు, మించెను.

రా. చేవచెదరి, భీమ=భయంకరములైన, ఆశుగ = బాణములనెడి, దావ=దవానలముయొక్క, హతి = కాల్చుటచేత. కృతమైన, ఉరు=అధికమైన, భంగ=పరాజయములచేతనయిన, తాపముచేత జ్వలితుండై, విమతుఁడు = రావణుఁడు, అడఁగఁగన్=డీలుపడఁగా, వైవస్వతసంతతి = మనువంశమందుఁగల, నృపవర్యుఁడు = రఘునాథుఁడు, మించెను.

తే. భీష్మ గురుకర్ణశల్యరణోష్మనమర
ఘోర మగుయుద్ధ మతనితో వైరి సలుప
ననుపమప్రౌఢిమం బదిదినము లైదు
రెండు నొండు విఘ్నంబు లేకుండ జరిగె. 250

రా. భీష్మ=భయంకరమునై, గురు = అధికమునై, కర్ణ=కర్ణములకు, శల్య=ములుకులవంటిదైన, రణ = ధ్వనియొక్క, ఊష్మన్ = ఉగ్రత్వముచేత, అమర = దేవతలకు, ఘోరమగు = భయంకరమైన, యుద్ధము=జగడమును, తే. 'ప్రాణిపదములు వెలిగాఁగఁ బ్రథమలెల్ల, నరయ నొక్కొకచో ద్వితీయార్థమిచ్చు' ననులక్షణమువల్లఁ బ్రథమకు ద్వితీయార్థము. అతనితోన్ = రామునితో, వైరి=రావణుఁడు, చలుప, అనుపమ=సరిలేని, ప్రౌఢిమంబు=ప్రౌఢిగల, అది=యుద్ధము, దినములైదురెండును = ఏడుదినములు, ఒండువిఘ్నంబులేక=ఒకవిఘ్నమును లేక, జరిగెను.

భా. భీష్మగురుకర్ణశల్యులయొక్క-రణమందుఁగల, ఊష్మన్ = ప్రతాపముచేత, అమరన్ = ఒప్పఁగా, ఘోరమగుయుద్ధమును, అతనితోన్ = ధర్మరాజుతో, వైరి= దుర్యోధనుఁడు, అనుపమప్రౌఢిమన్ = ప్రౌఢిచేత, చలుపన్=నడపింపఁగా, పది, ఐదు, రెండు, ఒండు = ఒకటియు, దినములు = క్రమమున భీష్మాదియుద్ధదినములు, విఘ్నంబు లేకుండ జరిగెను.

వ. అంత. 251

తే. దిగ్వధూజాలధమ్మిల్ల ధృతవిశుద్ధ
కీర్తిగురుసూనుఁ డారాజు కృత్స్నబలని

వేశ మారాత్రిచరగోత్ర విభునిలీలఁ
గలఁచె స్వాపహృతోరువిక్రమతఁ గుంద. 252

భా. దిగ్వధూ = దిక్కులనెడుస్త్రీలయొక్క, జాలముయొక్క, ధమ్మిల్ల=కొప్పుల యందు, ధృత=ధరింపఁబడిన, విశుద్ధ = నిర్మలమైన, కీర్తిగలవాఁడు, గురుసూనుఁడు= అశ్వత్థామ, ఆరాజు = ధర్మరాజుయొక్క, కృత్స్న=సమస్తమైన, "కృత్స్నమశేష" మ్మని అ. బలనివేశము = పాళెము, ఆరాత్రి = దుర్యోధనుఁడు పడినదినమురాత్రి యందే,-చర=చరించెడి, గోత్రవిభుని = హిమవంతునియొక్క, లీలన్ = రీతిచేత, స్వాప= నిద్రచే, "స్యాన్నిద్రాశయనం స్వాపః" అని అ. హృత=హరింపఁబడిన, ఉరువిక్రమము గలదొట చేత, కుందన్ = నిద్రచేత బిరుసుచెడియుండఁగాననుట. కలఁచెన్ = నొప్పించెను.

రా. కీర్తియనెడి, గురు=అధికమైన, సూన = పుష్పములుగలవాఁడు, "సూనం ప్రసవపుష్పయోః" అని అ. ఆరాజు = ఆరఘునాథుఁడు, కృత్స్న=సమస్తమైన, బల= బలిమికి, నివేశము = స్థానమైనవాఁడు, ఆరాత్రిచరగోత్రవిభునిన్ = ఆరాక్షసవంశా ధీశ్వరుఁడైనరావణాసురుని, లీలన్ = అవలీలచేత, స్వ=తనచేత, అపహృతమైన, ఉరు= అధికమైన, విక్రమతన్ = విక్రమముగలవాఁడై, కుందన్=తగ్గుపడునట్టుగా, కలఁచెన్= చలింపఁజేసెను.

సీ. అలఘుదోర్గప్రౌఢిమాతులకృతవర్మసా
హాయ్యకంబున నభేద్యాత్ముఁ డగుచు
నప్పు డావీరయోధాగ్రణి యుగ్రంపు
భల్లవర్షంబులబలిమి నమర
శత్రుమస్తకము లసంఖ్యంబులై ధర
గుంపులు పడుచుండఁ గొట్టికొట్టి
యంతట సత్యమోఘాస్త్రప్రయోగుఁడై
యూర్జితబలు నుత్తమోజుఁ గృష్ణ
తే. తనుభవులసద్వరోదయంబున వెలిఁగెడు
సంగరకృతిధృష్టద్యుమ్ను శాత్రవాసు
పృథుఫణిశిఖండిఁ దెగటార్చి భీమవిజయ
దీప్తమహిమచేతనుదీర్ణతేజుఁ డయ్యె. 253

రా. అలఘు=అధికమైన, దోః=ప్రౌఢిమ = భుజబలముచేత, అతుల=సరిలేనట్టుగా, కృతమైన, వర్మ=జోడుయొక్క, సాహాయ్యకంబునన్ = సహాయత్వముచేత, అభేద్య

మైన యాత్మగలవాఁడగుచు, అప్పుడు, ఆవీరయోధాగ్రణి = రాముఁడు, అమరశత్రు= రావణునియొక్క, మస్తకములు కొట్టికొట్టి, ఊర్జిత = స్థిరమైన, బలము గలవాని, ఉత్తమమైన, ఓజుఁ = తేజస్సుగలవాని, కృష్ణతనుఁ = నీలదేహుని, భవు=ఈశ్వరుని యొక్క, వరోదయంబున వెలిఁగెడు, సంగరకృతి = యుద్ధక్రియయందు, ధృష్ట=ధీర మైన, ద్యుమ్నుఁ=శౌర్యముగలవాని, "ద్యుమ్నం విత్తే పరాక్రమే" అని వి, శాత్ర వులయొక్క, అసు=ప్రాణములనెడి, పృథుపణి=క్రూరసర్పములకు, శిఖండిఁ = నెమలి వంటివాని, ఇట్టిరావణుని, భీమవిజయ దీప్తమైన మహిమచేత, తెగటార్చి = చంపి, ఉదీర్ణ=ప్రసిద్ధమైన, తేజస్సుగలవాఁ డాయెను.

భా. అలఘుదోఃప్రౌఢిగల, మాతుల = మేనమామయయిన కృపునియొక్కయు, కృతవర్మయొక్కయు, వీరయోధాగ్రణి = అశ్వత్థామ, బలిమిచేత, అమర, శత్రు మస్తకములు కొట్టికొట్టి, ఉత్తమోజుసిని, కృష్ణ = ద్రౌపదియొక్క, తనుభవులఁ=ప్రతి వింధ్యాదిపుత్త్రులనును, సంగరకృతి = యుద్ధసమర్థుఁడయిన, ధృష్టద్యుమ్నునిని, శాత్ర వులయొక్క, అసు = ప్రాణవాయువులకు, పృథుఫణి = ఘనసర్పమైనవాని, శిఖండినిని తెగటార్చి భీమవిజయులయొక్క దీప్తమహిమచేత, దీర్ణ = పొమ్మొత్తఁబడిన, తేజస్సు గలవాఁ డాయెను.

వ. అంత. 254

సీ. క్రీడానరుం డైన శ్రీవరుం డిట్లు క్షా
త్త్రప్రక్రియను విజయప్రశక్తి
నిర్వహించుచు శత్రు నిర్మూలనము సల్పి
సొంపుమైఁ దనకును శుభపదవిక
లంకాధిరాజ్యవిలాసపట్టాభిషే
కము స్వపురస్ఫూర్జితముగ నడప
వసుధ నప్పుడు దానవప్రభుత్వవిశేష
పృథుతరదీప్తి విభీషణుండు
ఆ. తేజరిల్లె ధర్మరాజితరక్షమా
పాలదుర్లభతర భాగ్యలక్ష్మి
నేఁడుగా ఫలించె నెఱయ నస్మత్పూర్వ
సుకృత మద్భుత మని సుజను లలర. 255

భా. క్రీడానరుండయిన శ్రీవరుండు = కృష్ణుఁడు, క్షాత్త్ర=క్షత్తృసంబంధమైన- సారథిసంబంధమైన, "సూతః క్షత్తా చ సారథిః" అని అ. ప్రక్రియఁ = వర్ణనచేత,

విజయునికి, ప్రశక్తి = అధికబలమును, నిర్వహించుచు, శుభపదమై, వికలంక = నిష్క-ళంకమైన, అధిరాజ్యవిలాస = సామ్రాజ్యవిలాసమందుఁగల, పట్టాభిషేకమును, స్వపుర= తనపట్టణమందు-అనఁగా హస్తినగరమందు, స్ఫూర్జితముగ నడపఁగా, అప్పుడు, తాన్= తాను, నవప్రభుత్వమందుఁగల, విశేష = వింతరీతిచేత, పృథుతరమైనదీప్తిచేత, విభీషణుండు=భయంకరమైనవాఁడు-చూడ శక్యముగానివాఁడనుట. ధర్మరాజు, ఇతరక్షమాపాల=తక్కినరాజులకు, దుర్లభతరమైన భాగ్యలక్ష్మి చేతఁ దేజరిల్లెను.

రా. క్రీడానరుండయిన శ్రీవరుండు=రఘునాథుఁడు, క్షాత్ర=క్షత్రియసంబంధమైన, ప్రక్రియను = వర్తనచేత, విజయమందుఁగల, ప్రశక్తి = అధికసామర్థ్యమును, నిర్వహించుచు, తనకున్ = విభీషణునకనుట. శుభపదవిక=శుభమైనమార్గముగల లంకాధిరాజ్యపట్టాభిషేకము, స్వ = తనకు, పురః = ముందరికిని-ఎప్పటికిని ననుట. స్ఫూర్జితముగ నప్పుడు దానవప్రభుత్వవిశేషముచేతఁ బృథుతరదీప్తిగలవాఁడు, ధర్మ = సకలధర్మములచేతను, రాజిత=ఒప్పుచున్న, రక్షణ్=సంరక్షణచేత, మాపాలన్ = మాయందు, దుర్లభతరభాగ్యలక్ష్మి నేఁడుగా ఫలించెననుట. అస్మత్పూర్వకృతము = పూర్వపుణ్యము, అద్భుతమని సుజను లలరఁ దేజరిల్లెను.

తే. విష్ణుముఖ్యావతారమై వెలయువిశ్వ
విభుఁడు ననలసహర్షప్రవేశమహిమ
కతనఁ దనచెల్వమతిశుద్ధి గాంచి యమర
వినుతి మిగులఁ జేకొని యేగెఁ దనదుపురికి. 256

రా. విశ్వవిభుఁడు=రఘునాథుఁడు, అనల=అగ్నియందు, సహర్ష = హర్షసహితమైన, ప్రవేశము చేతనైన, మహిమకతనన్=మహిమవల్ల, తనచెల్వ = సీతాదేవియొక్క, మతిశుద్ధిగాంచి=హృదయశుద్ధిని గాంచి, అమరవినుతి=బ్రహ్మాదిదేవతాస్తోత్రము, మిగులఁ జేకొని, తనదుపురికిన్ = అయోధ్యానగరమునకు, ఏగెను. సీతాసమేతుఁడయి పుష్పకారూఢుఁడయి లక్ష్మణవిభీషణసుగ్రీవాదిసమేతుఁడయి వచ్చి ప్రవేశించెను.

భా. విశ్వవిభుఁడు=శ్రీకృష్ణుఁడు, అనలస = అల్పముగాని, హర్షప్రవేశమహిమ కతన, తనచెల్వము = విలాసము, అతిశుద్ధిగాంచి యమరఁగా, వినుతి = ధర్మరాజాది స్తోత్రమును, చేకొని, తనదుపురికిన్=ద్వారకకు, ఏగెను.

వ. అ ట్లేగి యుచితభంగి నంగీకృతసకలసామ్రాజ్యభోగలీలావిశేషుం
డయ్యె నప్పుడు. 257

క. శాంతనవోక్తివిలాసా, త్వత్ప్రాంతసుశిక్షితసమస్తధర్మతఁ జేసెన్
శాంతిఘనుఁడు వైవస్వత, సంతతినృపశేఖరుఁడు ప్రజాపాలనమున్.

రా. శాంతములునైన, నవ = మనోహరములైన, ఉక్తివిలాస = అగస్త్యాదిముని వచోవిలాసములచేత, అత్యంతమును, సుశిక్షిత = లెస్సగాఁ దెలియఁబడిన, సమస్త = సకలమైనశత్రుమిత్రులయొక్క, ధర్మతన్ = గుణములు గలవాఁడౌటచేత, శాంతిఘనుఁడు, వైవస్వతసంతతి = మనువంశమందుఁగల, నృప = రాజులకు, శేఖరుఁడు = భూషణమైనవాఁడు రఘునాథుఁడు, ప్రజాపాలనమున్=సకలలోకసంరక్షణమును, చేసెను.

భా. శాంతనవ = భీష్మునియొక్క, ఉక్తివిలాస = శాంత్యానుశాసనికపర్వోక్తి విలాసములచేత, సుశిక్షిత = లెస్సగాఁ దెలియఁబడిన, సమస్తధర్మతన్ = సకలధర్మములు కలవాఁడౌటచేత, శాంతిఘనుఁడు, వైవస్వతసంతతి=ధర్మపుత్త్రుఁడయిన, నృపశేఖరుఁడు= ధర్మరాజు, ప్రజాపాలనమును జేసెను.

వ. ఆసమయంబునందు. 259

ఆ. మౌనిపదవిసృష్టమహితనయోత్పన్న
కుశలవసుసమృద్ధి వశత నొదవు
కొదవ లెల్లఁ దీర్చుకొని యవ్విభుండు గా
వించె నశ్వమేధ విధులు వెలయ. 260

భా. మౌని=వేదవ్యాసమునియొక్క, పద = వాక్యములచేత, విసృష్ట = ఇయ్యఁబడిన, మహిత=ప్రసిద్ధమైన, నయ = నీతిచేత, ఉత్పన్న = కలిగిన, కుశల=శుభకరమైన, వసు = ద్రవ్యములయొక్క, సమృద్ధివశతన్ = సమృద్ధియోగము గలవాఁడౌటఁబట్టి, అవ్విభుండు=ధర్మరాజు, అశ్వమేధాదులైన విధులు = సత్కర్మములను, కావించెను.

రా. మౌనిపద=వాల్మీకియొక్కయాశ్రమమందు, విసృష్ట = విడువఁబడిన, మహితనయా=సీతయందు, ఉత్పన్న = పుట్టిన, కుశలవ=కుశలవులయొక్క, సమృద్ధివశతన్= అధికైశ్వర్యప్రాప్తిగలవాఁడౌటచేత, ఒదవుకొదవలెల్లఁ దీర్చుకొని = దేవఋషి పితృతర్పణములు తీర్చుకొని, అవ్విభుఁడు = ఆరామస్వామి, అశ్వమేధాదివిధులను, వెలయన్=ప్రసిద్ధమానట్టుగా, కావించెను.

సీ. శ్రీధాన్యకటకమై చెలువొందె రాష్ట్రంబు
నెలమూఁడువానలు నిండఁ గురిసెఁ
బాడిని బంటలఁ బ్రజలు విజృంభించి
రరిపదవ్యుత్పత్తి యస్తమించె
రోగాపమృత్యువార్తాగంధ మెడలెను
జారచోరాదుల పేరు నుడిగె
వర్ణాశ్రమాచారవర్తనల్ గడు నొప్పె
ధర్మంబు నాల్గుపాదముల నడచె

తే. రామభద్రుండు సన్మార్గరక్షణైక
పరుఁడు దిగవతంసితకీర్తి పాండుసూనుఁ
డుర్విఁ బయిఁ జతురాత్మానుజోపచరిత
చరణుఁ డగుచు సామ్రాజ్యంబు సలుపునపుడు. 261

రా. దిక్=దిక్కులకు, అవతంసిత = అలంకారముగాఁ జేయఁబడిన, కీర్తియనెడి, పాండుసూనుఁడు = తెల్లని పుష్పములుగలవాఁడు, రామభద్రుండు, చతుర = మనోహరమైన, ఆత్మ=హృదయముగల, అనుజ = తమ్ములచేత, ఉపచరిత = సేవింపఁబడిన, చరణుఁడగుచుః=పదములు గలవాఁడై, సామ్రాజ్యంబు సలుపునపుడు, భూమిపై నీలాగు సంతోషమున నుండెను.

భా. రామ=ఒప్పుచున్న, భద్రముగలవాఁడు, దిగవతంసితమైన కీర్తిగలవాఁడు, పాండుసూనుఁడు = ధర్మరాజు, చతుః = నలుగురైన, ఆత్మ=తనయొక్క, అనుజులచేత, ఉపచరిత = సేవింపఁబడిన, చరణములుగలవాఁడౌచు సామ్రాజ్యంబు సలుపునపుడు శ్రీధాన్యకటకమై చెలువొందె రాష్ట్రంబు.

శా. దేవా దేవరప్రేరణంబునన యుద్దీపించువాగ్వైభవ
శ్రీవిస్ఫూర్తిని రామభారతకథాశ్లేషప్రబంధోత్తమ
వ్యావిర్భావము నిట్లు సెందె నిది భవ్యాభవ్యత ల్వాడకిం
పై వర్తిల్లఁ బరిగ్రహింపుము విరూపాక్షా జగద్రక్షకా. 262

శా. క్రీడామాత్రకృతత్రిమూర్తిభరణాంగీకారచూడాపరి
భ్రాడాదిత్యధునీపృషత్పుషితపంపాశైత్యవేధోమరు
ద్రాడారాధితపాదయంఘ్రినఖచంద్రద్యోతసిధ్యత్పురీ
వ్రాడాఖండలమండలీహృదయజీవంజీవసంజీవనా. 263

క్రీడామాత్రముచేత నేకృతమైన, త్రిమూర్తి=బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపములయొక్క, భరణ = ధారణముయొక్క, అంగీకారముగలవాఁడా! త్రిమూర్తులును నీలీలలనుట. చూడా = శిఖయందు, "చూడాకిరీటంకేశాశ్చ" అని అ. పరిభ్రాట్ = ఒప్పుచున్న, ఆదిత్యధునీ=దేవనదియొక్క, "ఆదిత్యాఋభవోస్వప్నాః" అని. "తటినీహ్రాదినీధునీ" అనియు అ. పృషత్ = బిందువులచేత, "పృషంతి బిందుపృషతాః" అని అ. పుషిత=పోషింపఁబడిన, పంపానదియందలి శైత్యముగలవాఁడా! వేధః = బ్రహ్మచేతను, "స్రష్టా ప్రజాపతిర్వేధాః" అని అ. మరుత్=దేవతలకు, "మరుతౌపవనామరౌ" అని అ. రాట్=రాజైన యింద్రునిచేతను, ఆరాధింపఁబడిన పాదములుగలవాఁడా! అం

ఘ్రి=పాదములయందుఁగల, నఖములనెడి చంద్రులయొక్క, ద్యోత = ప్రకాశము చేత, "ప్రకాశోద్యోతఆతపః" అని అ. సిధ్యత్=సిద్ధింపుచున్న, పరివ్రాట్ = యతీశ్వరులకు, 'భిక్షుః పరివ్రాట్కర్మందీ' అని అ. ఆఖండల = ఇంద్రులైన బ్రహ్మర్షులయొక్క, మండలీ=సమూహముయొక్క, 'బింబో స్త్రీమండలం త్రిషు" అని అ. హృదయములనెడి, జీవంజీవ = చకోరపక్షులయొక్క, "జీవంజీవశ్చకోరకః" అని అ. సంజీవనము గలవాఁడా!

క. కారుణ్యవిభవలక్ష్మీ, తారుణ్యసదోపభోగ ధన్యకటాక్షా
శారీరార్ధసులాలిత, గౌరీరారజ్యమాన కమ్రాపేక్షా. 264

కారుణ్యవిభవ=దయాతిశయముయొక్క, లక్ష్మీ=సంపదయనెడి, తారుణ్య=యౌవనముయొక్క, సదోపభోగ = నిత్యానుభవముచేత, ధన్యమైన, కటాక్షముగలవాఁడా! కటాక్షమునకుఁ గారుణ్యమె యౌవనమనుట. శారీర=శరీరసంబంధమైన, అర్ధమందు=అర్ధశరీరమందనుట. సులాలితమైనగౌరియందు, రారజ్యమాన = మిక్కిలి నాసక్తిగలవాఁడౌచును, కమ్ర=మనోజ్ఞమైన అపేక్షగలవాఁడా!

కలహంసవృత్తము.—

హిమనగాద్రితన యేక్షణలక్ష్మీ, స్తిమితపుణ్యఫలదేహవిలాసా
విమలభక్తిపెదవేంకటధాత్రీ, రమణమానసనిరంతరవాసా. 265

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్యతనూభవ సౌజన్యజేయసూరయనామధేయప్రణీతంబైన రాఘవపాండవీయమునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

గద్యము. ఇది శ్రీమన్మదనగోపాల కృపాకటాక్షసంప్రాప్తసారసారస్వతసంపదానందనందవరకులక్షీరపారావారరాకాసుధాధామ ముద్దరాజు గణపయామాత్య పెదరామధీమణిప్రదర్శితంబైనరాఘవపాండవీయాదర్శంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# ఆంధ్ర గ్రంథములు

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| శ్రీమదాంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది | 4 | 0 |
| ,, అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | 6 | 8 |
| ,, 3 సంపుటములు | 7 | 8 |
| శ్రీమదాంధ్రభారతము - పద్యకావ్యము:—అనేక వ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాకితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచి కాలికోబైండు చేయబడియున్నది. | | |
| 7 సంపుటముల ప్రతి | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆరణ్యపర్వము | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 2 | 0 |
| శాంతిపర్వము | 2 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 3 | 12 |
| శాంతిసప్తకము | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు | 1 | 8 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారత విమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికో | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము; కావ్యస్మృతితీర్థ: జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | 14 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | 0 | 12 |
| ,, కాలికోబైండు | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహా | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | 0 | 6 |
| ఉత్తరరామాయణము, కంకంటిపాపరాజప్రణీతము, చక్కని కూర్పు గిల్టుబైండు | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | 2 | 4 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | 0 | 6 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటి కృతము | 0 | 8 |
| గజేంద్ర మోక్షము,సటీక,చక్కనిది | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము | 0 | 10 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు; పీఠిక అతివిపులము | 7 | 8 |
| గరుడాచలం, యక్షగానం, పెద్దచ్చు | 0 | 2 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | 1 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవిది | 1 | 2 |
| ఛందోదర్పణము(అనంతునిఛందం) | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము | 1 | 6 |
| తెనుఁగుసమస్యలు | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కనిప్రతి | 1 | 8 |
| దశావతారచరిత్ర,నూతనముద్రితం | 2 | 0 |
| దశరాపద్యములు | 0 | 1 |
| నరసభూపాలీయము,కాలికోబైండు | 1 | 0 |
| నలోపాఖ్యానము,సటీక చిన్నసైజు | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము | 1 | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | 0 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవిది | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 4 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది | 0 | 12 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవి | 1 | 4 |
| డిటో నారాయణకవికృతము | 0 | 12 |
| ప్రబంధరత్నావళి | 1 | 8 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తది | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | 0 | 8 |
| డిటో విద్వాన్ దూసి రామమూర్తి శాస్త్రివిరచిత సురభివ్యాఖ్యానసహితము | 3 | 0 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథప్రణీతము | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము | 1 | 0 |
| భాస్కరరామాయణము, క్రొత్తది | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకవి | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్లరామస్వామి శాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్న సైజున మేలుకాకితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నారము. | 2 | 0 |
| భోగినీదండకము | 0 | 1 |
| మార్కండేయపురాణము, మారనది | 1 | 12 |
| మూన్నాళ్లముచ్చట, వేటూరి ప్రభాకరశాస్త్రి | 0 | 4 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, | 0 | 10 |
| రంగనాథరామాయణము, ద్విపద | 2 | 8 |
| రాజశేఖరవిలాసము | 0 | 12 |
| రామాభ్యుదయము | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, | 0 | 6 |
| వసుచరిత్ర, సటీక, అనేకనూతనాంశములుగల చక్కనిక్రొత్తకూర్పు | 4 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చినసీతారామస్వామిశాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయములనేకము లిందుఁగలవు | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, మేలుప్రతి | 3 | 8 |




వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.